# ప్రపంచ చరిత్ర

## (నాలవ భాగము)




రచన:

జవహర్‌లాల్ నెహ్రూ

అనువాదం:

చింతా దీక్షితులు

సంస్కృతి ప్రచురణ

34

వెల రెండు రూపాయలు

# విషయ సూచిక

# పటములు



## ర చ యి త

జనం 1889. కాశ్మీర బ్రాహ్మణులు. తండ్రి మోతీలాల్ నెహ్రూ. ప్రఖ్యాత న్యాయవాది. తల్లి స్వరూపరాణి. జన్మస్థానం ప్రయాగ-అలహాబాద్. ఇంటివద్ద కొంతకాలం ప్రైవేటు చదువుకొని హారోలో, కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలోని ట్రినిటీ కళాశాలలో విద్య నభ్యసించారు. అలహాబాద్ హైకోర్టులో న్యాయవాదిగా జీవితాన్ని ప్రారంభించారు. 1918లో ఇండియన్ హోమ్‌రూల్ లీగుకు కార్యదర్శి అయినారు. 1918 నుంచి అఖిలభారత కాంగ్రెస్ సభలో సభ్యుడుగానున్నారు. 1921 లో మొదటిసారి కారాగృహ వాసా న్ననుభవించారు. ఇప్పటికి ఎనిమిది మారులు శ్రీకృష్ణజన్మస్థానాన్ని చూచివచ్చారు. 1929 లో కాంగ్రెస్ కార్యదర్శి అయినారు. 1930 లోను 1936, 37, 46 లలోనూ కాంగ్రెస్ అధ్యక్షులయినారు. 1950 నుంచి మరల నేటివరకు కాంగ్రెస్ అధ్యక్షులుగానే వున్నారు. వివాహితులు. భార్య-కమలా నెహ్రూ చనిపోయింది. కొడుకులు లేరు. ఒక్కతే కుమార్తె-ఇందిరా గాంధీ. చెల్లెండ్రిద్దరు-విజయలక్ష్మి పండిట్, కృష్ణ హఠీసింగ్.

ఈయన గొప్ప ప్రజాస్వామ్యవాది. ఆంగ్లంలో అనేక గ్రంథాలను రచించారు. వీరి రచనలలో 'సోవియట్ రష్యా' 'ప్రపంచ పరిణామము'లను మా ప్రచురణలలో ప్రచురించియున్నాము. నేడు (1952) ఇండియా ప్రధానిగా నున్నారు.

నివాసము : 17, యార్క్ రోడ్డు, న్యూ ఢిల్లీ.

2/114 28.8.64 (9)

88

# చేబరు

సెప్టెంబరు 3, 1932

మనము మళ్లీ ఇండియాకు వచ్చాము. యూరోపులో కొంత కాలము మనము గడిపాము. సంక్షోభములు, అల్లరులు, యుద్ధములు జరగడం చూచాము. వాటి అంతరార్థము గ్రహించ ప్రయత్నించాము. 16, 17 శతాబ్దులలో అక్కడ జరిగే విషయాలు అవగాహన చేసుకో ప్రయత్నించాము. యూరోపులో ఈ కాలమును గురించి నీకెట్టి అభిప్రాయములు కలిగినవో తెలియదు. సదభిప్రాయములూ, దురభి ప్రాయములూ కూడా కలుగక తప్పదు. ఎందువల్లననగా యూరోపు ఆకాలమున గందరగోళముగా ఉండెను. ఎడతెగని అనాగరిక యుద్ధములూ, మతవిషయమున దురభిమానములూ, చరిత్రలో కని విని ఎరుగని కార్శ్యమో, నిరంకుశత్వమో, రాజుల "దైవదత్తాధికారమూ," క్షీణిస్తూన్న కులీనులూ, సంకోచములేకుండా ప్రజలను బాధించి లాభము పొందడమూ—ఇవీ అప్పుడు యూరోపులో ఉన్నవి. ఈ విషయమున చీనా ఎన్నియుగములో యూరోపుకు ముందుండెను. సంస్కృతి, కళలూ, సహనమూ, శాంతీ చీనాదేశములో ఆకాలమున వెలయు చుండెను. ఇండియాలో అప్పుడు విభేదములు చెలరేగుచున్నప్పటికీ, పూర్వౌన్నత్యము క్షీణిస్తూన్నప్పటికీ అనేక విధములుగా యూరోపుకన్న మిన్నగా ఉండెను.

కాని యూరోపులో చెప్పుకోదగ్గ మంచి విషయమొకటి కానవచ్చు చుండెను. విజ్ఞానశాస్త్ర ప్రారంభములు అక్కడ పొడచూపుచుండెను. ప్రజాస్వాతంత్ర్యభావన వృద్ధినొంద ప్రారంభించి రాజుల సింహాసన ములు కదిపివేయ జొచ్చెను. పడమటియూరోపు దేశములలోనూ, వాయవ్యదిశనున్న యూరోపియన్ దేశములలోనూ వృద్ధినొందుచున్న

వాణిజ్య పరిశ్రమలు, పై మార్పులకు కారణమైనవి. గొప్ప నగరములు లేచినవి. దూరదేశములతో వర్తకముచేయు వర్తకులతో అవి నిండియుండెను. శిల్పుల పరిశ్రమల కలకలముతో నగరములు కోలాహలముగా ఉండెను. పడమటి యూరోపు నందంతటా శిల్పసంఘములు పొడచూపినవి. శిల్పులయొక్కయూ, చేతిపనివాండ్ర యొక్కయూ సంఘములివి. ఈ వర్తకులును, పారిశ్రామికులును బూర్జువాజీ—క్రొత్త మధ్యతరతిగా పరిణమించిరి. ఈ తరగతిప్రజ లభివృద్ధి పొందుచుండిరి కాని వారి కాటంకములెన్నో కలుగుచుండెను — రాజకీయమైన, సాంఘికమైన, మతసంబంధమైన ఆటంకములవి. రాజకీయములందును, సాంఘిక నిర్మాణమునందును ఫ్యూడల్ పద్ధతి వాసనలు నిలిచిఉండెను. ఈపద్ధతి గడిచిపోయిన కాలమునకు సంబంధించినది. క్రొత్త పరిస్థితులలో అది ఇమడదు. వర్తక, పరిశ్రమల అభివృద్ధికది అడ్డు తగులుచుండెను. ఫ్యూడల్ ప్రభువులు అనేక విధములగు పన్నులూ, ఆసీళ్లూ వసూలు చేస్తూండేవారు. ఇవి వర్తక తరగతులకు మంటగా వుండెను. కాన బూర్జువాజీ, ఇట్టివారిని అధికారమునుంచి తొలగించుటకై పూనుకొన్నారు. రాజుకూడా ఈ ఫ్యూడల్ కులీనులంటే ఇష్టముగాలేదు. వారతని అధికారమును కబళింపగోరారు. కాన రాజును, బూర్జువాజీయును మిత్రులైనారు. ఫ్యూడల్ ప్రభువులకు వ్యతిరేకముగా పనిచేసి వారికి పలుకుబడి లేకుండ చేశారు. ఇందుకు ఫలితముగా రాజు ఎక్కువ నిరంకుశుడు, ప్రబలుడు అయ్యాడు.

ఈ విధముగానే పడమటి యూరోపులోని ఆనాటి మతసంస్థయున్నూ, వాణిజ్యముచేయు విషయమున ఆనాటి మతభావములున్నూ, వర్తకపరిశ్రమల అభివృద్ధికి ఆటంకముగా వుండెను. అనేకవిధములుగా ఫ్యూడల్ పద్ధతితో మతమునకు సంబంధముండెను. ఉన్న ఫ్యూడల్ భూస్వాములలో అందరికన్న పెద్ద భూస్వామిగా చర్చి వున్నదని యిదివరలో చెప్పియుంటిని. ఇంతకు పూర్వము అనేక సంవత్సరముల

నుండి వ్యక్తులునూ, సంఘములునూ రోమన్‌చర్చిని విమర్శిస్తూ, దానిని ప్రతిఘటిస్తూ వచ్చారు. కాని అందువల్ల గొప్ప మార్పేమీ కలుగలేదు. ఇప్పుడన్ననో తలయెత్తుచున్న బూర్జువాజీ అందరున్నూ మార్పు కోరారు. కాన సంస్కరణోద్యమము బ్రహ్మాండాకారము ధరించింది.

ఈ మార్పులన్నియునూ, మనము ప్రసంగించుకొన్న అనేక విషయములునూ విప్లవాంశలే. ఈ విప్లవము బూర్జువాజీని ముందుకు తీసుకువచ్చెను. పశ్చిమ యూరోపియన్ దేశములలో కొంచెమెచ్చు తక్కువగా ఈ విధముగానే జరిగెను. కాని ఈమార్పులు యీదేశములలో భిన్నకాలములందు సంభవించెను. ఈ కాలమునందును, ఇంకను చాలా సంవత్సరముల వరకునూ తూర్పుయూరోపు పారిశ్రామికముగా చాలా వెనుకబడి యుండెను. కాన అక్కడ ఇట్టిమార్పులేవీ జరుగలేదు.

చీనాలోనూ, ఇండియాలోనూ శిల్పసంఘములూ, ఎందరో శిల్పులూ, చేతిపనివాండ్రూ వుండిరి. పడమటి యూరోపులోకన్న అధికముగా పరిశ్రమ అభివృద్ధిచెంది వుండెను. కాని ఆ దేశములందు యూరోపులోవలె ఈకాలమున విజ్ఞానశాస్త్ర మభివృద్ధి చెందియుండలేదు. ప్రజాస్వాతంత్రమునకై ఆకాంక్ష యూరోపులోవున్న విధముగా లేదు. ఈ రెండు దేశములందును చిరకాలమునుండీ మత స్వాతంత్ర్యమున్నూ, పట్టణ గ్రామములందూ, శిల్పసంఘములందూ, స్థానిక స్వాతంత్ర్యమున్నూ సంప్రదాయ సిద్ధముగా వుండెను. స్థానిక విషయములలో జోక్యము కలుగజేసికొనిన నాడు రాజు అధికారమెట్టిదైనా, నిరంకుశత్వ మెట్టిదైనా వారు లెక్కపెట్టలేదు. ఈ రెండు దేశములును ఒక విధమగు సంఘమును నిర్మించుకొనెను. అది చిరకాలము నిలిచెను. యూరోపులోని ఎట్టిసంస్థయూ ఇంతకాలము మన్నలేదు. దానిస్థిరత్వమూ, కాఠిన్యమూ బహుశా దానివృద్ధిని ఆటంకపరిచి వుండును. ఇండియాలో సంఘము కట్టుబాట్లు చెడుటవల్లా, అది క్షీణదశకు వచ్చుటవల్లా ఉత్తర హిందూస్థానము చివరకు మొగలు జేబరుచే జయింపబడెను. ప్రాచీన

ఆర్యుల స్వతంత్ర భావనలను ప్రజలు పూర్తిగా విస్మరించిరి. పాలకు డెట్టివాడైనా వారూరుకొనిరి. దేశమునకు నూతనజీవనమును తెచ్చిన ముస్లిములు సైతము మిగతవారివలెనే భ్రష్టులై దాస్యబుద్ధితో వుండిరి.

ఈ విధముగా ప్రాచీన, ప్రాచ్యనాగరికతలో కానరాని నూతనోత్సాహమూ, శక్తీ యూరోపులో విజృంభించుటవల్ల యూరోపు మెల్లగా ప్రాచ్యదేశములను మించిపోయింది. దాని పుత్రులు ప్రపంచము నాలుగు మూలలకూ పోయిరి. వర్తక ధనాశలు కారణముగా దాని నావికులు ఆసియాకును, అమెరికాలకును వెళ్లిరి. ఆసియా ఆగ్నేయ భాగమున పోర్చుగీసులు అరబ్బుల మలాకా సామ్రాజ్యమును తుద ముట్టించిరని తెలుసుకొంటిమి. ఇండియాతీరప్రాంతములందును, తూర్పు సముద్రములందంతటనూ వారు స్వల్పసైన్య దళముల నిలుపుకొనిరి. వారి సంబారద్రవ్య వర్తకయాజమాన్యమునకు సముద్రాధికారముగల రెండు నూతనదేశములు పోటీకి వచ్చెను. ప్రాచ్యమునుండి పోర్చుగల్ తరిమివేయబడెను. దాని తూర్పు సామ్రాజ్యమూ, వర్తకమూకూడా తుదముట్టెను. పోర్చుగల్ స్థానమును డచ్చివారు కొంతవరకాక్రమించిరి. తూర్పుద్వీపములనేకము వారాక్రమించుకొనిరి. 1600 లో ఎలిజబెత్తురాణి తూర్పు ఇండియా వర్తకసంఘమునకు ఫర్మానా ఇచ్చెను. ఇది లండను వర్తకుల సంఘము. ఇండియాతో వర్తకము చేసుకొనుటకు ఫర్మానా. రెండు సంవత్సరముల తరువాత డచ్చివారి తూర్పు ఇండియా వర్తక సంఘము స్థాపించబడెను. ఆనాటినుండీ ఆసియాలోని దేశములను యూరోపు గ్రహించుట ప్రారంభమైనది. చాలకాలమువరకూ ఈపని మలయాలోనూ, తూర్పుద్వీపములలోనూ జరుగుచుండెను. మింగుల పరిపాలనమందునూ, 17 వ శతాబ్ది మధ్యలో వచ్చిన మంచూల పరిపాలనమందునూవున్న చీనా ప్రబలమై వుండుటచేత యూరోపు దాని జోలికిపోలేదు. జపాను పరదేశి నెవరినీ దేశములో కాలుపెట్టనియ్య లేదు సరిగదా 1641 లో అది ఎవరితోనూ సంబంధం పెట్టుకోకుండా

ముడిచిపెట్టుకొనెను. ఇక ఇండియామాట ? ఇండియా సంగతి చెప్పు కోవడంలో మనము వెనుకబడ్డాము. కాబట్టి మనమిలోటు భర్తీ చేయ వలెను. కొత్తగా వచ్చిన మొగలు రాజవంశ పరిపాలనమున ఇండియా ప్రబలమగు ఏకాధిపత్యము (Monarchy) గా నుండెను. కాన యూరో పియనులు దండయాత్ర చేయుదురనే ప్రమాదమూలేదు; అట్టి సావ కాశమూలేదు. కాని యూరోపు సముద్రముపై అధికారము నెరపు చుండెను.

మనమిప్పుడు ఇండియాకు వత్తము. యూరోపు, చీనా, జపాను, మలేసియా దేశములలో మనము 17 వ శతాబ్ది చివరకు వచ్చితిమి. 18 వ శతాబ్ది ప్రారంభములో ఉంటిమి. కాని ఇండియాలో మనమింకను 16 వ శతాబ్ది మొదటిభాగములోనే ఉంటిమి. అది బేబరు వచ్చిన కాలము.

1526 లో బేబరు, దుర్బలుడూ, నికృష్టుడూ అగు ఆఫ్ఘను సుల్తానును జయించెను. అప్పుడొక కొత్తశకము ప్రారంభమాయెను. ఒక నూతన సామ్రాజ్యము తలయెత్తెను. అది మొగలు సామ్రాజ్యము. కొద్దికాలము వినాగా 181 సంవత్సరములు, 1526 మొదలు 1707 వరకు, అది నిలిచెను. ఈ కాలములో అది ప్రబలముగా వుండెను. వైభవోపేతమై వుండెను. ఇండియాలోని " గొప్ప మొగలు " కీర్తి ఆసియా యూరోపులలో వ్యాపించెను. ఈ రాజవంశ మున ఆర్గురు గొప్ప పాలకులుండిరి. పిమ్మట ఈ సామ్రాజ్యము విచ్ఛిన్నమాయెను. మహారాష్ట్రులు, శిక్కులు, ఇతరులు సామ్రాజ్య భాగములు గ్రహించి రాజ్యములు స్థాపించుకొనిరి. వారి తరువాత బ్రిటిషువారు వచ్చిరి. కేంద్రప్రభుత్వము విచ్ఛిన్నమగుట, దేశము గందరగోళముగా వుండుట కారణముగా క్రమక్రమముగా వారు వారి అధికారమును దేశములో స్థాపించుకొనిరి.

బేబరును గురించి ఇదివరలో నీకు కొంత చెప్పియున్నాను.

చెంగిజ్, తైమూరుల కుటుంబమునకు చెందిన బేబరులో వారి లక్షణము లున్నవి. వారి గొప్పతనము, వారి యుద్ధకౌశల్యము ఇతనిలో కలవు. చెంగిజ్ కాలమునకు తరువాత మంగోలులు నాగరీకులైరి. బేబరు గొప్ప సంస్కారి. మనోజ్ఞమైన లక్షణములు కలవాడు. అతడు మతభేదములు పెట్టుకోడు. మత విషయములలో తెలివితక్కువ పట్టుదల అతనికిలేదు. అతని పూర్వులవలె అతడు విధ్వంసకార్యములు చేయించలేదు. కళాసారస్వతములపై అతనికి అపేక్ష. అతడు పర్షియన్ కవి కూడా. అతనికి పువ్వులన్నా, ఉద్యానములన్నా ఇష్టము. ఉష్ణాతిశయముగల హిందూదేశములోనుండి అతడు తరుచు మధ్యఆసియాలోని తన ఇంటిని తలుచుకొనేవాడు. తన స్వీయచరిత్రలో అతడిట్లన్నాడు: "ఫర్ఘనాలోని ఊదారంగు "వయొలెట్" పువ్వులు ఎంతో మనోహరముగా ఉండును; లెక్కలేనన్ని కలువలవంటి "ట్యూలిప్" పువ్వులతోను, గులాబీలతోను అది నిండియుండును."

తండ్రి చనిపోవుసరికి బేబరు వయస్సు పదకొండు సంవత్సరములు మాత్రమే. అతడప్పుడు సమరఖండమునకు పాలకుడయ్యెను. అది సులభమైన ఉద్యోగముకాదు. అతనిని శత్రువులు చుట్టుముట్టియుండిరి. బాలురూ, బాలికలూ బడికిపోవు రోజులలో అతడు కత్తిపట్టి కదనరంగమునకు పోవలసివచ్చెను. అతడు తన సింహాసనమును పోగొట్టుకొని మరల గెలుచుకొనెను. అల్లకల్లోలముగానున్న అతని జీవితములో పెక్కు సాహసకార్యము లతడు చేయవలసివచ్చెను. అయినప్పటికీ సారస్వతము నాతడు పఠించెను. కవిత్వము చెప్పనేర్చెను. కళలో ప్రవేశించెను. అత్యాశ అతనిని ముందుకు నెట్టుకుపోయెను. కాబూలును జయించిన పిమ్మట సింధునదినిదాటి అతడు ఇండియాలో ప్రవేశించెను. అతనికున్న సైన్యము మిక్కిలి చిన్నది. కాని యూరోపులోను, పడమటి ఆసియాలోను అప్పుడప్పుడే వాడుచున్న తుపాకులు, ఫిరంగులు అతనికుండెను. అతనితో యుద్ధముచేయుటకు వెడలిన

ఆఫ్ఘను మహాసైన్యము, సుశిక్షితులగు బేబరు సైన్యముముందు, అతని ఫిరంగులముందు తుక్కుతుక్కై పోయెను. బేబరుకు విజయము దక్కెను. కాని అతని కష్టము అంతమొందలేదు. అనేక పర్యాయములు ప్రమాదకరములగు పరిస్థితులలో అతడు చిక్కుకొనెను. ఒకమారు గొప్ప ప్రమాదమతని నెదుర్కొన్నప్పుడు అతని సేనానులు వెనుకకుతిరిగి ఉత్తర దిక్కుగా పోవుట మంచిదని సలహాయిచ్చిరి. కాని అతడు ధైర్యశాలి. వెనుకకు తిరిగిపోవుటకంటె మరణించుటే మంచిదని అతడు చెప్పెను. సారాత్రాగుట అతనికిష్టము. ఇట్టి విషమ పరిస్థితిలో అతడు సారాముట్టనని నిశ్చయించెను. సారాగిన్నెల నన్నింటినీ బద్దలు కొట్టించెను. చివరకు అతనికి విజయమువచ్చినది కాని సారానుమాత్రము అతడు మరల ముట్టలేదు.

ఇండియాలో అతడు నాలుగేండ్లు ఉన్నాడో లేదో మరణ మాసన్నమైనది. ఈ నాలుగు సంవత్సరములైనను అతనికి విశ్రాంతిలేదు. పోరాటమందే ఆకాలమును గడపెను. ఇండియాను గురించి అతని కేమీ తెలియదు. ఆగ్రాలో గొప్ప రాజధాని నిర్మింపదలచి అతడు ఒకగొప్ప వాస్తుశాస్త్ర ప్రవీణుని కాంస్టాంటినోపులునుండి రప్పించ ప్రయత్నించెను. అప్పుడు కాస్టాంటినోపులులో "గొప్ప సులేమాను" భవననిర్మాణకార్యములు చేయించుచుండెను. "సినాన్" అనువాడొక గొప్ప ఆటోమన్ వాస్తు నిర్మాణప్రవీణుడు. అతడు తన ప్రధానశిష్యుని యూసఫ్ అనువానిని ఇండియాకు పంపించెను.

బేబరు తన స్వీయచరిత్రను వ్రాసుకొనెను. ఈ మనోహర చరిత్రమునుబట్టి అనేక సన్నిహిత విషయములు మనము తెలుసుకోగలుగుచున్నాము. హిందూస్థానమును గురించియు అందలి జంతువులు, పువ్వులు, చెట్లు, పండ్లు వీటిని గురించియు—కప్పలను సైతము మరిచిపోకుండా అతడు వ్రాసినాడు! తన మాతృభూమిలో దొరుకు తర్బూజా పండ్లను, ద్రాక్షపండ్లను, పువ్వులను తలచుకొని అతడు నిట్టూర్పులు

బచ్చాడు. హిందూస్థాన ప్రజలను చూచినప్పుడు అతడికెంతో ఆశా భంగం కలిగింది. అతని అభిప్రాయము ప్రకారము వారిలో మంచి లక్షణమొకటీలేదు. యుద్ధములుచేస్తూ అతడు గడిపిన నాల్గు సంవత్సరములలోనూ వారిని గురించి తెలిసికొనుట కతనికి సావకాశములు లేకపోయి ఉండవచ్చును. విద్యావంతులూ, సంస్కారులూ ఈ నూతన విజేతకు సుదూరంగా ఉండిఉంటారు. అంతేకాదు. కొత్తగా వచ్చినవాడు వేరొక జాతిప్రజల జీవితమునూ, సంస్కృతినీ అందుప్రవేశించి సులభముగా తెలుసుకోలేడు. ఏమైతేనేమి కొంతకాలము నుంచి పాలకులుగా ఉండిన ఆఫ్ఘనులలోగాని, ప్రజాబాహుళ్యములోగాని మెచ్చుకోదగ్గ దేమీ అతనికి కనిపించలేదు. అతని పరిశీలనాశక్తిమంచిదే. నూతనాగతులు పక్షపాతబుద్ధితో చూస్తారనేమాట వప్పుకొన్నప్పటికీ మొత్తముమీద అతని వృత్తాంతమును బట్టి చూస్తే హిందూస్థాన మాకాలమున నీచస్థితిలో ఉన్నదనే భావించవలెను. అతడు దక్షిణ హిందూదేశమును చూడలేదు.

బేబరు చెప్పుచున్నాడు: "హిందూస్థాన సామ్రాజ్యము విస్తారమైనది. జనసంకీర్ణమైనది. భాగ్యవంతమైనది. తూర్పునా, దక్షణముగా, పడమటాకూడా దానిని సముద్రము చుట్టిఉన్నది. ఉత్తరమున కాబూలు, గజినీ, కాందహారు లున్నవి. హిందూస్థానమున కంతకూ రాజధాని ఢిల్లీ." బేబరు వచ్చినప్పుడు హిందూస్థాన మనేకచీలికలై, అనేక రాజ్యములు ఉన్నప్పటికీ అతడు హిందూస్థానమునంతనూ ఏకదేశముగా భావించడము గమనించదగ్గ విషయము. చరిత్రపొడుగునా హిందూస్థానము ఏకదేశమనే భావన వస్తూనేఉన్నది.

బేబరు ఇండియావర్ణన సాగిస్తున్నా డీవిధముగా: "అది ఎంతో చక్కని దేశము. మన దేశములతో పోల్చిచూచినప్పుడది ఒక ప్రత్యేక ప్రపంచమనే చెప్పవలెను. దానికొండలు, నదులు, అడవులు, మైదానములు, జంతువులు, మొక్కలు, అందలిప్రజలు, వారి భాష, దాని గాలులు, వానలు—అన్నీ భిన్నముగానే ఉన్నవి. సింధూదేశమును దాటీ

దాటడంతోనే మనకు కానవచ్చే దేశము చెట్లు, రాళ్లు, దేశద్రిమ్మరి తెగలు, ప్రజల ఆచార వ్యవహారములు అన్నీ పూర్తిగా హిందూస్థాన మునకు సంబంధించినవే. సరీసృపములు సైతము భిన్నముగా ఉన్నవి.... హిందూస్థానమందలి కప్పలు గమనించ దగ్గవి. మనకప్పల తెగలకు చెందినవైనప్పటికీ అవి నీటిమీద అరు ఏడు గజముల దూరము దుముకుచు పోగలవు.''

పిమ్మట అతడు హిందూస్థానమందలి జంతువులను, పుష్పాలను, చెట్లను, పండ్లను ఉదహరించెను.

ఇక ప్రజలసంగతి.

"అనుభవించుటకు హిందూస్థానములో సుఖములేమిలేవు. ప్రజలు అందమైన వాళ్లుకారు. స్నేహితులందరూ కలిసికొనుట, సద్భావముతో కలసిమెలసి సంచరించుట, ఇష్టాగోష్ఠి చేసికొనుట—వీటిలో ఉండే అంద ములు వారికి తెలియవు. వారికి ప్రతిభలేదు. గ్రహణ శక్తిలేదు. మర్యాద తెలియదు. దయాదాక్షిణ్యములు లేవు. సానుభూతిలేదు. చేతిపనులు విషయములో వారికి నేర్పులేదు. కల్పనాశక్తి లేదు. వాస్తుశాస్త్రము వారికి తెలియదు. అందు వారికి నేర్పులేదు. వారికి మంచి గుర్రములులేవు; మంచి మాంసము దొరకదు; ద్రాక్షపళ్లులేవు; తర్బూజాపళ్లులేవు; మంచి పళ్లులేవు; మంచుగడ్డలు దొరకవు; చన్నీళ్లు దొరకవు; మంచి ఆహారపదార్థములు లేవు; బజార్లలో రొట్టెదొరకదు; స్నానార్థము చెరువులు లేవు; కాలేజీలు లేవు; కొవ్వొత్తులు లేవు; కాగ డాలులేవు; దీపపుసెమ్మె ఒక్కటీలేదు.''

ఇక వారికేమి ఉన్నట్లు?—అనిఅడగ బుద్ధిపుట్టుతున్నది. ఇది వ్రాసినప్పుడు బేబరు చాలా విసిగిపోయి ఉంటాడు.

బేబరు చెప్పుచున్నాడు: "హిందూస్థానముయొక్క ప్రాశస్త్య మెందున్నదంటే—అది పెద్దదేశము. అందు బంగారమూ, వెండీ పుష్కలముగా ఉన్నవి....హిందూస్థానములో వేరొక సదుపాయ

మేమంటే—అందు వృత్తి వ్యాపారాలకు చెందిన పనిమనుష్యులు ఎందరో అంతములేకుండా ఉన్నారు. ఏ పనికైనాసరే, ఏ ఉద్యోగమునకైనాసరే మనుష్యులెప్పుడూ సిద్ధముగాఉంటారు. వృత్తివ్యాపారాలు వారిలో వంశ పరంపరగా వస్తూఉంటవి.''

బేబరు స్వీయచరిత్రనుండి చాలావిషయాలు ఉదహరించాను. అట్టిగ్రంధములను బట్టి ఆమనిషి ఎట్టివాడో మనము చక్కగా గ్రహించగలము. అట్టివానిని గురించి ఎంతవర్ణించి చెప్పినా ఇట్లుండదు.

బేబరు 1530 లో గతించెను. అప్పటికి అతని వయస్సు 49 సంవత్సరములు. అతని చావుకు సంబంధించిన సుప్రసిద్ధమైన కథ ఒకటి ఉన్నది. అతని కొడుకు హుమయూనుకు జబ్బుచేసినప్పుడు బేబరు కొడుకు మీద ప్రేమకొద్దీ అన్నాడట—తనకొడుకు స్వస్థుడైతే తన ప్రాణాలు ఇచ్చేస్తానని. ఇది జరిగిన కొద్దిరోజులకే హుమయూను స్వస్థుడైనట్లూ బేబరు చనిపోయినట్లూ చెప్పుతారు.

బేబరు కళేబరాన్ని కాబూలు తీసుకుపోయి, అతడెంతో ప్రేమించిన ఉద్యానములో, ఖననము చేశారు. తాను ఉవ్విళ్లూరుతూ ఉన్న పుష్పములకడకు చివరకతడు చేరుకున్నాడు.

## 89

# అక్బరు

సెప్టెంబరు 4, 1932

సేనానాయకత్వము వహించి బేబరు సమర్థతతో ఉత్తర హిందూదేశ మధికభాగమును జయించెను. ఢిల్లీలోని ఆఫ్ఘను సుల్తాను నతడు జయించెను. కొంత కాలమైనపిమ్మట, అంతకన్న కష్టతరమైన విజయమును సాధించెను. రాజపుత్ర చరిత్రలో ప్రసిద్ధ వీరుడగు చిత్తూరు సంగరాణా నాయకత్వమున నడిపింపబడ్డ రాజపుత్ర వంశముల

నాతడు ఓడించెను. హుమయూను విద్యావంతుడున్నూ, సంస్కారిన్నీ. తండ్రివలె యోధుడుకాడు. అతని నూతన సామ్రాజ్యము నందంతటనూ అల్లరులు చెలరేగుచుండెను. బేబరు మరణించిన మరి పది సంవత్సరములకు, 1540 లో, బీహారులోని ఆఫ్ఘన్ నాయకుడు, షేర్‌ఖాన్ అనువాడు, హుమయూనును ఓడించి అతనిని ఇండియానుండి తరుమ గొట్టెను. ఇట్లు, గొప్పమొగలులలో రెండవవాడు దేశాటనము చేయ వలసివచ్చెను. దాగుకొన వలసివచ్చెను. అనేకకష్టములకు పాలు కావలసివచ్చెను. రాజపుత్రస్థాన మందలి ఎడారులలో ఆతడు సంచ రిస్తున్నప్పుడే, 1542 నవంబరులో, ఆతనికి పుత్రోదయ మయ్యెను. ఎడారిలో జన్మించిన ఈ కొడుకే అక్బరు.

హుమయూను పరిషియాకు పారిపోయెను. అప్పటి పాలకుడు, షాతమస్ప అనువాడు, అతనికి శరణిచ్చెను. ఉత్తర ఇండియాలో షేర్‌ఖాన్, అప్రతిహతముగా షర్షా అను పేరున, అయిదు సంవత్సరములకాలము రాజ్యమేలెను. ఈ కొద్దికాలములోనే అతడు సమర్థుడని పించుకొనెను. అతడు నిర్మాణకుశలుడు. అతని ప్రభుత్వము చురుకుగా, సమర్థముగా పనిచేయుచుండెను. యుద్ధములలో తగుల్కొని ఉన్నప్ప టికీ అతడు వ్యవసాయదారులనుండి వసూలుచేయదగ్గ పన్ను ఎంతో నిర్ణయించుటకు ఒక క్రొత్తపద్ధతిని ప్రవేశపెట్టెను. అతడు కఠినుడు. ఇతరులకు లొంగువాడుకాడు. ఇండియాలో రాజ్యముచేసిన అఫ్ఘను రాజులందరి కంటెను, ఇతర రాజులకంటెనుకూడా అతడు మిక్కిలి సమర్థుడు. ఉత్తముడు. సమర్థులగు నిరంకుశులవలెనే అతడున్నూ తన ప్రభుత్వమునందు సర్వశక్తివంతుడై ఉండెను. అతని మరణముతో అతని కట్టడమంతా కూలిపోయినది.

హుమయూను ఈ రాజ్యవిచ్ఛిత్తిని చూచి వెంటనే 1556 లో పరిషియా నుండి ఒకసైన్యముతో తిరిగివచ్చెను. అతనికి విజయము చేకూరెను. పదహారు సంవత్సరముల అనంతరము అతడు మరల ఢిల్లీ

సింహాసన మధిష్టించెను. కాని అతను చిరకాలముండలేదు. మరి ఆరునెలలకతడు మెట్లమీదనుండి క్రిందకుపడి చనిపోయెను.

షర్షా, హుమయూనుల గోరీల భేదమును పరిశీలించిచూచిన ఒక వింతవిషయము గోచరించును. అఫ్ఘనునిగోరీ బీహారులో సహస్రాం కడనున్నది. అది ఆపురుషునివలనే కర్కశముగా, బలముగా, అహంకార పూరితమైయున్నట్లు కనిపించును. హుమయూను గోరీ ఢిల్లీలో ఉన్నది. అది మర్యాదగా, అందముగాఉన్నది. ఈ రాతికట్టడములను బట్టి, పదహారవశతాబ్దిలో సామ్రాజ్యమునకు ప్రతిస్పర్థులైన ఇద్దరు పురుషుల స్వభావములూ తెలుసుకోవచ్చును.

అప్పటికి అక్బరు వయస్సు పదమూడు సంవత్సరములే. అతని తాతవలెనే అతడున్నూ పిన్నవయస్సునందే సింహాసనమెక్కెను. అతనికొక సంరక్షకుడుండెను. అతడు బైరాంఖాన్—అతనిని ఖాన్‌బాబా అనేవారు. నాలుగు సంవత్సరములు దాటకుండానే, సంరక్షకుడు తనకుండుట సహించక, ఇతరుల చెప్పుచేతులలో ఉండుటకిష్టపడక అతను ప్రభుత్వమును తన కైవశము చేసికొనెను.

1556 నుండి 1605 సంవత్సరాంతము వరకూ, సుమారు 50 సంవత్సరముల కాలము, లక్బరు ఇండియాను పాలించెను. ఈ కాలమునందే యూరోపులో నెదర్లాండులు విప్లవము సాగించుచుండెను. ఇంగ్లాండులో షేక్స్పియరుండెను. హిందూదేశ చరిత్రలో అక్బరుపేరు సుప్రతిష్ఠితమైనది. ఒక్కొక్కప్పుడు, కొన్నివిధములుగా, అతడు అశోకుని తలపునకు తెచ్చుచుండును. క్రీస్తుపూర్వము మూడవశతాబ్దిలో ఇండియాను పాలించిన ఒక బౌద్ధ చక్రవర్తిన్నీ, క్రీస్తువెనుక పదహారవ శతాబ్దిలో ఇండియాను పాలించిన ఒకమస్లిము చక్రవర్తిన్నీ ఒకేమాదిరిగా, ఒకే కంఠస్వరముతో భాషించుట వింతవిషయము. ఇండియాకు పుట్టిన సుపుత్రులిద్దరి ముఖమున వినిపించు కంఠధ్వని ఇండియా కంఠధ్వని కాగూడదా ? అనిపిస్తుంది. అశోకుని గురించి, అతడు రాతిమీద చెక్కిం

చిన విషయములనుమించి మనకేమియు తెలియదు. అక్బరును గురించి మన కనేక విషయములు తెలుసును. అతని కొలువుకూటములోనుండిన సమకాలిక చరిత్రకారులు ఇద్దరు అతనిని గురించి దీర్ఘవృత్తాంతములు వ్రాసియుండిరి. అతనిని దర్శించిన పరదేశులు, ముఖ్యముగా అతనిని క్రైస్తవమతములోనికి దింపవలెనని శాయశక్తులా ప్రయత్నించిన జెస్యూటులు, అతనిని గురించి విపులముగా వ్రాసిరి.

ఆ వంశములో బేబరు మొదటి పురుషుడు. అక్బరు మూడవ పురుషుడు. కాని మొగలులింకను దేశమునకు క్రొత్తగా ఉండిరి. వారిని విదేశులుగా ప్రజలెంచుచుండిరి. వారీదేశమున సైన్యబలము వల్లనే నిలిచిరి. అక్బరు ప్రభుత్వమే ఇండియాలో మొగలు రాజవంశమును స్థాపించెను. పరదేశవాసనలు లేకుండ చేసెను. ఇండియా క్షేమమే తమక్షేమముగా భావించుకొనేటట్లు చేసెను. దాని దృక్పథము కూడ ఇండియా దృక్పథమే అగునట్లతడు చేసెను. అతడు రాజ్యము చేయు కాలమునందే "గొప్పమొగలు" అనే బిరుదము యూరోపులో వాడుకలోకి వచ్చెను. అతడు మిక్కిలి నిరంకుశుడు. అడ్డులేని అధికార మతని కెంతో ఉండెను. పాలకుని అధికారములను అరికట్టవలెననే మాట ఇండియాలో ఏమూలనూ లేనట్లు తోస్తుంది. కాని అక్బరు వివేకముగల నిరంకుశుడు. హిందూదేశ ప్రజల క్షేమమునకై అతడు కష్టపడి పని చేసెను. భారత జాతీయత కతడు పిత అని ఒక విధముగా మనము భావించవచ్చును. దేశములో జాతీయతా చిహ్నములు లేశమైనా లేని కాలమున అతడు భేదములు పుట్టించు మతములను కాదని భారత జాతీయతా ధర్మమును ముందుపెట్టెను. ఆ ప్రయత్నములో అతడు పూర్తిగా సఫలుడుకాలేదు. కాని అతడు ఎంతముందుకు పోగలిగెనో, అతని ప్రయత్నము లెట్టి గొప్పఫలితముల నొసంగెనో తలచు కొంటే ఆశ్చర్యకరముగా ఉంటుంది.

అక్బరు సాధించిన విజయము పూర్తిగా స్వప్రయోజకత్వము

వల్లరాలేదు. కాలము కలిసివచ్చి, పరిస్థితులు అనుకూలముగా ఉంటేనే తప్ప ఎవ్వడూ గొప్ప కార్యములు సాధించలేడు. మహా పురుషుడు ముందుకు చొచ్చుకొని పోవ ప్రయత్నించును. అనుకూల సందర్భముల నాతడే సృష్టించుకొనును. కాని మహాపురుషుడు కూడ అప్పటికాల మునకు, ఆనాటి పరిస్థితులకు అనుగుణముగా పుట్టినవాడే. అక్బరు కూడ ఇండియాలోని ఆ కాలమునకు అనుగుణముగా పుట్టినవాడే.

ఇండియాలో కొన్ని నీరవ శక్తులు, ఇండియారో తటస్థపడిన ఈరెండు సంస్కృతులనూ, మతములనూ సమ్మేళనముచేయ పనిచేసినట్లు వెనుకటి జాబులో నేను వ్రాసియుంటిని. వాస్తు నిర్మాణములో క్రొత్త పద్ధతిని గురించియు, భారతీయభాషల—అందు ముఖ్యముగా ఉర్దూ, హిందూస్థానీల గురించియు నీకు చెప్పియుంటిని. రామానందుడు, కబీరు, గురునానకు వంటి సంస్కర్తలూ, మతనాయకులూ ఇస్లామునూ, హిందూమతమునూ సన్నిహితముచేయుటకు ప్రయత్నించినట్లూ, ఇందుకై వారా రెండు మతములందలి సమాన లక్షణములను ఎత్తిచూపి, వాటి కర్మకాండమును నిరసించినట్లూకూడా నీకుచెప్పియుంటిని. అనాడీసమ్మేళ భావము దేశమందంతటా నిండియుండెను. సున్నితమైన మనస్సూ, మంచిని గ్రహించుబుద్ధి కలిగిన అక్బరు దానిని అవగతము చేసికొన్నట్లు తోచును. అందు కనుగుణముగా ప్రవర్తించెను. నిజమున కాతడు ఈ సమ్మేళన భావప్రకటనమునకు ప్రధాన ప్రతినిధి అయ్యెను.

తన బలమును, జాతి బలమును ఈ సమ్మేళనము మీదనే ఆధార పడియున్నవని, రాజనీతి నిపుణుడగు అతడు గ్రహించి యుండును. అతడు ధైర్యశాలి యగు యోధుడు. సమర్థుడగు సేనానాయకుడు. అశోకునివలె అతడు యుద్ధమన్న విముఖుడుకాడు. కాని కత్తితో సంపాదించిన లాభములకంటె ప్రేమతో సంపాదించిన లాభములపై అతనికి మక్కువ ఎక్కువ. అట్టిలాభములే చిరకాలముండునని అతడు

గ్రహించెను. కావుననే అతడు హిందూ ప్రజల యొక్కయు, హిందూ కులీనులయొక్కయు సద్భావమును బడయ త్రికరణశుద్ధిగా పనిచేసెను. మస్లిములు కానివారిపై విధింపబడిన తలపన్నును, హిందూయాత్రికులపై విధింపబడిన పన్నును అతడు రద్దుచేసెను. ఉన్నత రాజపుత్రవంశమున పుట్టిన కన్యక నాతడువివాహమాడెను. తరువాత తన పుత్రునకుకూడ రాజపుత్రకన్యకను వివాహముచేసెను. ఇట్టి మతాంతర వివాహముల నాతడు ప్రోత్సహించెను. సామ్రాజ్యములోని ఉన్నతస్థానములకు రాజపుత్రకులీనుల నాతడు నియోగించెను. అతనికున్న ధైర్యశాలులగు సేనానులలో, మిక్కిలి సమర్థులగు మంత్రులలో, గవర్నర్లలో హిందువు లుండిరి. రాజమానసింగు కొంతకాలముపాటు కాబూలు గవర్నరుగా కూడ పంపబడెను. రాజపుత్రులనూ, హిందూప్రజలనూ మంచిచేసుకో వలననే ఉత్సాహముకొద్దీ అతడు అప్పుడప్పుడు తన మస్లిము ప్రజలకు అన్యాయము చేసెను. హిందువుల సద్భావమునాతడు సంపాదించ గలిగెను. దాదాపు రాజపుత్రులందరునూ అతనికి కొలువుచేయుటకూ, అతనిని గౌరవించుటకూ గుంపులుగుంపులుగా వచ్చిరి. ఒకడుమాత్రము రాలేదు. అతడు దృఢచిత్తుడైన మీవారు రాణాప్రతాపసింగు. పేరు మట్టుకైనా అక్బరు సార్వభౌమత్వమును రాణాప్రతాపుడు అంగీకరించ నిరాకరించెను. యుద్ధమున నిర్జితుడయినన్నీ, అడవులలో, అపాయ ములకు గురియై సంచరించ తీర్మానించెను గాని అక్బరుకు లొంగి సామంతుడై తుచ్ఛసుఖముల ననుభవించ ఈయకొనలేదు. జీవితము ముగియుటకు ముందాతడు కొంత విజయమునుకూడ సాధించెను. పరాక్రమశాలియగు ఈ రాజపుత్రుని చరిత్రము రాజపుత్రస్థానములో గౌరవ భావముతో పూజింపబడుచున్నది. అతనిని గురించి అనేక కథలు చెప్పుకొనుచుందురు.

ఇట్లు అక్బరు రాజపుత్రులను తనవైపుకు తిప్పుకొనెను. ప్రజల ఆదరణ నమితముగా నతడు పొందెను. పారశీకులకతడు చనువిచ్చెను.

తనకొలువుకు విచ్చేసిన జెస్యూటు మిషనరీల నత డాదరించెను. ఇట్లు చనువు లిచ్చుటవలనున్నూ, మస్లిము అనుష్ఠానములను కొన్నింటి నాత డుపేక్షించుట వల్లనున్నూ మస్లిము కులీనులు అతని పట్ల అభి మానము చూపకుండిరి. అతనికి వ్యతిరేకముగా ఎన్నో తిరుగుబాట్లు జరిగెను.

అతనిని అశోకునితో పోల్చితిని. ఈ పోలికనుబట్టి నీవు దురభి ప్రాయపడవద్దు. అనేక విధములుగా అతనికి అశోకునితో పోలికలేదు. అతడు అత్యాశా పరుడు. జీవితాంతము వరకూ, సామ్రాజ్యము విస్తరింప జేయవలెననే ఉద్దేశముతో విజేతగానే ఉండెను.

జెస్యూటులు అతనిని గురించి ఇట్లు చెప్పుచున్నారు: "అతని బుద్ధి చురుకైనది. వివేచనా శక్తికలది. అతడు మంచి వివేకము కలవాడు. దూరదృష్టితో అతడు కార్యములు చక్కబెట్టుచుండును. అతడు దయా శాలి; సులభుడు; ఉదారుడు. ఈ గుణములతోపాటు అతనికి గొప్ప ఉద్యమములు కొనసాగించగల సాహసమున్నది. అనేక విషయ ములను గురించి తెలిసికొనుట కతడు కుతూహలము చూపుచుండెను. యుద్ధవిద్యకు, రాజనీతికీ సంబంధించిన విషయములలోనేగాక అనేక మాంత్రిక కళలలోకూడ అతనికి మంచిజ్ఞానముకలదు. కరుణ, సాధుత్వము ఈ రాజులో ప్రకాశించుచుండెను. అతనిపట్ల అగౌర వముగా ప్రవర్తించినవారిపై కూడ అతడు ఈ కరుణ సాధుత్వముల ప్రసరింప జేయుచుండెను. అతని కెన్నడోగాని కోపమురాదు. కోపమే వచ్చిన అది తీవ్రరూపము దాల్చుచుండెను. కాని అతని కోపము ఎన్నడును దీర్ఘకాలముండదు." ఈ వర్ణన అతని కొలువుకూటములోని వారు చేసినది కాదు. అక్బరును పరిశీలించుటకు సావకాశములున్న ఒక పరదేశి చేసిన వర్ణన ఇది.

అక్బరు అమితబలిష్ఠుడు. చురుకైనవాడు. అపాయకరమగు వన్య మృగముల వేటాడుటయన్న అతనికెంతో యిష్టము. అపాయమును


అక్బరు సామ్రాజ్యము
సింధునది
ఢిల్లీ
ఆగ్రా
గంగానది
గుజరాతు
దామన్
డయ్యూ
గోదావరి
పోర్చుగీసులు
గోవా
కల్లికోట
కొచ్చిను

కూడ లెక్కచేయనంత ధైర్యశాలియగు యోధుడతడు. ఆగ్రానుండి అహమదాబాదు కతడు తొమ్మిదిదినములలో సైన్యమును నడిపించుకొని వెళ్లుట ప్రసిద్ధ విషయము. దీనినిబట్టి అతని శక్తి ఎంత ఆశ్చర్య కరమైనదో గ్రహించవచ్చును. గుజరాతులో తిరుగుబాటు సంభవించెను. చిన్నసైన్యముతో అతడు రాజపుత్రస్థానమందలి ఎడారినిదాటి, 450 మైళ్ల దూరము వేగముగా వెళ్లెను. ఇది అసాధారణ పరాక్రమకార్యము. ఆనాడు రైళ్లుగాని మోటారుకార్లుగాని లేవన్నసంగతి నీకు చెప్ప నక్కరలేదు.

కాని మహాపురుషుల కీ లక్షణములే కాదు, వేరొక లక్షణ ముండును. అది ప్రజలనాకర్షించు సమ్మోహనశక్తి. అక్బరుకు ఈ సమ్మోహనశక్తియు, ఆకర్షణశక్తియు అమితముగా నుండెను. జెస్యూటులు ఆశ్చర్యకరముగా దానిని వర్ణించిరి. అతని దృష్టిజాలములు "సూర్యాతపమున సముద్రము స్పందించు"నట్లుండెను. ఈ పురుషుడు నేడుకూడ మనలనాకర్షించుచున్నాడన్న ఆశ్చర్యమేమి? రాజపుత్రు లుగానున్న మానవసమూహములో అతని పౌరుషమూర్తి రాజఠీవితో ఉన్నతముగా నిలిచియున్నదన్న ఆశ్చర్యమేమి?

ఉత్తర హిందూస్థానమునంతను, దక్షిణమునూ కూడా అక్బరు జయించెను. గుజరాతు, బెంగాలు, ఒరిస్సా, కాశ్మీరము, సింధుదేశముల నాతడు తన సామ్రాజ్యములో కలుపుకొనెను. మధ్య ఇండియాలోనూ, దక్షిణ ఇండియాలోనూ అతడు విజయముసాధించి, కప్పమువసూలు చేసెను. మధ్యరాష్ట్రములో పాలకురాలుగానున్న రాణీదుర్గావతి నోడించుట అతనికి ప్రతిష్టాకరముగా లేదు. ఆరాణీ ధైర్యశాలిని, మంచిపాలకురాలు. ఆమె అతనికేమియు అపకారము చేయలేదు. కాని దురాశయు, సామ్రాజ్యకాంక్షయు ఇట్టియాటంకములను లెక్కబెట్టునా? దక్షిణ ఇండియాలో అతడింకొక పాలకురాలితో యుద్ధముచేసెను. ఆమె అహమదునగర పాలకునకు ప్రతినిధిగానున్న, ప్రసిద్ధినందిన చాందుబీబీ.

తఃమె సాహసురాలు, సమర్థురాలు. ఆమెమిక్కిలి ధైర్యముగా పోరాడుటచే మొగలుసైన్యము లామెను మెచ్చుకొనెను. తత్కారణమున ఆమెతో అనుకూలమగు సంధిని వారుచేసికొనిరి. దురదృష్టవశాత్తు అసంతుష్టితో నున్న ఆమెసైనికులే కొందరామెను హత్యచేసిరి.

అక్బరు సైన్యములు చిత్తూరును కూడ ముట్టడించెను. ఇది జరిగినది రాణా ప్రతాపుని కాలమునకు ముందు ధైర్యసాహసములతో జయమల్లు చిత్తూరుకోట శత్రువశము కాకుండ పోరాడెను. అతడు మరణించగానే మరల అంతఃపుర స్త్రీలు జోహారు చేసిరి. పిమ్మట చిత్తూరు శత్రువశమయ్యెను,

సమాలోచనకు సమర్థులగు స్వామి భక్తిపరాయణులైన ఉద్యోగస్థులను అక్బరు సంపాదించగలిగెను. వారిలో ముఖ్యులు, సోదరులగు ఫైజీ, అబుల్ ఫజల్ అను వారునూ, బీరబలుడునూ, బీరబలుని గూర్చి లెక్కలేనన్ని కథలునేటికిని చెప్పుకొను చుందురు. తోడరుమల్లు అతని ఆర్థికమంత్రి. ఇతడే రెవెన్యూ పద్ధతిని పూర్తిగా సంస్కరించెను. ఆరోజులలో జమీందారీపద్ధతిలేదు. జమీందారులుగాని. తాలూకాదారులుగాని లేరు. ప్రభుత్వము రైతులతోనే నేరుగా వ్యవహారములు పరిష్కరించుకొను చుండెను. దీనినే నేడు రైతువారీ పద్ధతి అను చున్నారు. నేటి కాలమునందున్న జమీందారులు బ్రిటిషువారి సృష్టియే.

అక్బరు ఉత్తమ సేనానాయకులలో ఒక్కడు జయపూరుకు చెందిన రాజా మానసింగు, అక్బరు కొలువులోనున్న వేరొక పురుషుడు తాన్‌సేను అను మహా గాయకుడు. ఇండియాలోని గాయకుల కతడు ఆరాధ్య పురుషుడైనాడు.

తొలు దొలుత అక్బరు రాజధానీ నగరము ఆగ్రా. అక్కడ అతను కోటకట్టించెను. పిమ్మట ఒక నూతన నగరమును అతడు నిర్మించెను. దానిపేరు ఫతేపూరుసిక్రీ. ఆగ్రాకు 15 మైళ్ల దూర

మున నది యున్నది. ఆస్థానము సతము ఎన్ను కొనుటకు కారణము "షేక్ సలీమ్'' చిష్టి అను సాధు పురుష దక్కడ నివాస మేర్పరుచు కొనియుండుటమే. అచ్చట అతడొకదివ్య నగరమును నిర్మించెను. ఆనాటి ఒక ఇంగ్లీషు యాత్రికుడు "ఆనగరము లండనుకన్న చాలా పెద్దది" అని చెప్పియున్నాడు. పదిహేను సంవత్సరములుపైగా అది ఆలని సామ్రాజ్యమునకు రాజధానియై యుండెను. అక్బరు స్నేహితుడును, మంత్రియును అయిన అబుల్ ఫజల్ ఇట్లు చెప్పుచున్నాడు. "మహారాజు దివ్య భవనములను మానసికముగా నిర్మించు చుండెను. మనస్సు నందును, హృదయమునందును ఆకారము వహించిన కట్టడముల కాతడు శిలామృత్తికలను వస్త్రములతో ఆచ్ఛాదించును.'' అందమైన మసీదులతో, బులంద్ దర్వాజాతో, చక్కని యితర భవనములతో ఫతేపూరు సిక్రీ ఇంకను నిలిచియున్నది. ఆ నగరమిప్పుడు నిర్మానుష్యమైయున్నది. ప్రాణిసంచార మందులేదు. దాని వీధుల గుండాను, విశాలమగు ఆవరణములగుండాను మృత సామ్రాజ్యము యొక్క విదేహజీవులు సంచరిస్తూన్నట్లు తోచును.

నేటి అలహాబాదు నగరమున్ను అక్బరు స్థాపించినదే. కాని ఈ ప్రదేశము చాలా పురాతనమైనది. రామాయణకాలము నుండియు ప్రయాగ ఇక్కడ వర్ధిల్లినది. అలహాబాదు కోట అక్బరుచే కట్టబడెను.

విశాల సామ్రాజ్యమును జయించుటకునూ, దానిని గట్టిచేయుటకునూ అక్బరు తనజీవితము నంతయూ వినియోగించి యుండవలెను. కాని అక్బరు జీవితము పొడుగునను అతనిలో ఒక అసాధారణలక్షణముపొడగట్టు చుండెను. ఇది అతని అంతులేని కుతూహలమున్నూ, సత్యాన్వేషణాప్రయత్నమున్నూ. ఏశాస్త్రమును గురించియైనను నూతన విషయములు చెప్పగల వారున్నట్లు విన్నతోడనే అతడు వారిని పిలిపించి ప్రశ్నించును. ఇబాత్ ఖానాలో వివిధ మతస్థు లాతని

చుట్టును జేరెడువారు. ప్రబలుడగు ఈసామ్రాట్టును ప్రతియొక్కరును తనమతము లోనికి త్రిప్పుకొనవలెనని ఆశించు చుండిరి. తరుచు వారిలో వారు వివాదపడుచుండిరి. అక్బరు ఆసీనుడై వారి వాదములు వింటూ, వారినెన్నో ప్రశ్నలు వేస్తూండేవాడు. సత్యము ఏయొక్క మతముయొక్కగాని, తెగయొక్కగాని సొమ్ముగాదని అతడు భావించి నట్లు తోచును. సర్వత్రా మత విషయములందు సహన భావము చూపుట తనధర్మమని అతడు ప్రకటించెను.

ఆయన కాలముననున్న ఒక చరిత్రకారుడు, బాదౌనీ అనువాడు, ఇట్టి సమావేశములు పెక్కింటిలో పాల్గొనియుండును. అతడు అక్బరును గురించి చక్కగా వ్రాసెను. అతని వాక్యములు నే నుదహరించుచున్నాను. బాదౌనీ మతాచార పరాయణుడగు ముస్లిము. అక్బరు చర్యల నాతడెంత మాత్రము సమ్మతించలేదు.

అతడు చెప్పుచున్నాడు—" మహారాజు అందరి అభిప్రాయములనూ, అందు ముఖ్యముగా ముస్లిములుకాని వారి అభిప్రాయములను సేకరించేవాడు. అందు తనకిష్టమైనవాటిని స్వీకరించేవాడు. తనఅభీప్సితములకు వ్యతిరేకముగా నున్నట్టిన్నీ, తనకిష్టములేనట్టిన్నీ అభిప్రాయములను నిరాకరించేవాడు. బాల్యమునుండి యౌవనమువరకూ, యౌవనమునుండి వార్ధక్యమువరకూ అనేక అవస్థలనుండి అతడు గడచెను. అనేక విధములగు మతసాధనలను అతడు తెలిసికొనెను. మతవిశ్వాసముల నతడు గ్రహించెను. గ్రంథములోనుండు సమస్త విషయములను అతడు సేకరించెను. ఎట్టి విషయములు గ్రాహ్యములో నిర్ణయించు వివేక మతనికి ప్రత్యేకముగా కలదు. ఇస్లాము ధర్మములకు వ్యతిరేకముగా అతడిట్టి విమర్శన కార్యము సాగింపదొడగెను. ఇట్లు సామాన్య ధర్మములపై ఆధారపడియున్న మతమొకటి అతని హృదయ ఫలకమున ఆకారము వహించెను. అనేక విధములగు మతాభిప్రాయములు అతని చెవిని పడుటకు ఫలితముగా, అతని హృదయములో

ఒక నమ్మకము, రాతిపై బొమ్మ ఆకారమువలె, క్రమముగా రూపొం దెను—అన్ని మతములందును వివేకులగు పురుషులున్నారనియు, అన్ని జాతులందును నిగ్రహశక్తిగల తత్వవేత్త లున్నారనియు, మహత్తుగల పురుషులున్నారనియు అతడు నమ్మెను. యదార్థజ్ఞానము కొంత కొంత అంతటను కనుపించుచుండగా ఒకేమతమున సత్యమున్న దని చెప్పవచ్చునా!"

ఈకాలమున మతవిషయమున యూరోపులో అసహన మమిత ముగానున్నదన్న సంగతి నీకు జ్ఞాపకమున్నదను కొందును. స్పెయి నులోనూ, నెదర్లాండులలోనూ, ఇతర ప్రదేశములందును ఇంక్విసిషన్ వృద్ధిలోనుండెను. కాతలిక్కులును, కాల్వినిస్టులును ఒకరి పట్ల ఇం కొకరు సహనము వహించుట మహాపాతకమని భావించు చుండిరి.

వివిధమతపండితులతో ఏటేటా అక్బరు ప్రసంగములు, వాద ములు చేయుచునే ఉండెను. చివరకాపండితులకు విసుగువచ్చి తమ మతములలోని కతనిని త్రిప్పుకొను విషయమున నిరాశ చేసుకొనిరి. ప్రతి మతమునందును కొంత సత్యమున్నప్పుడు ఒకమతము నాత డెట్లు వలంచించును? అతడీ విధముగా చెప్పెనని జెస్యూటులు వ్రాస్తున్నారు. "హిందువులు తమధర్మము మంచిదందురు; అట్లే సారసనులును, క్రైస్తవులును తమ తమ మతములు మంచివను చున్నారు: దేనిని మన మవలంబించవలెను?" (ఇచ్చట సారసనుల నుగా ముస్లిములు. జెస్యూటు పాదిరీలు పోర్చుగీసువారగుటచల్ల స్పెయి నులోని సారసనులనెరుగుదురు. ఇండియాలోను ముస్లిములనుకూడ వారందుచే సారసనులనిరి) అక్బరు వేసిన ప్రశ్న సమంజసమైనదే. కాని జెస్యూటుల బాటట కష్టముగా నుండెను. వారు తమగ్రంథ మున నిట్లు వ్రాయుచున్నారు. "ఇట్లు ఈచక్రవర్తిలో నాస్తికుని కుండు సామాన్యలోపము కనిపిస్తున్నది. నాస్తికుడు మతముసరు హేతువులొంగియుండుట కంగీకరించడు. తన బుద్ధిబల చిత్తము

గ్రహించలేనిదేదియు సత్యమని అతడంగీకరించడు. మానవ బుద్ధి కతీతమగు విషయములు అల్పమగు తన వివేచనా శక్తితో పరిష్కరింప చూస్తాడు.'' నాస్తికున కిదియే నిర్వచనమైతే ఇట్టినాస్తికులు ఎంత మంది ఉంటే అంతమంచిది.

అక్బరు మనస్సులో పెట్టుకొన్న లక్ష్యమేమిటో స్పష్టముగా తెలియడంలేదు. దీని నాతడు రాజకీయ సమస్య మాత్రముగానే భావించెనా ? ఒకేజాతిని తయారు చేద్దామనే కోరికతో అన్ని మతములను ఏకముఖము చేయగోరెనా ? లేదా ? అతని అభిప్రాయములకునూ, అన్వేషణమునకును మతమే ఆధారభూతమా? నాఅభిప్రాయమేమనగా— అతడు మత సంస్కర్తకన్న అధికముగా రాజనీతి నిపుణుడనియే. అతని ఉద్దేశమేమైనప్పటికీ వాస్తవమున కతడొక నూతనమతమును— దీన్ ఇలాహి అను పేరుగలదానిని ప్రకటించెను. ఆ మతమున కతడే పెద్ద. ఇతర విషయములందువలెనే మతవిషయమునను అతడు అడ్డు సహించని నిరంకుశుడు. అందు అసహ్యాకరమగు దండప్రణామములు, పాదచుంబనములు మున్నగునవి ఉండెను. ఈ నూతనమతము ప్రజాంగీకారము బడయలేదు సరికదా మస్లిములకు కోపకారణముగా నుండెను.

అధికారతత్త్వమునకు అక్బరు పెట్టినదిపేరు. అయినను రాజకీయములలో (ప్రజల కెక్కువస్వేచ్ఛ వుండుట మున్నగు) విశాల భావము లుండవలెనను విషయమున అతని మనస్సు యెట్లుమొగ్గెనో ఊహించుట ఉత్సాహకరముగా నుండును. మతవిశ్వాసముపట్ల ప్రజలకు స్వేచ్ఛవున్నట్లయితే ప్రజకేల రాజకీయస్వేచ్ఛ అధికముగా వుండరాదు? విజ్ఞానశాస్త్రమతనిని ఎక్కువగా ఆకర్షించి యుండెడిది. ఇట్టి అభిప్రాయము లప్పుడప్పుడే యూరోపులో కొందరిని కలవరపెట్ట మొదలు పెట్టెను. దురదృష్టవశాత్తు అవి యింకను ఇండియాలో వ్యాపించ లేదు. ముద్రాయంత్రమైనను ఉపయోగించుచున్నట్లు లేదు. కాన విద్య

పరిమితముగా నుండెను. ఆమాటకువస్తే నీకాశ్చర్యంగా వుంటుంది. అక్బరు అక్షరాస్యుడుకాడని విన్నప్పుడు। అతనికి చదువను వ్రాయను రాదు. అయినప్పటికీ అతడెంతో విద్యావంతుడు. పుస్తకములు చదివించుకొని వినుటఅన్న అతనికెంతో ప్రీతి. అతని ఉత్తరువు ప్రకారము అనేక సంస్కృతగ్రంథములు పర్షియన్ భాషలోనికి తర్జుమా చేయబడ్డవి.

హిందూ వితంతువులు సహగమనము చేయరాదని అతడు శాసించెను. యుద్ధమందు చిక్కిన ఖైదీలను బానిసలుగా చేసికో రాదనియు అతడు శాసించెను.

అక్బరు 1605 అక్టోబరులో 64 వ ఏట మరణించెను. అతడు సుమారు యాభై సంవత్సరములు రాజ్యమేలెను. ఆగ్రావద్దనున్న సికంద్రాలో అతనిని ఖననముచేసి, చక్కని గోరీ నిర్మించిరి.

అక్బరు రాజ్యకాలమున, ఉత్తర హిందూస్థానమున—ముఖ్యముగా వారణాసిలో—ఒక మహాపురుషుడుండెను. సంయుక్త రాష్ట్రములందలి ప్రతి గ్రామవాసికిని అతనిపేరు సుపరిచితము. అక్బరుకన్నను, ఏయితర రాజుకన్ననుకూడ అధికముగా ప్రజలాతని నెరుగుదురు. అతని పేరు తులసీదాసు. అతడు "రామచరిత మానసము" అను రామాయణమును హిందీ భాషలో రచించెను.

## ౯౦

# ఇండియాలో మొగలు సామ్రాజ్యము క్షీణించి, పతనమగుట

సెప్టెంబరు 9, 1932

ఇంకా అక్బరును గురించి నీకు చెప్పాలని వుందికాని నేను నిగ్రహించుకోవాలి. పోర్చుగీసు మిషనరీలు వ్రాసిన వృత్తాంతమునుండి

మరికొన్ని విషయము లుదహరించక మానలేను. కొలువుకూటము నందున్న వారి అభిప్రాయములకంటె వీరి అభిప్రాయములు యెక్కువ విలువ గలవి. మరిన్నీ ఒక విషయము మనము జ్ఞాపకముంచుకోవాలి. అదేదంటే—అక్బరు క్రైస్తవమతమును స్వీకరించలేదు. కాబట్టి అతని విషయమై వారు ఆశాభంగము చెందారు. అయినా వారిట్లా వ్రాస్తున్నారు: "అతడు నిజముగా గొప్పరాజు. తన ప్రజలయొక్క వినయ విధేయతలను, గౌరవమును, ప్రేమను, భయమును ఒకేమారు చూరగొన్నవాడే మంచిరాజని అతడు గుర్తెరిగి యుండెను. అతడందరికి ప్రేమపాత్రుడై యుండెను. గొప్పవారిపట్ల ధృఢముగా నుండెను; దీనుల యెడ దయచూపుచుండెను; అందరియెడలా-గొప్పవారియెడలా, కొద్దివారి యెడలా-న్యాయము చూపుచుండెను. పరిచితుడైనా, నూతన పురుషుడైనా, క్రైస్తవుడైనా, పారసను అయినా, హిందువయినా — ఎవరైనా సరే వారియెడల న్యాయముగా ప్రవర్తించుచుండెను. కాపుననే ప్రతివాడును రాజు తనపక్షమున నున్నాడని భావించుకొనుచుండెను.'' ఇంకను జెస్యూటులు చెప్పుచున్నారు—" ఒకమారతడు రాచకార్యములలో నిమగ్నుడై యుండును. లేదా ప్రజలమొరల నాలించుచుండును. మరుక్షణమున నాతడు ఒంటెల బొచ్చు కత్తిరించుచుండును. లేదా రాళ్లు పగులగొట్టుచుండును. లేదా చెట్లు నరుకుచుండును. లేదా ఇనుమును సుత్తితో కొట్టుచుండును. ఏపని చేసినను ఎంతో శ్రద్ధతో అదే తనవృత్తి యన్నట్లుగా చేయుచుండును. ప్రబలుడు, నిరంకుశుడు అగు చక్రవర్తియైనప్పటికిని, ఈనాటి కొందరు తలచునట్లు, అతడు కాయకష్టముచేయుట గౌరవ లోపమని భావించలేదు."

అతనిని గురించి ఇతర విశేషములింకను గలవు. "అతడు మితభోజి. సంవత్సరమునకు మూడు, నాలుగు మాసములే మాంసమును భుజించును.........ఎంతో కష్టముమీద అతడు రాత్రి నిద్రకు మూడు గంటలకాలము ప్రత్యేకించుచుండెను....అతని ధారణశక్తి అత్య

ద్భుతము. వేలకొద్ది ఏనుగు లతనికున్నప్పటికిని వాటి పేర్లన్నియు అతనికి తెలియును. ఇట్లే అతనికున్న గుఱ్ఱముల పేర్లూ, లేళ్ల పేర్లూ, పావురముల పేర్లు సైతము అతనికి తెలియును". ఇట్టి అసాధారణ ధారణా శక్తి అతనికున్నదనుట నమ్మదగ్గదికాదని తోస్తుంది. బహుశా ఇందు అతిశయోక్తి వుండవచ్చును. కాని అతనిబుద్ధి సునిశితమనుటకు సందేహములేదు. "అతనికి చదువను వ్రాయను రాకున్నను, అతని రాజ్యమున జరుగు యావద్వృత్తాంతములు అతనికి గుర్తుగానుండెను. "అతని జ్ఞానతృష్ణ" ఎట్టిదనగా ఆకలి గొన్నవాడు ఒక్కమారాహారము ను కబళింప యత్నించునట్లు అతడు ఒకేమారు సర్వవిషయములను తెలుసుకొనుటకు ప్రయత్నించెను."

అక్బరు అట్టివాడు. అతడు పూర్తిగా నిరంకుశుడు. ప్రజలకు భద్రత నాతడు చేకూర్చినప్పటికీ, రైతుల పన్నులభారము తగ్గించినప్పటికీ, విద్యాశిక్షణలిచ్చి ప్రజల నుద్ధరించ నాతడు తలపెట్టలేదు. అన్ని దేశములందును ఆకాలమున నిరంకుశత్వము విజృంభించియుండెను. ఇతర నిరంకుశ ప్రభువులతో పోల్చిచూచిన అక్బరు గొప్పరాజుగా, గొప్ప మానవుడుగా వెలుగొందును.

బేబరు వంశమున నీతడు మూడవ రాజైనప్పటికీ ఇండియాలో మొగలు రాజవంశమును నిజమునకు స్థాపించిన వాడీతడే. చీనాలోని కుబ్లైఖాను స్థాపించిన యు-ఆన్ రాజవంశమువలెనే అక్బరు మొదలుగా వచ్చిన మొగలు పాలకులందరూ ఇండియన్ రాజవంశమే అయిరి. సామ్రాజ్యమును కూడదీసుకొని, గట్టిచేయుటకు అక్బరు చాలా కష్టపడెను. అందువల్ల అతని రాజవంశము అతని మరణానంతరము 100 సంవత్సరములుపైగా నిలిచెను.

అక్బరు తరువాత ముగ్గురు సమర్థులగు పాలకులు రాజ్యమేలిరి. కాని వారిలో గొప్ప విశేషము లేమిలేవు. చక్రవర్తి చనిపోయినప్పుడల్లా, సింహాసనమునకై అతని పుత్రులు అనుచితముగా ప్రాకులాడు

చుండిరి. రాజనగరులో కుట్రలు, సింహాసనమునకై యుద్ధములు, తండ్రులపై కొడుకులు తిరుగుబాటుట, అన్నదమ్ములలో కొట్లాటలు, హత్యలు, బంధువులకళ్లు పొడిపించుట,—ఇట్టి అకార్యములన్నియు జరుగుచుండెను. నిరంకుశత్వమునూ, నిరంకుశపాలనమునూ అంటి వచ్చు అసహ్యాకృత్యము లిట్టివేగదా. నిరుపమానమైన దంభమూ, వైభవమూకూడా అప్పుడుండెను. నీకు జ్ఞాపకమున్నదో లేదో? ఈ కాలమునందే ఫ్రాంసులో లూయీ XIV, "సూర్యరాజు" అను మారు పేరుకలవాడు రాజ్యముచేయుచు వార్సైల్స (Varsaills) ను నిర్మించెను. అతని సభవైభవోపేతముగా నుండెను. కాని ఈ సూర్యరాజు వైభవము గొప్ప మొగలు వైభవముముందర వెలవెల్లాడుచుండెను. బహుశా ఈ మొగలురాజులు ఆకాలముననున్న రాజులందరికన్న భాగ్యవంతులై యుందురు. అయినా, సామ్రాజ్యసభ భోగభాగ్యములతో తులతూగు చున్నప్పుడు, అప్పుడప్పుడు కాటకములు, రోగములు, అంటురోగ ములు వచ్చుచు అసంఖ్యాకులగు జనులను తుడిచిపెట్టుకు పోవుచుండెను.

అక్బరు కాలమునాటి మతసహన మతని కుమారుడైన జహంగీరు రాజ్యకాలమునకూడ నిలిచెను. కాని తరువాత అది మాసిపోయెను. క్రైస్తవులను, హిందువులను పీడించుటకూడ జరిగెను. కొంతకాలమైన పిమ్మట ఔరంగజేబు రాజ్యకాలమున హిందువులను పీడించు ప్రయత్న ములు తీవ్రముగా జరిగెను. వారి దేవాలయములు నాశము చేయ బడ్డవి. దుష్టమగు జిజియా తలపన్ను మరల విధించబడినది. ఎంతో శ్రమతో అక్బరువేసిన సామ్రాజ్యముయొక్క పునాదులు ఒకటొకటిగా తొలగింపబడినది. హఠాత్తుగా సామ్రాజ్యము ఒరిగి పడిపోయెను.

అక్బరు రాజపుత్ర భార్యకు జన్మించిన జహంగీరు అతని తరువాత సింహాసన మధిష్ఠించెను. తండ్రి సంప్రదాయములను అతడు కొంతవరకు కొనసాగించెను. కాని అతనికి కళమీదను, చిత్రలేఖనము మీదను. ఉద్యానములమీదను, పుష్పములమీదను మక్కువ ఎక్కువ.

ప్రభుత్వముపై అంత మక్కువలేదు. అతనికి చక్కని చిత్రశాల కలదు. ప్రతి సంవత్సరము అతడు కాశ్మీరదేశము వెళ్లుచుండెను. శ్రీనగరము వద్దనున్న షాలమర్, నిషత్ ఖాగులను ప్రసిద్ధఉద్యానములను నిర్మించిన వాడీతడేయని నా అభిప్రాయము. జహంగీరు భార్యలలో నొక్కతె సౌందర్యవతియగు నూర్జహాను. రాజు వెనుకనుండి నిజమగు అధికారము నెరపుచున్న దామెయే. జహంగీరు రాజ్యకాలమునందే ఇట్మద్-ఉద్-దౌలా గోరీగల అందమగు భవనము నిర్మింపబడినది. నేను ఆగ్రాకు వెళ్లినప్పుడల్లా, వాస్తునిర్మాణమున అగ్రస్థానము వహించు ఈ భవనమును దర్శించి కన్నుల దనుపుకొందును.

జహంగీరు అనంతర మాతని కుమారుడు షాజహాన్ ముప్పై సంవత్సరములు (1628-1658) రాజ్యమేలెను. అతడు లూయీ XIV సమకాలికుడు. ఈతని కాలముననే మొగలులు అభ్యుచ్ఛస్థితి నుండిరి. ఈతని కాలముననే వారిసామ్రాజ్యమున క్షయాంకురములు పొడచూపుచుండెను. ప్రసిద్ధినందిన మయూర సింహాసనము అమూల్య రత్నములతో పొదుగబడి, రాజున కాసనముగా నుండుటకై నిర్మింపబడినది. ఆగ్రాలో యమునా తీరమున సౌందర్య స్వప్నమగు తాజ్ మహల్ నిర్మింపబడెను. అది అతడు ప్రేమించిన అతని భార్యయగు ముమ్‌తాజ్ మహల్ యొక్క గోరీయని నీకు తెలిసియుండును. ప్రతిష్ఠకు, గౌరవమునకు భంగకరములైన కార్యములనేకము షాజహాన్ చేసెను. మతవిషయమున అతనికి అసహనముండెను. దక్కను, గుజరాతు దేశములలో దారుణక్షామము సంభవించినప్పుడు, ప్రజలబాధల నుడుపుటకు చెయ్యెత్తి అత డేకార్యములు చేయలేదు. దైన్యమూ, దారిద్రమూ ప్రజ లనుభవించు సమయమున అతనికున్న భాగ్యమూ, వైభవమూ ఎంత అసహ్యముగా కనిపించును? అయినా రాతితోనూ, పాలరాతితోనూ అతడు సృష్టించిన మహత్తరమైన సౌందర్యమునుచూచి అతని అకార్యములను మనము క్షమించవచ్చును. అతని కాలమునందే

మొగలు వాస్తునిర్మాణ కౌశలము మిన్నందెను. తాజ్‌మహల్‌నేకాక అతడు మోతీ మశీదును ఆగ్రాలో నిర్మించెను; ఢిల్లీలో జామీ మశీదును నిర్మించెను; ఢిల్లీనగరులో దివాన్-ఇ-ఆమ్, దివాన్-ఇ-ఖాస్ నిర్మించెను. అవి నిరాడంబరముగానున్న చక్కని భవనములు. అందు కొన్ని బహ్మాండమైనవేకాని ఎంత అందమైనవి! ఎంతసున్నితమైనవి—అంద మున అచ్చరలవలె నవియున్నవి.

కాని అచ్చరలవంటి ఈ సౌందర్యమువెనుక దరిద్రులగు ప్రజ యుండిరి. వారే ఈ ప్రసాదములకు ధనము నిచ్చిరి. అందు కొందరికి నివసించుటకు మట్టి కొంపలైనా లేవు. అడ్డులేని నిరంకుశత్వమప్పుడు చెలరేగుచుండెను. చక్రవర్తికిగాని, అతని ప్రతినిధులకుగాని, అతని గవర్నర్లకుగాని కోపము తెప్పించినవారికి తీవ్రదండనలు పడుచుండెను. మాక్యావెల్లి సిద్ధాంతముల కనుగుణముగా కొలువుకూటమున కుట్రలు జరుగుచుండెను. అక్బరు దయాశీలము, సహనము, సత్ప్రభుత్వము స్వప్నప్రాయములైనవి. పరిస్థితులు విషమించుచున్నవి.

మొగలులలో కడపటివాడగు ఔరంగజేబు అప్పుడు వచ్చెను. తన ముసలితండ్రిని చెరలో బంధించి అతడు రాజ్యపాలన ప్రారంభించెను. నలభై ఎనిమిది సంవత్సరములు 1659 నుండి 1707 వరకు అతడు పాలించెను. తాత జహంగీరుకువలె అతనికి కళాసాహిత్యము లన్న కిట్టదు. తండ్రి షాజహానును వలె భవననిర్మాణమన్న కిట్టదు. భోగములు కోరని శుద్ధుడాతడు. మతమూఢతకలవాడు; తనమతము తప్ప ఇక ఏమతమన్నను అతనికి సహనము లేదు. అతని కొలువు కూటము వైభవోపేతముగానే ఉండెను. కాని అతడు మట్టుకు నిరాడంబరముగా విరాగివలె నుండెను. బుద్ధిపూర్వకముగా నతడు హిందూమతావలంబుల పీడించుటకు దొరకొనెను. ఇతర మతములవారిని సమాధాన పెట్టుటా, మతసమ్మేళనమూ అను విషయముపట్ల అక్బరు అవలంబించిన విధానము నతడు బుద్ధిపూర్వకముగా రద్దుచేసెను. ఇట్లాతడు సామ్రాజ్య

మున కింతవరకు ఆధారమైయున్న పునాదులను పెకలించివేసెను. హిందువులపై మరల నాతడు జిజియా తలపన్ను వేసెను. సాధ్యమైనంతవరకు హిందువులకు ఉద్యోగములు లేకుండ చేసెను. అక్బరు కాలమునుండియు రాజవంశమునకు ప్రాపుగానుండిన రాజపుత్రుల నతడవమానించెను. అకాలమున రాజపుత్ర యుద్ధము సంభవించింది. వేలకొలది దేవాలయముల నాతడు నేలమట్టము చేసెను. గతకాలము నాటి సుందరమగు ప్రాచీన భవనము లనేకము ఈ విధముగా మట్టిలో కలిసినవి. దక్షిణమున అతని సామ్రాజ్యము విస్తరించినది. బీజపూరు గోల్కొండలు అతని వశమైనవి. ఎంతో దక్షిణమునుండి అతనికి కప్పములు వచ్చుచుండెను. ఇంత జరుగుచున్నప్పటికీ దాని పునాదులు దుర్బలమైనది. నానాటికీ అది నిరసిస్తూన్నది. అన్ని వైపులనుండీ శత్రువులు తలయెత్తిరి. జిజియాపన్ను తీసివేయమని హిందువులతనికి పెట్టుకొన్న అర్జీలో ఇట్లున్నది. "ఈ పన్ను న్యాయ సమ్మతముకాదు: రాజనీతికికూడా వ్యతిరేకమే. కారణము అందువల్ల దేశము దరిద్రమగును. అంతేకాదు. ఈ పన్ను విపరీతమైనది. హిందూస్థాన ధర్మముల నది అతిక్రమించుచున్నది.'' సామ్రాజ్యములో అప్పుడున్న పరిస్థితుల నుద్దేశించి అది యిట్లు చెప్పుచున్నది. "తమ రాజ్యములో అనేకులు సామ్రాజ్యమునుండి విడిపోయినారు. దోపుళ్లూ, విధ్వంసమూ అంతటా అడ్డులేకుండా జరుగుచుండుటవల్ల తప్పనిసరిగా మరి కొన్ని రాజ్యములు తమరు పోగొట్టుకోవలసియుండును. తమ ప్రజలను కాలిక్రిందవేసి నలిచివేస్తున్నారు. సామ్రాజ్యములో ప్రతిరాష్ట్రమును దరిద్రస్థితికి వచ్చినది. జనక్షయము వ్యాపించుచున్నది. కష్టములు పేరుకొనుచున్నవి.''

సామాన్యముగా ప్రజలలో ప్రబలిన ఈదుఃఖమే తరువాతి యాభై సంవత్సరములలోను ఇండియాలో రానున్న మార్పులకు నాందియైనది. ఈ మార్పులలో ఒకటి—మొగలు మహా సామ్రాజ్యము, ఔరంగజేబు

మహాజనానంతరము వున్నట్లుండి పూర్తిగా కూలబడిపోవుట. గొప్ప మార్పులకును, గొప్పఉద్యమములకును వెనుక సర్వదా ఆర్థిక కారణము లుండును. యూరోపులోనూ, చీనాలోనూ ఆర్థిక సంపత్తు కూలిపోయి విప్లవము తలఎత్తిన వెంటనేగాని, తరువాతగాని గొప్పసామ్రాజ్యములు పతనమగుట మనము చూచియున్నాము. ఇండియాలోకూడ అంతే.

ఇతర సామ్రాజ్యములవలెనే మొగలుసామ్రాజ్యముకూడ స్వతసిద్ధ మగు దౌర్బల్యమువల్లనే కూలిపోయెను. అక్షరాలా అది ముక్కలై పోయెను. ఔరంగజేబు రాజనీతి కారణముగా ప్రస్ఫుటమైన హిందు వులలోని విప్లవ నూతనచైతన్యము ఈ పతనమున కెక్కువగా సహా యము చేసినది. కాని మత సంబంధమగు ఒక విధమైన, హిందువుల ఈ జాతీయత ఔరంగజేబు కాలమునకు ముందునుండియు వేళ్లు తన్ను కొని వుండెను. బహుశా ఔరంగజేబు వారియెడల అసహనముగా వుండుటకిది కొంత కారణమై యుండవచ్చును. హిందువులు పునరు జ్జీవనము నందిరి. అందు ప్రముఖులై పనిచేసినవారు మహారాష్ట్రులు, సిక్కులు ఇతరులు. మొగలు సామ్రాజ్య పతనమునకు వారే కారకు లని ముందుజాబులో మనము తెలిసికొనగలము. కాని, వారు లాభమంద లేదు. ఈ గొప్పఆస్తి వారికి దక్కలేదు. చల్లచల్లగా, తెలివి తేటలతో బ్రిటిషువారు ప్రవేశించి, ఇతరులు ఒకరితో నొకరు పోరాడుచుండగా ఈ కొల్లగొట్టిన సొమ్ము వారు స్వాధీనము జేసికొనుండిరి.

సైన్యములతో బయలుదేరి వెళ్లినప్పుడు చక్రవర్తి శిబిర మెట్లుండెనో తెలిసికొన నీకిష్టముండవచ్చును. అది బ్రహ్మాండమగు శిబిరము. దాని కైవారము 30 మైళ్లు. జనసంఖ్య 5 లక్షలు. చక్రవర్తి ననుసరించివచ్చిన సైనికులుకూడ ఈ జనసంఖ్యలో చేరియుండిరి. ఇతరజనులును అసంఖ్యాకులుండిరి. వందలకొద్దిబజారు లీ సంచార నగరమునందుండెను. సంచరించు ఈ శిబిరములందే ఉర్దు—అనగా శిబిరభాష—వృద్ధినందెను.

మొగలుల కాలమునకు సంబంధించిన పురుషుల చిత్తరుపులనేకము నేడుకూడ చూడవచ్చును. అవి చక్కగా, సున్నితముగానుండును. రాజుల చిత్తరువులు చిత్రశాలనిండా గలవు. బేబరు నుండి ఔరంగజేబువరకూ నున్న చక్రవర్తుల మూర్తిత్వము ఆ చిత్తరువులు చక్కగా ప్రకటించుచున్నవి.

మొగలు చక్రవర్తులు రోజుకు అధమపక్షము రెండు పర్యాయములు మేడ వసారానుంచి ప్రజలకు దర్శనమిస్తూ వారి అర్జీలు పుచ్చుకొనేవారు. 1911 లో ఇంగ్లీషు రాజు జార్జి V ఢిల్లీలో పట్టాభిషేక దర్బారుకు వచ్చినప్పుడు పై విధముగానే దర్శనమిచ్చేటట్లు చేశారు. ఇండియా రాజ్యమునకు మొగలుల ననుగమించి రాజ్యముకు వచ్చినట్లు బ్రిటీషువారు భావించుకొంటారు. అందుచే వారి దంభమును అనాగరిక ఆడంబరమును అనుకరించడానికి ప్రయత్నిస్తారు. ఇంగ్లీషు రాజుకు మొగలురాజుల బిరుదమైన కైజరీ-హింద్‌నుకూడా కట్టిబెట్టారని నీకిదివరలో చెప్పియుంటిని. నేడుకూడా ఇండియాలోని ఇంగ్లీషు వైస్రాయి చుట్టును వుండు ఆడంబరమూ, దంభమూ ప్రపంచములో మరెక్కడా లేవు.

తరువాత వచ్చిన మొగలులు పరదేశులతో నెట్లువ్యవహరించారో నీకింకా నేను చెప్పలేదు. అక్బరు కొలువుకూటములో పోర్చుగీసువారు ఆదరింపబడుచుండిరి. ఈ పోర్చుగీసుల ద్వారానే అక్బరు యూరోపియన్ ప్రపంచములో సంబంధములు పెట్టుకొనుచుండెను. అతని దృష్టిలో పోర్చుగీసులు యూరోపియన్ జాతుల వారందరికంటె ప్రబలమగుజాతి. సముద్రములు వారివశములో వుండెను. అప్పటికి ఇంగ్లీషువారు తలయెత్తలేదు. గోవాను కబళింపగోరి అక్బరు దానిపై దండయాత్ర చేసెనుకాని లాభము లేకపోయెను. మొగలులబుద్ధి సముద్రాధికారముమీది కెక్కలేదు. సముద్రాధిపత్యముగల జాతి ముందర వారు శక్తివిహీనులు. ఇది వింతగానే వున్నది. ఎందువల్లనంటే ఆకాలమున

తూర్పుబెంగాలులో నౌకానిర్మాణమెక్కువగా జరుగుచుండెను. కాని ఈ నావలన్నీ వర్తకపు సరుకు తీసుకుపోవడమునకే ఉద్దేశింపబడ్డవి. మొగలుసామ్రాజ్య పతనమునకొక కారణము సముద్రాధికారము లేకపోవుటయే అని చెప్పుదురు. సముద్రాధికారము గల జాతుల రోజులు వచ్చినవి.

మొగలుల రాజసభకు ఇంగ్లీషువారు రా ప్రయత్నించిరి కాని పోర్చుగీసులకు కన్నెర్రగా ఉండెను. కాన వారు జహంగీరుకు వారిపై సదభిప్రాయము కలుగకుండ గట్టి ప్రయత్నములుచేసిరి. 1615 లో ఇంగ్లాండురాజైన జేమ్సు I రాయబారి సర్ థామస్ మన్రో అనువాడు జహంగీరు కొలువు కూటమును ప్రవేశింపగలిగెను. చక్రవర్తి వద్ద నుండి అతడు వర్తకసౌకర్యములు కొన్ని పొంది, తూర్పు ఇండియా సంఘముయొక్క వర్తకమునకు పునాదులువేసెను. ఇంతలో ఇంగ్లీషు నౌకాదళము పోర్చుగీసు నావలను ఇండియన్ సముద్రములలో ఓడించెను. ఇంగ్లీషువారికి మంచి రోజులు క్రమంగా ఉదయిస్తున్నవి. పోర్చుగల్ పడమటి దిక్కున అస్తమిస్తోంది. డచ్చివారును ఇంగ్లీషువారును క్రమేణా పోర్చుగీసులను తూర్పుసముద్రములనుండి తరిమివేసిరి. 1641 లో గొప్ప రేవు పట్టణమైన మలాకా డచ్చివారి స్వాధీనమైనట్లు నీకు జ్ఞాపకముండవచ్చును. 1629 లో షాజహానుకును, పోర్చుగీసులకును హుగ్లీలో యుద్ధము తటస్థించెను. పోర్చుగీసులు నిరభ్యంతరముగా బానిస వ్యాపారమును సాగించుచుండిరి. బలవంతాన ప్రజలను క్రైస్తవమతములోనికి తిప్పుకొనుచుండిరి. పోర్చుగీసులు ధైర్యముతో పోరాడినప్పటికిని హుగ్లీ మొగలుల స్వాధీనమయ్యెను. పోర్చుగల్ చిన్నదేశము. నిరంతరయుద్ధములవల్ల అది అలసిపోయింది. సామ్రాజ్యస్థాపనకై జరుగుచున్న పోటీనుండి అది విరమించెను. కాని గోవాను, మరికొన్ని ప్రదేశములను మాత్రమది వదలుకోలేదు. నేటికి కూడా అవి దాని వశమందే ఉన్నవి.

హిందూదేశ తీరమందున్న పట్టణములైన మద్రాసు, సూరతుల దగ్గర ఇంగ్లీషువారు ఫాక్టరీలు నిర్మించుకొనిరి. 1639 లో మద్రాసును వారే స్థాపించిరి. 1662 లో ఇంగ్లాడు రాజైన ఛార్లసు II బ్రాగాంజా అను పోర్చుగీసు రాజకుటుంబమునకు చెందిన కేతరీనును పెండ్లాడెను. అప్పుడు కట్నముగా అతనికి బొంబాయి ద్వీపమువచ్చెను. కొన్నాళ్లయిన పిమ్మట ఈ ద్వీపము నతడు తూర్పుయిండియా సంఘమునకు మిక్కిలి కొద్ది మొత్తమునకు అమ్మివేసెను. ఔరంగజేబు రాజ్యకాలములో ఇది జరిగెను. పోర్చుగీసులను తరిమివేసినందుకు తూర్పు ఇండియా సంఘము గర్వించియుండెను. మొగలు సామ్రాజ్యము దుర్బలమగుచున్నదని అది గ్రహించెను. కాన 1685 లో ఇండియాలో ఎక్కువ ప్రదేశములను యుద్ధముచేసి సంపాదించ ప్రయత్నించెను. కాని అది దెబ్బతిన్నది. ఇంగ్లాండునుండి యుద్ధనావలువచ్చి తూర్పున బెంగాలులోను, పశ్చిమమున సూరతులోను ఉన్న ఔరంగజేబు రాష్ట్రములపై దాడి సాగించెను. కాని మొగలు లింకను ప్రబలులుగానే ఉన్నారు. ఇంగ్లీషువారిని తీవ్రముగా ఓడించిరి. ఇంగ్లీషువారు దీని నుంచిబుద్ధి తెచ్చుకొని ముందుముందు జాగ్రత్తగాఉండుట నేర్చుకొనిరి. ఔరంగజేబు చనిపోయిన పిమ్మట మొగలు సామ్రాజ్యము ముక్కలైపోవుచున్నప్పుడుకూడా సాహసకార్యములు చేయుటకు వారెంతో కాలం జంకిరి. 1690 లో వారిలో ఒకడు జాబ్ చార్నాక్ అనువాడు కలకత్తా నగరమును స్థాపించెను. ఇట్లు మద్రాసు, బొంబాయి, కలకత్తా నగరములు మూడును ఇంగ్లీషువారిచే స్థాపించబడి వారి ప్రయోజకత్వము వల్లనే తొలుదొలుత వృద్ధినందినవి.

ఇప్పుడు ఫ్రాంసుకూడా ఇండియారంగమును ప్రవేశించెను. ఫ్రెంచి వర్తక సంఘమును వారు స్థాపించి 1668 లో సూరతువద్ద వారొక ఫాక్టరీని, ఇతరస్థలములలో మరికొన్నిటినీ ప్రారంభించిరి. కొన్ని సంవత్సరములైన పిమ్మట వారు పుదుచ్చేరి పట్టణమును కొనిరి.

అది తూర్పు తీరమున మిక్కిలి ప్రసిద్ధమగు వర్తకరేవు పట్టణమైనది.

1707లో ఔరంగజేబు, సుమారు 90వ ఏట వృద్ధుడై మరణించెను. అతడు విడిచిన మహత్తరమగు సామ్రాజ్యమును—ఇండియాను—గ్రహించ పోరాటములు సలుపుటకు రంగము సిద్ధముగానుండెను. ఔరంగజేబునకు అసమర్థులగు వారసులుండిరి. అతని గవర్నర్లలో కొందరు గొప్పవారుండిరి. మహారాష్ట్రులుండిరి; సిక్కులుండిరి; వాయవ్య ప్రాంతములోని జాతులు దీనిని గ్రహించ దృష్టులు బరుపుచుండిరి; సముద్రములుదాటివచ్చిన విదేశజాతులు రెండు—ఇంగ్లీషువారును, ఫ్రెంచి వారును ఉండిరి. సరే, మరి ఇండియాలోని ఆ బీదప్రజలమాట ఏమిటి?

# 91

# సిక్కులూ, మహారాష్ట్రులూ

సెప్టెంబరు 12, 1932

ఔరంగజేబు మరణానంతరము నూరు సంవత్సరములవరకూ ఇండియా అతుకులబొంతవలె ఉండెను. క్షణక్షణమూ మారుచుండే బొమ్మలుచూపు చిత్రదర్శని (కెలీడొస్కోపు) వలెనుండెను. చూచుటకు మాత్రమంత ఇంపుగాలేదు. సాహిసికులకునూ, కుళ్ళంకలు పెట్టుకోకుండా ఏదో ఒకవిధముగా లాభములందగోరే దుర్మార్గులకునూ అదితగిన కాలము. కాన ఇండియా దేశము అన్ని భాగములందూ ఇట్టి సాహసికులు—ఇండియాలోనే పుట్టిన సాహసికులు, వాయవ్యప్రాంతము లందుండి వచ్చినవారూ, ఇంగ్లీషు ఫ్రెంచివారివలె సముద్రములు దాటి వచ్చినవారూ—తలయెత్తిరి. ప్రతీ మనుష్యుడూ లేక ప్రతీ జట్టూ, మిగతవాళ్ళు ఏమైనసరే అని పనికి పూనుకొన్నారు. ఒక్కొక్కప్పుడు ఇద్దరు ముగ్గురు కలిసి మూడవవానిని అణచివేయడానికి సిద్ధపడ్డారు. చివరకు వారిలోవారికి కలహాలు తటస్థించేవి. రాజ్యములు సాపించడానికీ,

త్వరలో భాగ్యవంతులు కావదానికీ తీవ్ర ప్రయత్నాలు చేశారు. పట్ట పగలు, బిడియము లేకుండా, వర్తకమను బురఖా ఒక్కొక్కమారు కప్పి దోపుళ్లు సాగించారు. వీటికి వెనుక పూర్తిగా అంతర్లీనమగు చున్న మొగలు సామ్రాజ్యముండెను. చక్రవర్తి నామముధరించినవాడు పాపము, ఇతరుల ఖైదీగానో, పింఛను దారుగానో ఉండెను.

ఈ మెగరొప్పు, ఈ అల్లరి, ఈ తిరుగుళ్లు లోలోపల రేగుచున్న విప్లవమునకు బాహ్య చిహ్నములు మాత్రమే. పాత ఆర్థిక పద్ధతులు విచ్ఛేదమైపోవుచుండెను. ఫూడల్ పద్ధతికి రోజులు నిండినవి. అది కూలిపోతోంది. దేశమందలి పరిస్థితులకది అనుగుణముగాలేదు. యూరోపులో ఇట్లు జరుగుట చూచితిమి. అచ్చట వర్తకతరగతులు పైకి వచ్చినట్లు చూచియుంటిమి. వీరిని నిరంకుశ ప్రభువులు అరికట్టు చుండిరి. ఇంగ్లాండులోనూ, కొంతవరకు హాలెండులోనూ మాత్రమే రాజులు అణచివేయబడిరి. ఔరంగజేబు సింహాసన మెక్కునరికి ఇంగ్లాండులో ఛార్లెస్ I తల తీసినతరువాత తెలిసిన ప్రజాప్రభుత్వ ముండెను. ఔరంగజేబు రాజ్యముచేయుకాలమునందే బ్రిటిషు విప్లవము జేమ్సు II పారిపోవుటతోను, 1688 పార్లమెంటు విజయముపొందుట తోను పూర్తి అయ్యెను. ఇంగ్లాండుకు పార్లమెంటువంటి కొంత జనాంగీకారము పొందిన సంఘముండుట ఈ పోరాటమునకు సహాయ భూతముగానుండెను. ఫూడల్ కులీనులకునూ, తరువాత రాజుకునూ వ్యతిరేకముగా నిలబెట్టుటకు ఆధారము దొరికినది.

యూరోపులోని ఇతర దేశములు పెక్కింటిలో పరిస్థితులు వేరుగాఉండెను. ఫ్రాంసులో ఇంకను మహాచక్రవర్తి లూయీ XIV ఉండెను. ఔరంగజేబు దీర్ఘ పరిపాలన కాలమున అతడతని సమ కాలికుడుగా ఉండెను. ఔరంగజేబు మరణించిన తరువాతకూడ అతడు ఎనిమిది సంవత్సరములు బ్రదికెను. దాదాపు 18 వ శతాబ్ది అంతము వరకూ అక్కడ నిరంకుశప్రభుత్వము సాగెను. అప్పుడు బ్రహ్మాండ

మైన తిరుగుబాటు—గొప్ప ఫ్రెంచి విప్లవము—సంభవించెను. జర్మనీలో 17 వ శతాబ్ది మిక్కిలి కష్టకాలమైయుండెనని మనముచూచియుంటిమి. ఈ శతాబ్దిలోనే 30 సంవత్సరముల యుద్ధము జరిగెను. తత్ఫలముగా దేశము విభిన్నమై నాశనమందెను.

18 వ శతాబ్దిలోని ఇండియా పరిస్థితులు కొంతవరకు జర్మనీ లోని 30 సంవత్సరముల యుద్ధకాలము నాటి పరిస్థితులతో పోలియుం డెను. కాని ఆపోలిక సర్వతోముఖమని భావించకుము. రెండు దేశము లును ఆర్థికముగా చదికిలబడెను. పాతఫ్యూడల్ తరగతి ప్రజలకు సంఘములో స్థానములేదు. ఇండియాలో ఫ్యూడల్ పద్ధతి కూలిపోవు చున్నది. కాని అది చాలా కాలమునకు గాని అంతరించలేదు. అది క్రియకు అంతరించినప్పటికీ దాని బాహ్యరూపమింకను మిగిలియుండెను. నేడు సైతము ఇండియాలోను, యూరోపులో కొన్ని భాగములందును ఫ్యూడల్ పద్ధతి శిధిల చిహ్నములనేకములు కానవచ్చుచున్నవి.

ఆర్థిక పరిస్థితులలో గలిగిన ఈ మార్పులు కారణముగా మొగలు సామ్రాజ్యము వికలమయ్యెను. ఇట్టిపరిస్థితులలో అధికారమును గ్రహించి లాభమొందుటకు మధ్యతరగతి ప్రజలు సిద్ధముగా లేకుండిరి. ఇంగ్లాండులో ఉన్నట్లు, ఈ తరగతుల ప్రతినిధులు గల సంఘముగాని, సంస్థగాని ఇండియాలో లేకుండెను. తీవ్రమగు నిరంకుశ పరిపాలనకు తలయొగ్గి ఉండుటచే ప్రజలలో సేవాభావము ప్రబలియుండెను. వెనుకటి స్వాతంత్ర్య భావనలు ప్రజలు మరచిరి. అయినప్పటికీ అధికారమును గ్రహించుటకు ప్రయత్నములు, ఫూడల్ నాయకులు కొంతా, బూర్జువా కొంతా, రైతులుకొంతా చేసిరి. కొన్ని ప్రయత్నములు విజయోన్ముఖ ములైనవికూడ. ఫ్యూడల్పద్ధతి పతనకాలమునకును, మధ్యతరగతులు లేచిన కాలమునకును ఉన్నమధ్యకాలములో అధికారము వహించుటకు సిద్ధముగా ఉన్నవారెవరూ లేరనే సంగతి ముఖ్యముగా మనము గ్రహించాలి. ఇండియాలో ఇట్లే సంభవించింది. చిల్లర రాజులూ, రాజ

పుత్రులూ అధికారమునకై కొట్లాడుకొనుచుండిరి. కాలమునకు సరిపోయిన భావములు లేవు వారికి. వారికి గట్టి పునాదులు లేవు. వారొక కొత్తతరగతి జనుల నెదుర్కొనవలసి వచ్చింది. వీరు బ్రిటిషు బూర్జువాజా ప్రతినిధులు. స్వదేశమున ఈ తరగతిప్రజలు మొన్ననే విజయము సాధించిరి. ఈ బ్రిటిషు మధ్య తరగతివారు ఫ్యూడల్ తరగతికన్న ఎక్కువగా ఉన్నత సాంఘిక సంస్థలకు ప్రతినిధులై ఉన్నారు. ప్రపంచములో వృద్ధినందుచున్న నూతన పరిస్థితులకు ఈ బూర్జువాజా అనుగుణముగా ప్రవర్తించుచుండెను. ఇది ఎక్కువకట్టుగాను, సమర్థముగాను ఉండెను. మంచి ఉపకరణములు, ఆయుధములు దానికి కలవు. అందుచే ఎక్కువ సామర్థ్యముతో అది యుద్ధము చేయగలదు. దానికి సముద్రాధికారముకూడా కద్దు. ఈ నూతన జాతితో ఇండియాలోని ఫూడల్ రాజులు డీ కొనలేరు. ఒకరొకరుగా వారు దానికి లొంగిపోయారు.

ఈ జాబు కీఉపోద్ఘాతము దీర్ఘముగానే తయారయింది. మన మిప్పుడు కొంచెము వెనుకకుపోవలెను. ఔరంగజేబు పరిపాలన చివర రోజులలో ప్రజల తిరుగుబాట్లను గురించీ మత సంబంధియగు హిందూ జాతీయ పునరుజ్జీవనమును గురించీ వెనుకటి జాబులోనూ, ఈ జాబులోనూకూడా సూచించాను. దీనిని గురించి మరికొంత ఇప్పుడు నేర్చు కొందము. మొగలు సామ్రాజ్యము అనేక ప్రాంతములలో మతముతో సంబంధించిన ఉద్యమాలనేకము వృద్ధి పొందుచుండెను. వాటికి రాజకీయాలతో సంబంధము లేకపోవుటచేత అవి కొంతకాలమువరకూ శాంతముగానే పనిచేసెను. దేషభాషలలో—హిందీ, మరాటీ, పంజాబీ— పాటలు, స్తోత్రములు వ్రాయబడ్డవి. అవి జనాంగీకారము నందినవి. ఈ పాటలూ స్తోత్రములూ కారణముగా ప్రజలలో చైతన్యము కలిగెను. మతబోధకుల నాధారముగా చేసికొని మత శాఖలు పుట్టును. ఆర్థిక పరిస్థితుల వత్తిడివల్ల క్రమక్రమముగా ఈ మత శాఖలు రాజకీయ విషయములందు కలుగజేసికొనును. పాలకులతో—మొగలు సామ్రాజ్య

ముతో—సంఘర్షణ దీనికి ఫలము. ఈ శాఖను అణచివేయ పాలకులు ప్రయత్నింతురు. పాలకులు పెట్టు బాధలవల్ల శాంతముగా పనిచేయు మత శాఖలు యోధసంఘములుగా మారును. సిక్కు లీవిధముగానే అభివృద్ధినొందిరి. అనేక యితర శాఖలుకూడ ఇట్లే వృద్ధి చెందెను. మహారాష్ట్రుల గాథ ఇంతకన్న క్లిష్టమైనది. కాని ఇందుకూడ మతమును, జాతీయతయు కలసి మొగలుల నెదిరించెను. మొగలు సామ్రాజ్యమును తిరుగదోసినది బ్రిటిషువారుకాదు. ఈ మత—జాతీయోద్యమములున్నూ, ముఖ్యముగా మహారాష్ట్రులున్నూ దానిని తిరుగదోసిరి. ఈ యుద్యమములు ప్రబలమగుటకు ఔరంగజేబు అసహనమే కారణము. తన ప్రభుత్వముపై వ్యతిరేకభావమువహించిన ప్రజలలోని ఈమతచైతన్యమే బహుశా అతడు అసహనముగా నుండుటకును, కోపము వహించుటకును కారణమై యుండవచ్చును.

1669 లోనే మధురలోని జాట్ రైతులు తిరుగుబాటు చేసిరి. వారు ఉండెండియు అణచివేయబడిరి కాని ఉండిండియు వారు తల యెత్తుచుండిరి. ఔరంగజేబు మరణకాలము వరకూ, 30 సంవత్సముల పాటు ఇట్లు జరిగెను. మధుర ఆగ్రాకు సమీపమందున్నదన్నమాట మరచిపోవద్దు. ఈ తిరుగుబాట్లు రాజధానీ నగరమునకు సమీపమందే సంభవిస్తున్నవని గ్రహించవచ్చు. వేరొక తిరుగుబాటు సాత్నాములది. ఇదియొక హిందూ మతశాఖ. అందుండు వారు ముఖ్యముగా సామాన్య ప్రజలు ఇదికూడ బీదప్రజల తిరుగుబాటే. కులీనులు, గవర్నరులు చేయు తిరుగుబాటువంటిది కాదిది. ఎంతో కోపముతో ఆనాటి ఒక మొగలు కులీనుడు వారి నీవిధముగా వర్ణించెను. "క్రూరులు, నీచులు అయిన విప్లవకారులూ, కంసాలులూ, వడ్రంగులూ, పాకీవాళ్లూ, తోలు బాగుచేసేవాళ్లూ మొదలైన తుచ్ఛులమూక అది." అతని అభిప్రాయము ప్రకారము "అట్టితుచ్ఛులు" గొప్పవారిపై తిరుగబడుట చాలా తప్పుడుపని.

మనమిప్పుడు సిక్కులకడకు వచ్చితిమి. వారి చరిత్ర ముందటి కాలమునుండియు చెప్పవలసి ఉన్నది. నేను నీకు గురునానకును గురించి చెప్పానని జ్ఞాపకమున్నదా ? బేబరు ఇండియాకు వచ్చుట తోడనే నానకు మరణించెను. హిందూ మతమునకును ఇస్లాం మతమునకును సామరస్యము కూర్చుటకు ప్రయత్నించిన వారిలో అతడొకడు. అతని తరువాత ముగ్గురు గురువులు వచ్చిరి. అతనివలెనే వారును బహు శాంతులు. మతవిషయములందే వారికి ప్రీతి. అమృతసరములోనున్న బంగారు గుడికిని, కోనేరుకును కావలసిన నివేశస్థలమును అక్బరు నాల్గవ గురువుకు ఇచ్చెను. నాటినుండి అమృతసరము సిక్కుమతమునకు మూలస్థానమైనది.

తరువాత అయిదవ గురువు అర్జునసింగు వచ్చెను. ఇతడు "గ్రంథము"ను సంగ్రహించెను. "గ్రంథ"మనగాస్తోత్రములయొక్కయు, మహా వాక్యములయొక్కయు సంగ్రహము. అది సిక్కుల పవిత్ర గ్రంథము. రాజకీయనేరము చేసినందుకు జహంగీరు అర్జునసింగును చిత్రవధచేసెను. సిక్కుల చరిత్రలో మార్పులు తెచ్చిన ఘట్టమిది. వారి గురువును అన్యాయముగా, క్రూరముగాదండించినందుకు సిక్కులకు రోషమువచ్చినది. వారు ఆయుధములుధరించారు. వారి ఆరవగురువైన హరగోవిందుని నాయకత్వమున వారు యోధసంఘమైనారు. నాటినుండియు పాలకవర్గముతో వారికి తరుచు విరోధము కల్గుచునేఉండెను. గురుహరగోవిందుని జహంగీరు పదిసంవత్సరములు ఖైదులోపెట్టెను. తొమ్మిదవగురువు తేజిబహదూరు. ఇతడు ఔరంగజేబు కాలమునందుండెను. ఇస్లాంమతమును అవలంబించమని ఔరంగజేబు అతనికి ఉత్తరువుచేశాడు. అతడు నిరాకరించగా అతనిని ఉరిదీయించాడు. పదవగురువు—ఆఖరి గురువు—గోవిందసింగు. ముఖ్యముగా ఢిల్లీ చక్రవర్తిని ప్రతిఘటించుటకై అతడు సిక్కులను ప్రబలమగు యోధజాతిగా చేశాడు. ఔరంగజేబు చనిపోయిన ఒక సంవత్సరమునకాతడు

మరణించాడు. అప్పటినుంచీ గురువులేడు. గురువుల శక్తులన్నీ శిక్కుజాతికి సంక్రమించినవని చెప్పుతారు. ఆ జాతి పేరు "ఖాల్సా." అనగా ఎన్నికకు వచ్చిన శ్రేష్ఠులు అన్నమాట.

ఔరంగజేబు చనిపోవుటతోడనే సిక్కులు తిరుగుబాటుచేసిరి. ఈ తిరుగుబాటు అణచివేయబడెను గాని సిక్కులు నానాటికీ ప్రబలులై పంజాబులో గట్టిబడిరి. కొంతకాలమైన పిమ్మట ఆ శతాబ్దాంతమున పంజాబులో రంజిత్‌సింగుకింద ఒక సిక్కురాజ్యము ఉదయించనుండెను.

ఈ తిరుగుబాట్లన్నిటివల్లా కష్టముకలిగినా మొగలు సామ్రాజ్యమునకు అసలు ప్రమాదము నైరుతిదిశలో ప్రబలులగుచున్న మహారాష్ట్రుల నుండి వచ్చినది. షాజహాను రాజ్యములోనే షాజీ భోంస్లే అను మహారాష్ట్ర నాయకుడు కష్టములు కలిగించుచుండెను. అహమదునగర రాజ్యములో అతడొక ఉద్యోగి. తరువాత బీజపూరు రాజ్యములో ఉద్యోగి అయ్యెను. కాని 1627 లో పుట్టిన అతని కుమారుడు శివాజీ మహారాష్ట్రమునకు మాణిక్యమువంటివాడై సామ్రాజ్యమునకు గుండెబెదురుగా ఉండెను. పందొమ్మిది సంవత్సరముల వయస్సునాడే అతడు దోపుళ్లు ప్రారంభించి పూనావద్దనున్న దుర్గమును స్వాధీనము చేసికొనెను. శూర శిఖామణియగు నాయకుడతడు. దొంగపోటు యుద్ధము నడిపించుటలో కడుసమర్థుడు. సాహసికుడు. ధైర్యశాలులు, దృఢకాయులు, విశ్వాస పాత్రులు అగు కొండమనుష్యులను అతడు చేరదీసెను. వారి సహాయముతో అతడనేక దుర్గములను స్వాధీనము చేసికొని ఔరంగజేబు సేనానులకెంతో కష్టము కలిగించెను. 1665 లో అతడు హఠాత్తుగా సూరతులో—అక్కడ ఇంగ్లీషువారి ఫ్యాక్టరీ ఉన్నది—కనిపించి, ఆ నగరమును కొల్లగొట్టెను. ఆగ్రాలోని ఔరంగజేబు కొలువుకూటమును దర్శింప అతడు ప్రోత్సహింపబడెను. కాని స్వతంత్ర రాజుక్రింద అతడు భావింపబడలేదు. అందుచే తన్ను న్యూనతపరచి, పరాభవించారని అతడనుకొనెను. అతనిని ఖైదులోపెట్టారు కాని తప్పించుకొన్నాడు.

అయినా అతనిని తమపక్షమునకు, రాజా అను బిరుదునిచ్చి, తిప్పకో ప్రయత్నించారు.

కాని శివాజీ వెంటనే యుద్ధమార్గ మవలంబించెను. దక్షిణమండలి మొగలుఉద్యోగులు భీతావహులై తమజోలికి రాకుండా రక్షించేటందుకు అతనికి పైకము చెల్లించారు. దీనినే చౌతు అంటారు. అనగా ఆదాయ ములో నాల్గవ వంతు అన్నమాట. పోయిన ప్రదేశములందంతటా వారు ఈ పైకమును పుచ్చుకొనేవారు. ఇట్లు మహారాష్ట్రుల ప్రాబల్యము వృద్ధి చెందుచు పోయెను. ఢిల్లీ సామ్రాజ్యము దుర్బలమగుచు పోయెను. 1674 లో శివాజీ రాయఘరులో పట్టాభిషేకము చేసికొనెను. శివాజీ 1680 లో మరణించెను. అంతవరకూ అతడు విజయములు సాధిస్తూనే ఉండెను.

నీవు కొన్నాళ్ళబట్టి పూనాలో ఉంటున్నావు. అది మహారాష్ట్రము నకు హృదయమువంటిది. అక్కడి జనులు శివాజీ నెట్లా ప్రేమించి, పూజిస్తారో నీకు తెలిసిఉంటుంది. నే నిదివరలో చెప్పిన ఒక మత— జాతీయ పునర్జీవనమునకతడు ప్రతినిధి. ఆర్థిక విచ్ఛిత్తి, ప్రజా సామా న్యము యొక్క హైన్యస్థితి ఇందుకు దోహదముగాఉండెను. రామదాసు, తుకారాము అను ఇద్దరు మహారాష్ట్ర మహాకవులు తమ కవిత్వంతోను, కీర్తనలతోను దీనిని పోషించిరి. ఇట్లు మహారాష్ట్రులకు చైతన్యము కలిగినది. వారు ఐక్యత సాధించిరి. ఆ సమయమునందే వారికి మహా నాయకుడొకడు తటస్థపడ్డాడు. అతడు విజయములు సాధించాడు.

శివాజీ కొడుకు శంభాజీని మొగలులు చిత్రహింసచేసి చంపారు. మహారాష్ట్రులు కొన్ని ఇబ్బందులకుపాలైనా ప్రబలులు అవుతూనేవచ్చిరి. ఔరంగజేబు మరణించుటతోడనే అతని గొప్పసామ్రాజ్యము అదృశ్యము కా ప్రారంభించింది. గవర్నరులు అనేకులు స్వతంత్రులైరి. బెంగాలు విడిపోయెను. అయోధ్య, రోహిల్‌ఖండములును విడిపోయినవి. దక్షిణమున వజీర్ అసాఫజా ఒక రాజ్యమును స్థాపించుకొనెను. అదే

నేటి హైద్రాబాదు రాజ్యము. నేటి నైజాము అసాఫజా సంతతివాడే. ఔరంగజేబు మరణించిన పదిహేడు సంవత్సరములకు సామ్రాజ్యము దాదాపు అంతరించెను. కాని ఢిల్లీలోనో, ఆగ్రాలోనో నామకః చక్రవర్తులు పరంపరగా సింహాసన మెక్కుచుండిరి. కాని వారికి సామ్రాజ్యములేదు.

సామ్రాజ్యము బలహీనమైనకొద్దీ మహారాష్ట్రులు ప్రబలులగుచుండిరి. వారి ప్రధాని పీష్వా, రాజును మరుగుపరచి సర్వాధికారములు తనచేతిలో పెట్టుకొనెను. పీష్వాల పదవి వంశపరంపరాగతమయ్యెను. జపానులో షోగనులిట్లే అధికారులైరి. రాజు ప్రాముఖ్యమును కోల్పోయెను. బలహీనుడగు ఢిల్లీ చక్రవర్తి దక్కనులో చౌతుపన్ను వసూలు చేసుకొనేహక్కు మహారాష్ట్రులకు కలదని అంగీకరించెను. దీనితో తృప్తినందక పీష్వా గుజరాతును, మాల్వాను, మధ్య హిందూస్థానమును స్వాధీనముచేసుకొనెను. 1737 లో అతనిసైన్యములు ఢిల్లీ ద్వారముల వద్దకు వచ్చెను. ఇండియా నంతా ఏకచ్ఛత్రముగా మహారాష్ట్రులు పాలిస్తారా అని తోచింది. ఇండియాలో వారే ప్రముఖులైఉండిరి. కాని హఠాత్తుగా 1739 లో వాయవ్యదిశనుండి పరదేశు లిండియాలో ప్రవేశించిరి. దానితో సమబలస్థితి (Balance of Power)తారుమారయ్యెను. ఉత్తర హిందూస్థాన జాతకము మారిపోయెను.

## 92

## ఇండియాలో ఇంగ్లీషులు ప్రతిస్పర్థులపై విజయము సాధించుట

సెప్టెంబరు 13, 1932

ఢిల్లీ సామ్రాజ్యం కష్టస్థితిలో ఉన్నట్లు మనము చూచాము. నిజమునకు సామ్రాజ్యము నామమాత్రమై ఉండెను. కాని ఢిల్లీయునూ, ఉత్తర హిందూస్థానమునూ ఇంకా నీచదశ అనుభవించవలసి ఉన్నది.

నేను ఇదివరకు చెప్పినట్లు సాహసికులగు దురాత్ములకు కాలమది. ఇట్టి వారిలో మేటిఒకడు హఠాత్తుగా వాయవ్య దిశనుంచి దిగివచ్చి, ప్రజలను చంపి, కొల్లగొట్టి లెక్కలేనంత ధనమును పట్టుకుపోయాడు. ఇతడు నాదర్షా. పర్షియాదేశమునకు రాజయ్యాడితడు. షాజహాన్ నిర్మింపచేసిన ప్రసిద్ధమగు మయూరసింహాసనము నితడు తనతోకూడా పట్టుకుపోయాడు. మహా దారుణమగు ఈ దుర్దశ 1739 లో సంభవించెను. ఉత్తర హిందూస్థానము ఇందువల్ల కుంగిపోయెను. నాదర్షా తన అధికారమును సింధునది పర్యంతము స్థాపించెను. మహా భారతము కాలమునుంచీ, గాంధారము కాలమునుంచీ, హిందూదేశచరిత్రపొడుగునా ఆఫ్ఘనిస్థానము ఇండియాతో కలిసిఉండెను. ఇప్పుడది విడిపోయెను.

మరి పదిహేడు సంవత్సరములలో ఢిల్లీ వేరొక దండయాత్రా, దోపుడూ చవిచూచెను. ఇవి చేసినవాడు అహమ్మదుషా దుర్రానీ అనువాడు. నాదర్షా అనంతరమితడు ఆఫ్ఘనిస్థానమునకు రాజయ్యెను. కాని ఈ దండయాత్ర జరుగుచున్నా మహారాష్ట్ర ప్రాబల్యము పెరుగుచునే ఉండెను. 1758 లో పంజాబు వారి వశమయ్యెను. వారు జయించిన దేశములో తమ ప్రభుత్వమును నెలకొల్పడానికి వారు ప్రయత్నించలేదు. వారు చౌతు పన్నును మాత్రము వసూలుచేసకొని స్థానికులకే పరిపాలన వదిలిపెట్టిరి. కాని క్రియకు ఢిల్లీ సామ్రాజ్యము వారిదే అయ్యెను. వారి అభివృద్ధికి ఆటంకమప్పుడు వచ్చింది. వాయవ్యమునుంచి దుర్రానీ ఇతరుల సహాయముతో, మహారాష్ట్రుల గొప్ప సైన్యమును, 1761 లో పానిపట్టు వద్ద ఓడించెను. దుర్రానీ ఉత్తర హిందూస్థానమునకు రాజయ్యెను. అతనిని ఎదిరించే వారెవరూ లేకుండిరి. విజయము సాధించిన క్షణమందే అతడు చిక్కులపాలయ్యెను. తన ప్రజలు ఎదురు తిరుగుటచేత అతడు ఇంటికి తిరిగి పోవలసివచ్చెను.

కొన్నాళ్ళపాటు మహారాష్ట్రుల అధికారము అంతరించినట్టే కనిపించింది. వారు నీచలో పడిరి. కోరిన మహాఫలము వారికందలేదు.

కాని క్రమక్రమముగా వారు తేరుకొన్నారు. మరల వారు ఇండియాలో మిక్కిలి ప్రబలమైన ప్రభుత్వమైరి. కాని ఇంతలో ఇదివరలోకన్న ప్రబలమైన శక్తులు పనిచేయడం మొదలుపెట్టాయి. కొన్ని తరముల కాలమునుంచి ఇండియా జాతకపై ఖరి నిర్ణయింపబడుతోంది. ఈ విషయము ముందుముందు మనము తెలిసికొంటాము. ఈకాలమందు మహారాష్ట్ర నాయకులనేకులు, పీష్వా ఆశ్రితులు తల ఎత్తారు. వీరిలో ముఖ్యుడు గ్వాలియరు సింధియా. ఇతడుగాక బరోడాగైక్వారును, ఇందూరు హోల్కారును ఉండిరి.

నేను పైని సూచించిన విషయాలిప్పుడు ఎత్తుకుందాము. ఈ కాలమున దక్షిణ ఇండియాలో ప్రధానవిషయము ఇంగ్లీషువారికీ, ఫ్రెంచి వారికీ జరుగుచున్న పోరాటము. 18 వ శతాబ్దిలో తరుచు ఇంగ్లాడు, ఫ్రాంసులు యూరోపులో యుద్ధములు చేసికొనుచుండిరి. వారిప్రతినిధులు ఇండియాలో ఒకరితో నొకరు పోరాడుకొనుచుండిరి. ఒక్కొక్కప్పుడు వారు యూరోపులో ఒడంబడిన ప్రకారము శాంతముగా ఉన్ననూ ఇండియాలోమాత్రము పోరాడుకొనుచుండిరి. ఉభయపక్షములలోనూ ధైర్యముగల సాహసికులగు దుర్మార్గులుండిరి. ధనమూ, అధికారమూ ఏదో విధముగా సంపాదించవలెనని ఆత్రుతతో వారుండిరి. వా రుభయులకూ తీవ్ర స్పర్థలుండుట సహజమే. ఫ్రెంచి పక్షమున ఈరోజులలో ఉన్న ప్రముఖుడు డూప్లే. ఇంగ్లీషు పక్షమున క్లైవుండెను. ఇండియాలో రెండు రాజ్యములు తగవులాడుకొనుచుండగా వారి తగవులలో ప్రవేశించి లాభము కొట్టుకొను పని డూప్లే ప్రారంభించెను. అందుకై ఇతడు తన సైన్యమును కూలికి పంపేవాడు. తుదకు రాజ్యములు గ్రహించేవాడు. ఫ్రెంచి వారి పలుకుబడి అతిశయించింది. కాని త్వరలోనే ఇంగ్లీషు వారున్నూ అతని పద్ధతులు నేర్చుకొని, వాటికి మెరుగు పెట్టారు. ఆకలితోఉన్న రాంబందులవలె ఈ రెండు పక్షముల వారూ ఎక్కడ కలహములంకురించునా అని కనిపెట్టి చూస్తూండేవారు.

ఇండియాకొరకు,
ఇంగ్లీషువారూ ఫ్రెంచివారూ
యుద్ధములు చేయుట

సింధునది
ఢిల్లీ
అయోధ్య
(ఔధ్)
గ్వాలియరు
మహారాష్ట్రులు
గంగానది
బెంగాలు
చంద్రనగరము
నైజాం
బొంబాయి
మైసూరు
మద్రాసు
పుదుచ్చేరి

తొలుత ఫ్రెంచివారి పలుకుబడిలో ఉన్న ప్రదేశములు

క్లైవు పెత్తనములో బ్రిటిషువారు సంపాదించినది

అప్పుడు కలహములకు లోటులేదు. దక్షిణమున సింహాసనమెవరిదని వారసులకు కలహము ప్రాప్తించినప్పుడల్లా ఇంగ్లీషు వారు ఒక వారసు పక్షాన్ని, ఫ్రెంచివారు రెండవ వారసుపక్షాన్ని అవలంబించేవారు. పదిహేను సంవత్సరములు (1746—1761) పోరాటములు చేసిన పిమ్మట ఫ్రాంసుపై ఇంగ్లాండు జయముపొందింది. ఇండియాలోని ఇంగ్లీషు సాహసికులకు తమమాతృదేశమునుండి సహాయమువచ్చేది. డూప్లేకునూ అతని సహచరులకునూ ఫ్రాంసునుండి అట్టి సహాయము రాలేదు. ఇందులో ఆశ్చర్యమేమీలేదు. ఇండియాలో ఇంగ్లీషువారికి ప్రోద్బలముగా ఇంగ్లీషు వర్తకులూ, తూర్పు ఇండియా సంఘములో వాటాదార్లూ ఉండిరి. వారికి పార్లమెంటుతోను ప్రభుత్వముతోనూ పలుకుబడిఉన్నది. ఫ్రెంచివారికి ప్రోద్బలంగా ఉన్నది లూయీ XV రాజు. ఇతడు మహాచక్రవర్తియైన లూ యీ XIV మనమడున్నూ, వారసున్నూ. ఇతడు భోగలాలసుడై, నాశనము తలమీదకి తెచ్చుకుంటున్నాడు. బ్రిటిషువారికిగల సముద్రాధిపత్యమున్నూ ఇందుకు తోడ్పడింది. ఫ్రెంచివారును, ఇంగ్లీషువారును ఇండియను సైన్యములకు శిక్షణనిచ్చు చుండిరి. శిక్ష పొందిన ఇండియన్ సైనికులకు శిపాయిలని పేరు. ఇది సిపాహి అనే పదమునుంచి వచ్చింది. స్థానిక సైన్యములకంటె మంచి ఆయుధములూ, మంచి శిక్షా వీరికుండుటచేత వీరికి గిరాకీ ఎక్కువగా ఉండెను.

ఇట్లు ఇంగ్లీషువారు ఇండియాలో ఫ్రెంచివారిని ఓడించి వారి పట్టణములైన పుదుచ్చేరి, చంద్రనగరములను ధ్వంసముచేశారు. ఆ పట్టణములలో ఒక ఇంటి కప్పుకూడా మిగలకుండా నాశము చేశారట. ఈనాడు మొదలుకొని ఫ్రెంచివారు ఇండియారంగమునుంచి నిష్క్రమించారు. మరల వారికి కొంతకాలానికి పుదుచ్చేరి, చంద్రనగరములు వచ్చినప్పటికీ, నేటివరకూ అవి వారి చేతులలో ఉన్నప్పటికీ, వాటికి ప్రాముఖ్యముమాత్రము లేదు.

ఈ కాలమున ఇంగ్లీషులకు ఫ్రెంచివారికీ రణరంగము ఒక్క ఇండియాయేకాదు. యూరోపులోనే కాకుండా వారు కెనడాలోనూ, ఇతర దేశములలోనూకూడా పోరాడుకొన్నారు. కెనడాలోకూడా విజయము ఇంగ్లీషువారిదే. కాని వెంటనే ఇంగ్లీషువారు అమెరికన్ అధినివేశములను పోగొట్టుకొనిరి. ఈ అధినివేశములకు సహాయముచేసి ఫ్రెంచివారు ఇంగ్లీషు వారిపై పగ సాధించుకొన్నారు. కాని ఈ విషయమునుగురించి ముందు వ్రాయబోవు జాబులో విపులముగా వ్రాస్తాను.

ఫ్రెంచివారు వదలిపోయారుగదా ఇక ఇంగ్లీషువారి మార్గములో ఉన్న ఆటంకములేమిటి ? పడమటి ఇండియాలోనూ, మధ్య ఇండియా లోనూ, కొంతవరకు ఉత్తరమునా మహారాష్ట్రులున్నారు. హైద్రాబాదు నైజామున్నాడుగాని అంతగా లెక్కలోకి రాడు. దక్షిణమున ప్రబలుడైన ప్రతిస్పర్థి కొత్తవాడు హైదరాలీ ఉన్నాడు. ప్రాచీన విజయనగర సామ్రాజ్యముయొక్క భాగములపై అతడు అధికారి అయ్యెను. అవి నేటి మైసూరు రాజ్యముకు సరిపోవును. ఉత్తరమున బెంగాలు సురాజ ఉద్దౌలాకింద ఉండెను. అతడు వట్టి అసమర్థుడు. ఢిల్లీ సామ్రాజ్యము ఊహలోమాత్రమున్నట్లు మనము చూచితిమి. అయినా, వింతగా ఉంటుంది, ఇంగ్లీషువారు వినయపూర్వకముగా ఢిల్లీ సామ్రాజ్యమునకు, 1756 వరకూ దాని అధీశ్వరత్వము ఒప్పుకుంటూ కానుకలు పంపేవారు. అనగా కేంద్ర ప్రభుత్వాన్ని పూర్తిగా నాశనం చేసిన నాదర్షాదండయాత్ర తరువాత ఎంతో కాలమువరకూ పంపేవారు. ఒకమారు బెంగాలులో ఇంగ్లీషువారు ఔరంగజేబు కాలములో ప్రతిఘటించి గట్టిదెబ్బ తిన్నారు. అందువల్ల వారు చాలా తగ్గిపోయి మళ్ళీ అట్టి ప్రయత్నము చేయడానికి జంకారు. నిజానికి ఉత్తరముననున్న పరిస్థితులనుబట్టి చూస్తే గట్టిగా తలుచుకొన్నవాడెవడైనా వెళ్ళి దానిని వశము చేసుకోవచ్చును.

తన దేశమువారి చేత సామ్రాజ్య నిర్మాత అని ఎంతో మెచ్చుకో బడ్డ క్లైవు అట్టి దృఢసంకల్పము కలవాడు. సామ్రాజ్య నిర్మాణపద్ధతులు

అతని గుణములలోనూ, చేతలలోనూకనిపిస్తున్నవి. అతడు సాహసుడు. దురాశాపీడితుడు. తన సంకల్పము నెరవేరుటకు దొంగసంతకములు చేయడానికి, దొంగదస్తావేజులుపుట్టించడానికీ, అబద్ధమాడడానికీ జంకడు. బెంగాలు నవాబైన సురాజద్దౌలా ఇంగ్లీషువారు చేసిన అనేక కార్యములకు కినిసి, తన రాజధానియైన మూర్షిదాబాదునుండి వచ్చి, కలకత్తా వశము చేసుకొన్నాడు. అప్పుడు "చీకటికొట్టు" దురంతము జరిగిందని చెప్పుతారు. నవాబు ఉద్యోగస్తులు ఇంగ్లీషువారి ననేక మందిని చిన్న గాలిలేని గదిలో ఒకరాత్రి తాళమువేసి పెట్టారనీ, వారిలో చాలామంది గాలిలేక చచ్చిపోయారనీ వారు చెప్పేమాట. అట్టిపని జరిగే ఉన్న ట్లయితే అది అనాగరికమైనదే: దారుణమైనదే. కాని ఈ కథ అంతా నమ్మదగని ఒక ఇంగ్లీషువాడు వ్రాసిన వ్రాతలనుబట్టి అల్లినది. కాని ఈ కథ చాలావరకు అబద్ధమనినీ, ఏమైనా చాలావరకు అతిశయోక్తులతో కూడుకున్నదనీ పలువురు తలుస్తారు.

కలకత్తాను వశము చేసుకున్నందుకు నవాబుమీద క్లైవు పగ సాధించాడు. కాని ఈ సామ్రాజ్యనిర్మాత ఆ పని చేయడానికి నవాబు మంత్రి మీర్ జాఫరుకు లంచముపెట్టి ద్రోహము చేయించాడు. దొంగ దస్తావేజు పుట్టించాడు. చెప్పితే ఈ గాథ చాలా దీర్ఘంగా ఉంటుంది. దొంగ సంతకములతోను, రాజద్రోహముతోను దోహద క్రియలు జరిపి క్లైవు నవాబును 1757 లో ప్లాసీవద్ద ఓడించాడు. ఇది చిన్న యుద్ధము. అంత చెప్పుకోదగ్గది కాదు. నిజమునకు, యుద్ధము ప్రారంభించుటకు పూర్వమే కుట్రలుపన్నుటవల్ల క్లైవు విజయము పొందగలిగాడు. కాని చిన్న యుద్ధమైన ఈ ప్లాసీఫలితములు పెద్దవిగానుండెను. బెంగాలు దేశభావిగతి దీనితో నిర్ణయమయ్యెను. ఇండియాలో బ్రిటిషు ప్రభుత్వము ప్లాసీతో ప్రారంభమైనదని చెప్పుదురు. రాజద్రోహము, దొంగ సంతకము అను తుచ్ఛమైన పునాదులపై

నిర్మింపబడినదీ బ్రిటీషు సామ్రాజ్యము ఇండియాలో. సామ్రాజ్యముల యొక్కయూ, సామ్రాజ్య నిర్మాతలయొక్కయూ వైఖరులు దాదాపు ఈ విధముగానేకదా ఉండేది.

అనుకోకుండా సిరివచ్చి పడడంతోనే బెంగాలులోని దురాశాపరులూ, సాహసికులూ అగు ఇంగ్లీషువారి తలలు తిరిగినవి. వారు బెంగాలుకు సర్వాధికారులయ్యారు. వారిని పట్ట పగ్గములు లేకుండెను. క్లైవు నాయకత్వమున వారు ఆ రాష్ట్రముయొక్క ఖజానాలో చేతులు పెట్టి దమ్మిడీ మిగులకుండా తీసుకొన్నారు. 25 లక్షల రూపాయలు రొఖ్కపూర్వకముగా క్లైవు తనకు తాను బహుమానముచేసుకొన్నాడు. దీనితో తృప్తి పొందక సాలుకు ఎన్నో లక్షలు ఆదాయము వచ్చు మంచి జాగీరునుకూడా తీసుకొన్నాడు. మిగిలిన ఇంగ్లీషువాళ్ళు ఈ విధముగానే ప్రతిఫలాలు తీసుకున్నారు. సిగ్గు, భిడియములు లేకుండా ధన సంపాదనకోసం వారంతా పాకులాడారు. తూర్పు ఇండియా సంఘములోని ఉద్యోగస్తుల ఆశకూ, అన్యాయమునకూ అంతము లేకుండెను. బెంగాలులో ఇంగ్లీషువారు నవాబు పదవికి సృష్టికర్తలయారు. ఇష్టమువచ్చినప్పుడు పాత నవాబును తొలగించి కొత్త నవాబును గద్దెమీద నిలబెట్టేవారు. ఇట్లు జరిగిన ప్రతి పర్యాయమూ వారు లంచములూ, పెద్దపెద్ద నజరానాలు తీసుకొనుచుండిరి. ప్రభుత్వ బాధ్యత వారికి లేదు. సారె సారెకు మారుచున్న నవాబుల దాపని. వారి పని త్వరలో భాగ్యవంతులగుట.

కొద్ది సంవత్సరములైన పిమ్మట, 1764 లో బక్సారువద్ద బ్రిటిషువారు వేరొక విజయము సాధించారు. దీనికి ఫలితము—ఢిల్లీలో నామమాత్రమున్న చక్రవర్తి వారికి వశుడగుట. తరువాత ఆ చక్రవర్తి వారినుండి పింఛను పుచ్చుకొనుచుండెను. బెంగాలు, బీహారు దేశములలో ఇంగ్లీషువారి యధికారము ప్రతిఘటింప రానిదయ్యెను. దేశమును కొల్ల

గొట్టి తీసుకుపోవుచున్న లక్షలాది డబ్బుతో వారికింకా సంతృప్తి లేక పోయింది. ధనము సంపాదించడానికి కొత్త మార్గాలు వెదుకదొడగారు. దేశములో జరుగుచున్న వర్తకముతో ఇంగ్లీషువారికి సంబంధములేదు. ఇప్పుడు వారు ఆ వర్తకమునుకూడా సాగించడానికి పూనుకున్నారు. కాని దేశి సరుకులతో వర్తకము చేయు ఇతర వర్తకులు చెల్లించవలసిన రవానా పన్ను వారు చెల్లించ నిరాకరించారు. ఇండియాలో సరుకులు తయారు చేయువారి మీదను, ఇండియా వర్తకముమీదను బ్రిటిషువారు కొట్టిన దెబ్బలలో మొదటిదెబ్బ ఇది.

ఉత్తర హిందూస్థానములో బ్రిటిషువారు అధికారము చెలాయిస్తూ, ధనము సంపాదిస్తూ ఉండిరి. వారికెటువంటి బాధ్యతలూ లేవు. తూర్పు ఇండియా సంఘమందలి సాహసికులగు వర్తకులు—న్యాయపద్ధతిని జరుపు వర్తకము—అన్యాయపు వర్తకము—శుద్ధ దోపుడు--అనే పదముల భేదము తెలిసికో ప్రయత్నించలేదు. ఇండియాలో సంపాదించిన దోసిళ్లాది డబ్బును మూటగట్టుకొని ఇంగ్లీషువారు ఇండియానుండి ఇంగ్లాండుకు తరలిపోయే రోజులవి. ఇట్టి ఇంగ్లీషువారిని అక్కడివారు "నవాబు" లనేవారు. థేకరే వ్రాసిన "వేనిటీ ఫేర్" అనే గ్రంథాన్ని నీవు చదివి ఉన్నట్లయితే అందులో ఇట్టి ఒళ్ళువాచిన మనిషి ఒక డుండడం నీకు జ్ఞాపకమునకు వస్తుంది.

రాజకీయముగా భద్రతలేకుండుటా, అల్లరులూ, అనావృష్టీ, బ్రిటిషువారి ధనకబళనమూ కారణముగా బెంగాలు, బీహారు దేశములలో 1770 సంవత్సరమున దారుణమైన క్షామము సంభవించింది. ఈ దేశములలోని మూడవవంతు జనులు తిండిలేక మరణించారని చెప్పు తారు. ఎట్టి దారుణ మరణ సంఖ్యో ఊహించు. ఎన్ని లక్షలమంది తిండిలేక తీసుకొని తీసుకొని మరణించారో! విశాల దేశ భాగాలు నిర్జనములయినవి. అడవి పెరిగి పొలములనూ, గ్రామములనూ ఆక్రమించుకొన్నది. మలమల మాడి చనిపోవుచున్న ప్రజలకు సహా

యము చేసేవారెవరూ లేకుండిరి. నవాబుకు శక్తీలేదు, అధికారమూ లేదు, ఆసక్తీలేదు. తూర్పుఇండియా సంఘమునకు శక్తీఉన్నది, అధికారమూ ఉన్నది కాని వారు ఈ బాధ్యత వహించలేదు. వారికి ఆసక్తిలేదు. వారిపని ఎంతసేపూ ధనార్జనమే. పన్నులు వసూలు చేసు కొనుటే. ఈ పని వారెంత సమర్థతతో, తృప్తిగా, వారి జేబులు నిండే టందుకు చేసుకున్నారనుకొన్నావు! చెప్పడానికి ఆశ్చర్యమవుతుంది. ఇంత పెద్ద కాటకము దేశములో విహారము చేస్తూన్నా, మూడవవంతు ప్రజలు నాశనమైనా, వారుమాత్రము బ్రతికిఉన్నవారివద్దనుంచి పూర్తిగా పన్నులు మొత్తము వసూలు చేశారు. నిజానికి వారింకా ఎక్కువపన్నే వసూలు చేశారు. వారు "హింసాపద్ధతు" లవలంబించి ఇట్లు చేసినట్లు వారి ఆఫీసు రికార్డులు చెప్పుచున్నవి. దారుణ కష్టములో కొట్టుకొంటూ ఎట్లో ప్రాణములునిలుపుకొన్న, తిండిలేనిదుఃఖితులనుండి బలవంతముగా హింసాపద్ధతు లవలంబించి వసూళ్ళు చేసిన వారి అమానుషత్వాన్ని పూర్తిగా గ్రహించడం కష్టము.

బెంగాలులోనూ, ఫ్రెంచివారిమీదను ఇంగ్లీషువారు విజయములు సాధించినప్పటికీ దక్షిణమునవారు పెద్ద కష్టములు ఎదుర్కొవలసి వచ్చెను. విజయము సాధించుటకు పూర్వము వారు పరాజయములు, పరాభవములు పొందవలసి వచ్చెను. మైసూరు నేలు హైదరాలీ వారిని దారుణముగా ఎదిరించిన శత్రువు. అతడు సమర్థుడగు ధీకరనాయకుడు. ఇంగ్లీషు సైన్యముల నతడు అనేక సార్లు ఓడించెను. 1769 లో తన కనుకూలముగానుండు సంధి షరతులను మద్రాసువద్దనేఅతడువిధించెను. పది సంవత్సరముల తరువాత అతడు మరల విజయమునుసాధించెను. అతని మరణానంతర మతనికొడుకు టిప్పుసుల్తాను బ్రిటిషువారి పక్కలో బల్లెమాయెను. మరి రెండు మైసూరు యుద్ధములు పోరాడిన తరువాత గాని, అనేక సంవత్సరములయిన తర్వాతగాని చివరకు టిప్పు ఓడిపో లేదు. నేటిమైసూరు మహారాజు పూర్వికుడొకడు, బ్రిటిషువారి రక్షణకింద,

రాజుగా గద్దె ఎక్కింపబడెను.

1782 లో మహారాష్ట్రులుకూడ దక్షిణమున బ్రిటిషువారినోడించిరి. ఉత్తరమున గ్వాలియరులోని సింధియా సర్వాధికారియై దరుదృష్ట వంతుడగు ఢిల్లీ చక్రవర్తిని తన అదుపాజ్ఞలలో ఉంచుకొనెను.

ఈకాలమున ఇంగ్లాండునుండి వారన్ హేస్టింగ్సు పంపబడెను. అతడు మొదటి గవర్నరు జనరలు అయ్యెను. బ్రిటిషు పార్లమెంటు ఇప్పుడు ఇండియా వ్యవహారములలో కలుగజేసికొనజొచ్చెను. ఇండియాలో రాజ్యము చేసిన ఇంగ్లీషు పాలకులందరిలో హేస్టింగ్సు గొప్పవాడని చెప్పడం కద్దు. కాని అతని కాలములోకూడా ప్రభుత్వము దుష్టముగా, అక్రమముగా ఉన్నట్లు సువిదితము. అన్యాయముగా బలాత్కారముగా అతడు పెద్ద మొత్తములు తీసుకొన్న నిదర్శనములు కొన్ని ప్రసిద్ధమైనవి. ఇంగ్లాండుకతడు తిరిగి వెళ్ళినతోడనే పార్లమెంటు అతని ఇండియన్ ప్రభుత్వమునుగూర్చి దోషారోపణచేసి విచారించింది. దీర్ఘ విచారణ జరిగినమీదట అతనిని వదలిపెట్టింది. ఇంతకుముందు క్లైవునుకూడా పార్లమెంటు నిందితుడని చీవాట్లువేసింది. అతడు ఆత్మహత్య చేసుకొన్నాడుకూడా. ఈ విధముగా ఇంగ్లాండు వీరిని విచారించిన్నీ, చీవాట్లు వేసిన్నీ తన అంతరాత్మను జోకొట్టుకుంది. కాని హృదయములోమాత్రము వారిని మెచ్చుకొంది. వారి రాజనీతికి ఫలితముగా వచ్చిన లాభములు అనుభవించ నంగీకరించింది. క్లైవును, హేస్టింగ్సును చీవాట్లు వేయవచ్చును. కాని వారు సామ్రాజ్య నిర్మాతలలో ఆదర్శప్రాయులు. సామ్రాజ్యములు అధీనులగు ప్రజలపై రుద్దవలసి వచ్చినప్పుడూ, వారిని కొట్టి లాభములందవలసివచ్చినప్పుడూ ఇట్టివారు ముందుకు వస్తూనూవుంటారు. తమవారి మెప్పులు పొందుతూనూ ఉంటారు. ప్రజలను కొట్టి లాభములందు పద్ధతులలో మార్పులుండవచ్చును. కాని చేసే మనస్తత్వ మొకటే. బ్రిటీషు పార్లమెంటు క్లైవును

చీవాట్లువేసింది. కాని లండనులో, వైటుహాలులో, ఇండియా ఆఫీసు ెదురుగా అతని ప్రతిమ ప్రతిష్ఠించబడింది. ఆఫీసులోపల అతని మనస్తత్వము నివసిస్తోంది. ఇండియాలోని రాజనీతినది శాసిస్తోంది.

బ్రిటిషువారి చెప్పుచేతలలో నుండే హిందూదేశరాజులనే కీలుబొమ్మల్ని గద్దె ఎక్కించే రాజనీతిని ప్రారంభించినవాడు హేస్టింగ్సు. హిందూదేశ రంగముమీద నిక్కినీల్గిసంచరిస్తూ తమకుతామే రోతగా ఉండి, మెరుగులు పూసుకొన్న శుష్కమస్తిష్కులగు మహారాజులు, నవాబులు అనే మందలను కొంతవరకు సృష్టించినవా డితడే.

ఇండియాలో బ్రిటిషు సామ్రాజ్యము వృద్ధినందుచుండగా మహారాష్ట్రులతోనూ, ఆఫ్ఘనులతోనూ, సిక్కులు, బర్మావారు మున్నగువారితోనూ ఎన్నో యుద్ధములు తటస్థించెను. ఈ యుద్ధములలో విశేషమేమిటంటే—ఇవి ఇంగ్లాండు లాభము కొరకు సాగింపబడ్డప్పటికీ వాటి ఖర్చులు ఇండియా భరించింది. ఇంగ్లాండుమీదకాని, ఇంగ్లీషువారిమీదగాని ఈ భారము పడలేదు. వారు లాభముమాత్రము పొందిరి.

వర్తక సంఘమైన తూర్పుఇండియా సంఘము ఇండియాను పాలిస్తూన్నదన్నమాట జ్ఞాపకముంచుకో. బ్రిటిషు పార్లమెంటు నానాటికీ తన అధికారాన్ని వృద్ధిచేసుకొంటున్నప్పటికీ క్రియకు ఇండియా జాతకము సాహసికులగు వర్తకుల చేతులలో ఉండెను. ప్రభుత్వము చాలావరకు వర్తకము, వర్తకము చాలావరకు దోపుడు. వీటికున్న భేదములు బహు తక్కువ. ఈ కంపెనీ తన వాటాదార్లకు పెద్దపెద్ద లాభములు—సాలుకు నూటికి 100, 150, 200 చొప్పున పంచిపెట్టింది. ఇదికాక ఇండియాలోని దాని ఏజెంట్లు వీలైనంత మట్టుకు డబ్బు గుంజుకునేవారు. క్లైవు అట్లా చేసినట్లు మనముచూశాము. కంపెనీ ఉద్యోగస్తులుకూడా గుత్తలు తీసికొని వర్తకము సాగించి త్వరలో పెద్దపెద్ద ఆస్తులు సంపాదించుకొన్నారు. ఇండియాలో కంపెనీవారి పరిపాలనా క్రమము ఈ విధంగా వెలిగింది.

(63)

# 93
# చీనాలో ఒక గొప్ప మంచూరాజు

సెప్టెంబరు 15, 1932

దుఃఖమువల్ల నా ధైర్యం చలించింది. ఏమిచెయ్యాలో నాకు తెలియడంలేదు. బాపు ప్రాయోపవేశం చెయ్యడానికి నిశ్చయించినట్లు వార్త వచ్చింది; దారుణవార్త. నా చిన్న ప్రపంచంలో చాలా ప్రదేశం ఆయన ఆక్రమించాడు. అది ఇప్పుడు కదిలిపోయి పడిపోడానికి సిద్ధంగా ఉంది. అంతా శూన్యంగా అంధకారమయంగా ఉన్నది. మాటి మాటికీ ఆయన విగ్రహము నా కళ్ళముందు కనిపిస్తోంది—సంవత్సరంపైగా అయింది, ఆయనను నేను చివరసారి చూచి. ఇండియానుంచి పశ్చిమ దేశం పోతూన్న ఓడ తట్టుమీద నిలబడి ఉండగా నేను చూచాను. ఆయనను మళ్ళీ నేనింక చూడనా ? సంశయములో ఉన్నప్పుడు నేనింక ఎవరివద్దకు వెళ్ళేది ? ఎవరు నాకు వివేకయుక్తమగు సలహా ఇచ్చేది ? విచారములో మునిగి ఉన్నప్పుడూ, దుఃఖముతో ఉన్నప్పుడూ నాకు ప్రేమతో అనునయమిచ్చేవారెవరు ? ప్రేమపాత్రుడగు మన నాయకుడు, మనలను ప్రోత్సహించినవాడు, మనలను నడిపించినవాడు పోతే మన మంతా చేసేదేమిటి ? అయ్యో ! ఇండియా ఎంతటి ఘోరదేశము ? తన మహాపురుషులను ఈ విధంగా చనిపోవనిస్తున్నదే ! ఇండియాలోని ప్రజలు బానిసలు. వారి బుద్ధులు బానిసబుద్ధులు. కాబట్టే పనికిమాలిన స్వల్ప విషయాలకోసం కలహిస్తున్నారు; స్వాతంత్ర్యాన్నే మరచి పోతున్నారు.

నాకు వ్రాయాలని బుద్ధి పుట్టడంలేదు. ఈ జాబులు వ్రాయడం మానివేద్దామనికూడా అనుకున్నాను. కాని అట్లా చెయ్యడం తెలివి తక్కువపని. ఈ చెరసాల కొట్టులో చదవడము, వ్రాయడము, ఆలోచించడము తప్పితే నేను చేసేదేమున్నది ? విసుగుగానూ, విచారము

గానూ ఉన్నప్పుడు నిన్ను తలుచుకొని, నీకు వ్రాస్తున్నానని తలుచుకొంటేగదా నాకు మనశ్శాంతి కలిగేది. విచారమూ, కన్నీళ్ళూ ఈ లోకములో మనకు తగిన సహచరులు కాజాలవు. బుద్ధుదేమన్నాడంటే, "సముద్రములో నీళ్ళకంటె ఎక్కువగా కన్నీళ్లు కార్చబడ్డవి." ఈ పాడు లోకమంతమొందేలోగా అంతకన్న ఎక్కువ కన్నీళ్ళు కార్చబడతవి. మనము చేయవలసిన పని ఎంతో ఉంది. మహత్కార్యములు మనల నాహ్వానిస్తున్నాయి. ఆపని పూర్తి అయ్యేవరకూ మనకుగాని, మన సహచరులకుగాని విశ్రాంతి ఉండదు. కాన యథాప్రకారం ఈ జాబులు వ్రాయడానికే నిశ్చయించుకొన్నాను. వెనుకటివలెనే వ్రాస్తూ ఉంటాను.

నా వెనుకటి జాబులు కొన్ని ఇండియాను గురించి వ్రాస్తిని. ఆ కథలో చివరభాగ మంతగా కీర్తివంతముగాలేదు. ఇండియా చేష్టలు తక్కి పడిఉన్నది. ప్రతీ సాహసికుడగు దుర్మార్గుడూ దానిని గ్రసిస్తున్నాడు. ప్రాచ్యమున సోదర దేశమగు చీనా ఇంతకన్న మంచిస్థితిలో ఉన్నది. ఇప్పుడు మనము చీనాకు వెళ్లదము.

మింగుల కాలమున చీనా సౌఖ్యముగా ఉన్నదనిన్నీ, లంచగొండితనమూ, విచ్ఛిత్తీ తరువాత వచ్చిన వనిన్నీ, చీనాకు ఉత్తరపొరుగున నున్న మంచూలు వచ్చి దానిని జయించారనిన్నీ ఇదివరలో (80 జాబు) నీకు వ్రాసియుంటిని, జ్ఞాపకమున్నదా? 1650 నుండి మంచూలు చీనా దేశమందంతటా బాగా స్థిరపడ్డారు. ఈ అర్ధ-విదేశ రాజవంశము కింద చీనా బలముపోసుకున్నది. పొరుగుదేశములమీద పడనుంకిస్తోంది. మంచూలు కొత్త శక్తిని తీసుకువచ్చారు. చీనా అంతరంగ వ్యవహారాలలో వారు బహు కొద్దిగా కలగజేసుకొనేవారు. కాని తమ అదనపు శక్తిని తూర్పు, పడమర, దక్షిణ మార్గముల గౌతమ సామ్రాజ్యాన్ని విస్తీర్ణముచేయుట కుపయోగించారు.

కొత్త రాజ వంశమున సాధారణముగా మొదటిరోజులలో సమ

ర్థులగు పాలకులు తలయెత్తుతారు. రాను రాను చివరకు వచ్చేసరికి వట్టి అసమర్థులు తయారవుతారు. మంచూలలో అసాధారణ ప్రజ్ఞావంతులు, సమర్థులు అయిన పాలకులూ, రాజకార్య ధురంధరులూ తలయెత్తేరు. రెండవ చక్రవర్తి పేరు కాంగ్–హి. సింహాసన మెక్కేసరికి అతని వయస్సు ఎనిమిది సంవత్సరములుమాత్రమే. అరవైయొక్క సంవత్సరముల కాలము అతడు సామ్రాజ్యమునకు చక్రవర్తిగా ఉన్నాడు. ఆ సామ్రాజ్యమో, ప్రపంచమం దేసామ్రాజ్యముకన్నకూడా పెద్దది. జన బాహుళ్యము కలది. అతనికి చరిత్రలో పేరు వచ్చుటకిది కారణము కాదు. యుద్ధవీరుడుగదా అనిన్నీ అతనికి పేరు రాలేదు. అతని రాజనీతి చతురత్వమునుబట్టిన్నీ, అసాధారణ సాహిత్యకృషినిబట్టిన్నీ అతడు ప్రజల హృదయములలో నిలిచాడు. అతడు 1661 నుండి 1722 వరకు చక్రవర్తిగా ఏలెను. అనగా ఏభైనాలుగు సంవత్సరములపాటు అతడు లూయీ XIV–ఫ్రాంసు నేలిన మహాచక్రవర్తి–సమకాలికుడు. ఈ యుభయులున్నూ అతిదీర్ఘకాలము రాజ్యముచేశారు. లూయీ మాత్రము 72 సంవత్సరములకాలముపాటు రాజ్యమేలాడు. ఈ విషయములో చీనా చక్రవర్తిని మించాడు. వీరిద్దరినీ ఒకరితో ఒకరిని పోల్చిచూడడం తమాషాగా ఉంటుంది. కాని ఈ పోలిక లూయీకి ప్రతిష్ఠాకరముగా ఉండదు. లూయీ తన దేశాన్ని పాడుచేశాడు. పెద్ద ఋణములు చేసి దాని నెత్తిన పెట్టాడు. దేశాన్ని శక్తి విరహితము చేశాడు. మత విషయమున అతనికి సహనములేదు. కాంగ్–హి కంఫ్యూసియసు మతానుసారి. ఇతర మతముల నతడు సహనబుద్ధితో చూచేవాడు. అతని రాజ్యములో, ఆమాటకువస్తే మొదటి నలుగురు మంచూరాజుల రాజ్యములోనూ మింగుల సంస్కృతికి ఎట్టి బాధ కలుగలేదు. వెనుకటి ఉన్నత స్థానమందే అది నిలిచి ఉండెను. కొన్ని విషయములలో వృద్ధి నందెనుకూడా. మింగుల కాలములోవలెనే మంచూల కాలములోకూడా పరిశ్రమలు, కళ, సాహిత్యము, విద్య వికాసము చెందియుండెను. అంద

మైన పింగాణీ పని ఇంకా జరుగుచూనే ఉండెను. రంగుల అద్దకము కొత్తగా కనిపెట్టబడినది. రాగిపై చెక్కడపుపని జెస్యూటులనుండి వారు నేర్చుకొనిరి.

మంచూరాజులు చీనా సంస్కృతిని తమ సంస్కృతిగానే భావించి పోషించిరి. వారి రాజనీతి కుశలత ఇందులోనే ఉన్నది. వారు కృత కృత్యులగుటకుకూడా ఇదే కారణము. చీనావారి సంస్కృతినీ, భావములనూ గ్రహించినా తక్కువ నాగరీకులైన మంచూలు తమ చురుకుదనమునూ, శక్తినీ కోల్పోవలేదు. కాంగ్-హి ఇటు తత్త్వసాహిత్యములను శ్రద్ధతో గ్రహిస్తూ, సంస్కృతి వ్యాపారాల్లో పాల్గొంటూ అటు సమర్థముగా యుద్ధ కార్యములు నిర్వహిస్తూ దేశముల జయించకోరుతూ ఉండెను. ఈ రెండు గుణములున్నూ అతనిలో అసాధారణముగా వింతగా కలిసియుండెను. విలాసార్థమతుడు కళాసాహిత్యముల నభ్యసించలేదు. అతడు సాహిత్య కృషికి ప్రమాణముగా, అతని సూచన ప్రకారము, అతనిపై విచారణలో తయారైన యీ క్రింది మూడు గ్రంథములను పేర్కొనవచ్చును. అతని అనురక్తికిని పాండిత్యమునకును అవి నిదర్శనములు.

చీనా భాషలో మాటలు లేవనిన్నీ, అక్షరములు మాత్రమే ఉన్నవనిన్నీ నీకు జ్ఞాపక ముండవచ్చును. కాంగ్-హి చీనా భాషకు ఒక నిఘంటువును తయారు చేయించెను. అది బ్రహ్మాండమైనపని. నిఘంటువులో 40,000 అక్షరములున్నవి. వాటికి విపులమగు వివరణలుకలవు. నేటికిని దానికి సమానమైన గ్రంథము పుట్ట లేదని చెపుతారు.

కాంగ్-హీ ఉత్సాహమునకు ఫలముగా తయారైన వేరొక గ్రంథము సచిత్రమగు విజ్ఞాన సర్వస్వము. అనేకవందల సంపుటములుగా తయారైనదీ మహా గ్రంథము. ఇది సంపూర్ణ పుస్తక భాండాగారమనియే చెప్పవచ్చును. సమస్త విషయములను గురించీ అందు ప్రశంసకలదు. సమస్త శాస్త్ర విషయములూ అందు పేర్కొబడ్డవి.

కాంగ్-హీ మరణానంతరము రాగిరేకులపై లిపి చెక్కి దానిని ముద్రించిరి.

మూడవ ముఖ్యగ్రంథము-చీనా సారస్వతమునందున్న యావత్తు పదములయొక్క అకారాది సూచిక. ఇది ఒక విధమగు నిఘంటువు వంటిది. ఇదికూడ ఉత్కృష్ట గ్రంథమే. ఎందువల్లనంటే ఇది తయారు చేయుటకు సాహిత్యమంతా శ్రద్ధతో చదువవలసి ఉంటుంది. కావ్యముల నుండీ, చరిత్రలనుండీ, వ్యాసములనుంచీ పద్యాదులు పూర్తిగా ఉదహరింపబడినవి.

కాంగ్-హి సాహిత్యకృషి బహు ముఖములుగా ఉండెను. దాని ఉత్కృష్టతను తెలుపుటకు ఈ మూడు గ్రంథములూ చాలును. వీటిలో ఏ ఒక్క దానితోనూ పోల్చుటకు నాకేపుస్తకమూ నేటి కాలమున కనిపించడంలేదు—ఒక్క ఆక్సుఫర్డు ఇంగ్లీషు నిఘంటువు తప్ప. ఇది కూడ మహా గ్రంథమే. అనేకమంది విద్వాంసులు 50 సంవత్సరములు కష్టపడి దీనిని కూర్చారు. కొద్ది సంవత్సరముల క్రితమే ఇది పూర్తి అయినది.

కాంగ్-హి క్రైస్తవమతము, క్రైస్తవ మత ప్రచారకులు అంటే ఇష్టముగానే ఉండెను. విదేశ వ్యాపారము నతడు ప్రోత్సహించెను. అందుకై చీనా రేవు పట్టణములన్నింటినీ, అందరూ వాడుకోవచ్చునని చెప్పెను. కాని యూరోపియనులు సక్రమముగా ప్రవర్తించుటలేదని అతడు వెంటనేకనిపెట్టి, వారిని అదుపులోనుంచెను. మిషనరీలు స్వదేశ సామ్రాజ్యవాదులతో కలిసి దేశమును జయించడానికి కుట్రలు పన్ను తున్నారని అతడు వారిని అనుమానించెను. ఇందుకు తగిన నిదర్శనములుకూడా అతనికి చిక్కినవి. అందువల్ల క్రైస్తవముపై సహనము చూపుట అతడు మానుకొన్నాడు. కాంటన్ వద్దనున్న ఒక చీనాదేశపు యుద్ధోద్యోగి తెలియ జేసిన సమాచారమునుబట్టి అతని అనుమానము దృఢపడెను. ఈ ఉద్యోగి తెలిపినదేమనగా—ఫిలిప్పైను దీవులలోనూ

జపానులలోనూ ఉన్న యూరోపియన్ వర్తకులూ, మిషనరీలూ వారివారి ప్రభుత్వములతో దగ్గిర సంబంధములు పెట్టుకొని ఉన్నారనీ, సామ్రాజ్య క్షేమముకొరకు పరదేశ దండయాత్రలు లేకుండా చేసికొనుటకు, పరదేశ కుట్రలలో పడకుండా ఉండుటకు, పరదేశములతో వర్తకము తగ్గించ వలసిందనిన్నీ, క్రైస్తవ మతప్రచారము అరికట్టవలసిందనిన్నీ ఆ యుద్యోగి తెలుపుకున్నాడు.

ఈ రిపోర్టు 1717లో చక్రవర్తికి పంపబడింది. తూర్పు దేశములలో పాశ్చాత్యులు ఎట్టి కుట్రలు పన్నుచూ ఉండేవారో దీనివల్ల బోధ పడుతోంది. విదేశ వ్యాపారమునూ, క్రైస్తవ మతవ్యాపనమునూ అరికట్టుటకు కారణములుకూడా దీనినిబట్టి వెల్లడిఅవుచున్నవి. జపానులో కూడా ఇట్లే జరిగినదని నీకు జ్ఞాపకముండవచ్చు. దీనికి ఫలితముగా జపాను తన గూడులో దూరి కూర్చున్నది. చైనీయులునూ, ఇతరులునూ వెనుకబడి యున్నారనిన్నీ, అజ్ఞానులనిన్నీ, పరదేశులను ద్వేషిస్తారనిన్నీ, వర్తకమును చేసికోనియ్యరనిన్నీ తరుచు చెప్పడం కద్దు. నిజమునకు ఇండియా చీనాలకును, ఇతర దేశములకును ప్రాచీనకాలము నుంచీ సంపర్కం ఉండేదన్న విషయము చరిత్రను పరామర్శించే మనకు సుస్పష్టమగుచున్నది. అన్య దేశస్థులనుగాని, విదేశ వర్తకమునుగాని ద్వేషించడమనే ప్రసక్తి లేనేలేదు. దీర్ఘకాలము ఇండియా అనేక విదేశ మార్కెట్టులను తన స్వాధీనములో నుంచుకొనెను. పాశ్చాత్య యూరోపియన్ జాతులు తమ సామ్రాజ్య విస్తరణకు వర్తక సంఘములను ఉపయోగించుకోవడం పరిపాటి అగుటవల్లనే తూర్పుదేశములలో వారి మీద అనుమానం కలగవలసివచ్చింది.

కాంటన్ ఉద్యోగి పంపిన రిపోర్టు చీనా సామ్రాజ్య మహాసభలో ఆలోచనకు వచ్చింది. దానినాసభ ఆమోదించింది. వెంటనే చక్రవర్తి కాంగ్-హి చర్య తీసుకొనెను. విదేశ వ్యాపారమును, మిషనరీల మత ప్రచారమును హద్దులో నుండునట్లు ఆజ్ఞ జారీచేసెను.

ఇప్పుడు నేను చీనాను వదలిపెట్టి ఆసియాకు ఉత్తరముననున్న సైబీరియాకు నిన్ను తీసుకుపోయి అక్కడ ఏమి జరుగుచున్నదో చెప్పుతాను. విశాలమైన సైబీరియా దేశము తూర్పున చీనాతోనూ, పడమర రష్యాతోనూ కలిసిఉన్నది. చీనాలోని మంచూ సామ్రాజ్యము విస్తరణాసక్తితో ఉన్నదని నీకు చెప్పాను. మంచూరియా ఈ సామ్రాజ్యములో ఉండెను. మంగోలియావరకునూ, ఇంకను పైగాకూడ అది విస్తరించెను. గోల్డెన్ హోర్డి తెగకు చేరిన మంగోలులను రష్యాకూడా తరిమివేసి ప్రబలమగు కేంద్ర ప్రభుత్వమైనది. అదికూడ సైబీరియన్ మైదానముల గుండ తూర్పుగా వ్యాపించుచుండెను. ఈ రెండు సామ్రాజ్యములునూ సైబీరియాలో ఇప్పుడు కలుసుకొన్నవి.

ఆసియా ఖండమందలి మంగోలులు స్వల్పకాలములో దుర్బలమై క్షీణించుట చరిత్రలోని వింత విషయములలో ఒక్కటి. ఒకనాడు ఆసియా యూరోపులను గజ గజ లాడించినట్టిన్నీ, చెంగిజ్‌ఖాన్ నాయకత్వముక్రిందను, అతని సంతతివారిక్రిందను తెలిసిన ప్రపంచమునంతనూ జయించినట్టిన్నీ ఈ మంగోలులు నామమాత్రా విశిష్టులైరి. తైమూరు కాలములో వారు ఇంచుక తలయెత్తేరు. కాని అతని సామ్రాజ్యము అతనితోనే అంతరించింది. అతని తరువాత తైమూరీదులని పిలువబడు అతని సంతతివారు మధ్య ఆసియాలో రాజ్యము చేసిరి. వారి రాజసభలలో ఒక ప్రసిద్ధమగు చిత్రకళకు సంబంధించిన పద్ధతి వర్ధిల్లెను. ఇండియాకు వచ్చిన బేబరు తైమూరీదు. తైమూరీదులు రాజ్యము చేస్తున్నా మంగోలు జాతిమాత్రము—ఆసియా యందంతటా, రష్యా నుండి దాని మాతృదేశమగు మంగోలియావరకూ వ్యాపించియున్న జాతి—క్షీణించి ప్రాముఖ్యమును కోల్పోయెను. అది ఎందుకు అట్లా జరిగిందో ఎవ్వరూ చెప్పలేరు. శీతోష్ణస్థితిలో కలిగిన మార్పులే ఇందుకు కారణమై యుండవచ్చునని కొందరంటారు. ఇతరులు వేరే విధముగా చెప్పుతారు. ఏమైనా ఇదివరలో దేశములపై దాడి వెడలి విజయములు

సాధించినవారే అన్నివైపులనుండీ దాడులకు గురి అయినారు.

మంగోలు సామ్రాజ్యము విచ్ఛిన్నమైన పిమ్మట ఆసియాగుండా పోయే నాటుదారులు దాదాపు 200 సంవత్సరముల కాలము కట్టుబడ్డాయి. పదహారవ శతాబ్ది రెండవ భాగములో మాత్రము రష్యనులు చీనాకు నాటు మార్గమున రాయబారమంపారు. మింగు చక్రవర్తులతో రాజకీయ సంబంధము ఏర్పరుచుకోవాలని వారు ప్రయత్నించారు. కాని లాభము లేకపోయింది. అచిరకాలముననే యార్మక్ అను పేరుగల బందిపోటు దొంగ కోసక్కులను వెంటవేసికొని యూరల్ పర్వతములు దాటి సిబిర్ అను చిన్న రాజ్యమును జయించెను. ఈ సిబిర్‌నుండియే సైబీరియా అను పదము వచ్చినది.

ఇది 1581 లో జరిగినది. నాటినుండి రష్యనులు తూర్పుగాపోయి పోయి దాదాపు 50 సంవత్సరములలో పసిఫిక్కు మహాసముద్రమును చేరిరి. వెంటనే వారికి చీనా వారితో అమూర్ లోయలో పేచీ తటస్థించింది. వా రుభయులూ పోరాడుకొన్నారు. చివరకు చీనావారు గెలిచారు. 1689 లో ఈ రెండు దేశములకునూ సంధి జరిగినది. దీనిని నెర్చిన్స్కు సంధి అందురు. పొలిమేరలు నిర్ణయించి వర్తకపు ఒడంబడికలు చేసికొనిరి. చీనావారు యూరోపియన్ దేశముతో చేసికొన్న మొదటి సంధి ఇదియే. ఈ సంధి కారణముగా రష్యనులు ముందుకు పోవుట ఆగినది. కాని బిడారు వర్తక మమితముగా వృద్ధియైనది. ఆ సమయమున రష్యన్ జారు ఘనుడగు పీటరు. చీనాతో దగ్గిరసంబంధములు పెట్టుకొనుటకాతడు ఆత్రుతతోనుండెను. కాంగ్-హి కొలువున కాతడు రెండుమార్లు రాయబారమంపెను. చీనావారి కొలువుకూటములో శాశ్వతముగా ఒక రాయబారిని నిలిపెను.

ప్రాచీన కాలమునుండియు చీనాదేశమున విదేశ రాయబారులను ఆహ్వానించు ఆచారము కద్దు. రోమన్ చక్రవర్తి, మార్కస్ అరీలియస్ అంటోనియస్ అనువాడు, క్రీస్తు వెనుక రెండవ శతాబ్దిలో చీనాకు

రాయబారమంపినట్లు నీకొక జాబులో వ్రాసిఉంటాను. 1656 లో డచ్చి రాయబారులూ, రష్యన్ రాయబారులూ చీనా కొలువుకూటముకు వెళ్లి నట్లూ, అక్కడ "గొప్ప మొగలు" వద్దనుంచి వచ్చిన రాయబారులున్నట్లూ తెలియవచ్చుచున్నది. ఇది ఆశ్చర్యకరమైన విషయముకాదూ ? ఈ రాయ బారులను షాజహాను పంపిఉంటాడు.

# 94
# ఒక చీనాదేశ చక్రవర్తి ఒక ఇంగ్లీషు రాజుకు జాబు వ్రాయుట

సెప్టెంబరు 16, 1932

మంచూ చక్రవర్తులు దీర్ఘాయువులని తోస్తుంది. కాంగ్-హి మనుమడు, చీయన్—లంగ్ అను వాడు నాల్గవ చక్రవర్తి. అతడు కూడ 60 సంవత్సరములు 1736 నంచి 1796 వరకూ రాజ్యమేలెను. ఇతర విషయములలోకూడా అతడు తాతను పోలిఉండెను. జాగ్రత్త చేయదగిన కావ్యములన్నింటినీ అతడు వెదికించెను. విపులముగా వాటి పేళ్ళను, ఇతర వివరములనూ జాబితాలుగా వ్రాయించెను. వాటిని వట్టి పుస్తకజాబితాలంటేచాలదు. ప్రతి గ్రంథమునకు సంబంధించినవిషయము లన్నీ అందుండెను. దానినిగురించి విమర్శా వాక్యములుకూడ వ్రాయ బడెను. సామ్రాజ్య భాండాగారమునకు సంబంధించిన ఈ గ్రంథ సంచయ పట్టిక ఉద్గ్రంథము. అది నాలుగు విభాగములుగానుండెను. ప్రాచీన కావ్యములు అనగా కంఫ్యూసియస్ తత్వమునకు సంబంధించినవి; చరిత్ర; తత్త్వశాస్త్రము; సారస్వతము (భాషాకావ్యములు). అట్టిగ్రంథ మును పోలినదేదీ ప్రపంచమున లేదని చెప్పుతారు.

సుమారు ఈ కాలమునందే చైనీయుల నవలలు, చిన్న కథలు, నాటకములు అభివృద్ధిచెంది ఉత్తమశ్రేణి కెక్కినవి. ఈ కాలమునందే

ఇంగ్లాండులో నవల వృద్ధి చెందుతోంది. చీనా పింగాణీకీ, ఇంకా కళలుట్టి పడు ఇతర వస్తువులకీ యూరోపులో ఎక్కువ గిరాకీ ఉండెను. ఆ వస్తువులకొరకు వర్తకము సదా సాగుచుండెను. ఇంతకన్న ముచ్చటైన విషయము తేయాకు వర్తక ప్రారంభము. ఇది మొదటి మంచూ చక్రవర్తి కాలములో ప్రారంభమాయెను. చార్లసు II రాజ్యకాలములో బహుశా ఇంగ్లాండుకు టీ వచ్చి ఉంటుంది. సామ్యూల్ పెపిస్ అనువాడు తన దినచర్య గ్రంథములో 1660 లో మొదటిసారి చీనావారి పానీయమైన టీ త్రాగినట్లు వ్రాసుకొన్నాడు. ఇంగ్లీషులో దినచర్య వ్రాసి ప్రసిద్ధికెక్కినవాడీ పెపిస్. టీ వర్తకము బ్రహ్మాండముగా వృద్ధి అయ్యెను. 200 సంవత్సరముల అనంతరము 1860 లో ఫూచో అను ఒక్క చీనా రేవు పట్టణమునుంచి ఒక కాలములో ఎగుమతి అయిన టీ 10 కోట్ల పౌనులు. కొంతకాలమైన పిమ్మట ఇతరప్రదేశములలోకూడా తేయాకు పెంచ మొదలుపెట్టారు. నేడు ఇండియాలోనూ, సింహళములోనూ విరివిగా తేయాకు పండిస్తున్నారు.

చీయన్-లంగ్ మధ్య ఆసియాలోని తురుష్క స్థానమును, టిబెట్టును జయించి తన సామ్రాజ్యములు వృద్ధిచేసెను. కొన్ని సంవత్సరములైన పిమ్మట 1790 లో నేపాలు దేశమునుండి ఘూర్కాలు టిబెట్టుపై దండయాత్రచేసిరి. అందుపై చీయన్-లంగ్ టిబెట్టునుంచి ఘూర్కాలను తరమగొట్టడమే కాకుండా హిమాలయములమీదుగా నేపాలులోనికి వారి వెంటబడి, కొట్టి, ఓడించి చీనా సామ్రాజ్యములో సామంతరాజ్యముగా నేపాలు ఉండేటట్లుగా బలవంతముచేసెను. నేపాలుపై సాధించిన ఈ విజయము అసాధారణమైనది. ఒక చైనాసేన టిబెట్టుదాటి, తరువాత హిమాలయములు దాటి ఘూర్కాలవంటి శూర జాతిని వారి స్వదేశములోనే ఓడించడం చాలా ఆశ్చర్యకరమైనసంగతి. అది అట్లా జరుగగా, ఇండియాలోని బ్రిటిషు వారికి 22 సంవత్సరముల అనంతరము 1814 లో నేపాలుతో పేచీ వచ్చింది. వారు నేపాలు

దేశముమీదకి ఒక సైన్యమునుపంపారు. హిమాలయములు దాటవలసిన అవసరము లేకున్నా ఇది చాలా చిక్కులు పడవలసివచ్చింది.

చీయన్‌లంగు రాజ్యానంతరము, 1796 లో, అతడు ప్రత్యక్షముగా రాజ్యము చేసే సామ్రాజ్యములో మంచూరియా, మంగోలియా, టిబెట్టు, తురుష్క స్థానములు చేరిఉండెను. అతని సార్వభౌమత్వమును అంగీ కరించిన సామంతరాజ్యములు కొరియా, అన్నాం, సయాం, బర్మాలు. యుద్ధములో కీర్తి, విజయమూ అమితముగా ధనము వెచ్చించితేనే తప్ప రావు. ధనవ్యయము అధికమైతే పన్నులూ పెరుగుతాయి. పన్నుల భారము మొయ్యవలసిన వాళ్ళు బీదవాళ్లు. ఆర్థిక పరిస్థితులుకూడా మారు తూండడంవల్ల అసంతృప్తి ప్రజలలో ప్రబలింది. దేశమందంతటా రహస్య సంఘాలు తలయెత్తాయి. ఇటలీవలెనే చీనాయున్నూ రహస్య సంఘాలకి చాలా ప్రసిద్ధిగన్నది. వీటి పేర్లు తమాషాగా ఉన్నాయి: తెల్లకలువ సంఘము, దైవన్యాయ సంఘము, శుక్లతూలికా సంఘము, ఇహపరలోక సంఘము.

ఈ కాలమున ఎన్ని ఆటంకములు పెట్టినా విదేశవర్తకము వృద్ధి నొందుతూనే ఉండెను. పెట్టిన ఆటంకములు విదేశ వర్తకులకు చాలా అసంతృప్తిని కలిగించెను. తూర్పు ఇండియాసంఘము కాంటన్ వరకూ వ్యాపించెను. దాని వ్యాపారమున్నూ ఇతరుల వ్యాపారముకన్న అధిక ముగా ఉండెను. ఈ ఆటంకములు దానికి చాలా కష్టముగా నుండెను. పారిశ్రామిక విప్లవము ప్రారంభ మౌతూన్న రోజులవి. ఈ విప్లవము నందు ఇంగ్లాండు ముందంజ వేయుచుండెను. ఆవిరి ఇంజను కనిపెట్ట బడింది. కొత్తపద్ధతులు ప్రవేశపెట్టుటవల్లా, యంత్రములు వాడుటవల్లా పని సులభముగా జరుగుచున్నది. ఉత్పత్తి అధికమౌతున్నది. ముఖ్య ముగా నూలు సరకులు వృద్ధి అగుచున్నవి. అదనముగా తయారైన సరకులు ఇతరులకు అమ్మవలెను గాన కొత్త మార్కెట్టులు వెదుకుకో వలసి వచ్చింది. సరిగా ఈ కాలమునందే ఇంగ్లాండు అదృష్టమువల్ల

ఇండియా దానికి స్వాధీనమైనది. దాని చెప్పుచేతలలో ఉన్నది. తన సరకు ఇండియాలో బలవంతముగా అమ్మే ఏర్పాట్లు చెయ్యగలస్థితిలో ఉన్నది ఇంగ్లాండు. చేసిందికూడా.

1792 లో బ్రిటిషు ప్రభుత్వము, లార్డుమెకార్ట్నే నాయకత్వమున పీకింగుకు ఒక రాయబారమంపెను. జార్జి III అప్పుడు ఇంగ్లాండురాజు. చీయన్‌లంగు వారిని ప్రత్యుత్థానము చేసెను. కానుకలు ఒకరికొకరు ఇచ్చుకున్నారు. కాని చీనా చక్రవర్తి విదేశ వర్తకమునకు సంబంధించిన పాత నియమాలు ఎంతమాత్రమూ మార్చనని నిరాకరించాడు. చీయన్‌లంగ్ జార్జి III కు వ్రాసిన సమాధానము చాలా ముచ్చటగా ఉన్నది. అందుండి కొన్ని వాక్యాలు ఉదహరిస్తున్నాను.

> "....ఓరాజా, నీవు అనేక సముద్రముల కావల నివసిస్తున్నావు. మా నాగరికతనుండి లాభములు పొందవలెననే ఉద్దేశముతో నీవు వినమ్రతతో రాయబారులను పంపావు. గౌరవపురస్సరంగా వారిద్వారా అర్జీ పంపుకొన్నావు. నీ భక్తికి చిహ్నముగా మీ దేశపు సరుకులను కానుకగాకూడా పంపావు. నీ అర్జీ నేను చదువుకొన్నాను. మనఃపూర్వకముగా నీవు వ్రాసిన విషయములనుబట్టి మా యెడల నీవు చూపు వినమ్రతా, గౌరవమూ స్పష్టమైనవి. అందుకు నేను చాలా మెచ్చుకొన్నాను....
>
> "ప్రపంచాధిపత్యము నెరుపుతూన్న మాకు ఉన్నది ఒకటే లక్ష్యము. అదిఏమంటే నిష్కళంకమగు పరిపాలనమున్నూ, రాజ్యాంగ ధర్మములు నిర్వహించడమున్నూ. వింతయైనట్టివన్నీ, విలువగలట్టివన్నీ వస్తువులతో మాకు పనిలేదు....మీ దేశములో తయారయే వస్తువులతో మాకు ప్రయోజనంలేదు. ఓరాజా, మా ఇష్టమును మన్నించి, ఇంతకన్న ఎక్కువభక్తినీ, విశ్వాసమునూ మాయెడల చూపడం మీకు లాభకరం. మా సింహాసనమునకు మీరు నిరంతరమూ లొంగి ఉన్నట్లయితే మీదేశమునకు ఇక

ముందు శాంతి, సౌఖ్యములు చేకూర్చుకోగలరు....

....భయభక్తులతో చెప్పినట్లు చేయండి. పరాకువద్దు :"

జార్జి III రాజున్నూ, అతని మంత్రులున్నూ ఈ జవాబు చదువుకొని నిర్ఘాంతపోయి ఉంటారు ! ఉత్కృష్టమగు తమ నాగరికముపైగల విశ్వాసమున్నూ, రాజప్రతాపమున్నూ ఈ జవాబు వెల్లడిచేస్తున్నా నిజమునకు దీనికి ఆధారము లేదు. మంచూ ప్రభుత్వము బలముగా నున్నట్లు కనిపిస్తోంది. చీయంగ్ లంగు ప్రభుత్వమున బలముగానే ఉండెను. కాని మారిపోతూన్న ఆర్థిక పరిస్థితులు కారణముగా దాని పునాదులు దుర్బలమౌతూన్నవి. నేను చెప్పిన రహస్య సంఘములు అసంతృప్తికి చిహ్నములు. అసలు ప్రమాదమెక్కడ ఉన్నదంటే—కొత్త ఆర్థిక పరిస్థితులకనుగుణముగా దేశము సర్దుకోవడంలేదు. ఈ కాలమున పాశ్చాత్య దేశములీ నూతన విధానమునకు నాయకత్వము వహించియుండెను. త్వరితగతిని అవి ముందుకు తోసుకొనిపోయి నానాటికీ ప్రబలమగుచుండెను. చక్రవర్తియైన చీయన్ లంగు ఇంగ్లాండు రాజు జార్జి III కి తన ఘనతను సూచించు ఉత్తరము వ్రాసి 70 సంవత్సరములు కాకముందే ఇంగ్లాండు, ఫ్రాంసులచే చీనా పరాభవింపబడెను. చీనా గర్వము మట్టిపాలు చేయబడెను.

చీనానుగురించి వ్రాసే వేరొకజాబులో ఆ విషయమెత్తుకుంటాను. 1796 లో చీయన్ లంగు మరణించెను. ఇప్పటికి మనము 18 వ శతాబ్ది చివరకు వచ్చితిమి. ఈ శతాబ్ది ముగియుటకుపూర్వము అమెరికాలోనూ, యూరోపులోనూ అసాధారణ విషయములు అనేకముజరిగెను. యూరోపులో జరుగుచున్న యుద్ధములు, అల్లరులు కారణముగా 25 సంవత్సరములపాటు పాశ్చాత్యులు చీనాను ఒత్తిడి చెయ్యకుండా ఊరుకొన్నారు. కాన మనము తరువాతి జాబులో యూరోపును దర్శించి అక్కడి గాథ 18 శతాబ్ది ఆదినుంచీ ఎత్తుకుందాము. ఇండియా, చీనాలలో జరుగుచున్న విషయములతో సమన్వయిద్దాము.

ఈ జాబును ముగించడానికి ముందు తూర్పున రష్యా చెందు చున్న అభివృద్ధినిగురించి చెప్పుతాను. 1689 లో జరిగిన నెర్చిన్స్కు సంధి అనంతరము తూర్పున రష్యా పలుకుబడి 150 సంవత్సరముల పాటు వృద్ధి చెందుతూ పోయెను. 1728 లో రష్యావారి కొలువులో ఉన్న డానిష్ కప్తాను వైటస్ బేరింగు అనువాడు ఆసియా, అమెరికాలకు మధ్యనున్న జలసంధిని పరిశోధించెను. ఈ జలసంధికి అతని పేరే—బేరింగు జలసంధి—వచ్చిందని నీకు తెలిసి ఉంటుంది. బేరింగు అలాస్కాకు జలసంధి దాటివెళ్ళి, అది రష్యన్ భూమి అని ప్రకటించాడు. అలాస్కాలో ఫర్లుబాగా దొరుకుతవి. చీనాలోఫర్లకు గిరాకీ హెచ్చుగా నుండెను. అందువల్ల రష్యా, చీనాలమధ్య ఫర్ వర్తకము వృద్ధి నందెను. 18 వ శతాబ్దాంతమున ఫర్లకు చీనాలో ఎంతో గిరాకీ ఉండుటచే కెనడాలోని హడ్సన్‌బేనుండి ఇంగ్లాండుమీదుగా రష్యాఫర్లను దిగుమతిచేసి, పిమ్మట సైబీరియాలోని బైకాల్ సరస్సు సమీపమున ఉన్న కయాఖ్టా పట్టణమందలి ఫర్‌మార్కెట్టుకు పంపేది. ఈ ఫర్లు ఎంత బ్రహ్మాండమైన ప్రయాణములు చేశేవో ?

ఈ జాబు ఇదివరలో వ్రాసిన జాబులు చాలా వాటికంటె చిన్నదిగా ఉన్నది. ఈ మార్పు నీకు సమ్మతమేననుకుంటాను.

## 95

# 18 శతాబ్దిలో యూరోపున భావయుద్ధము

సెప్టెంబరు 19, 1932

మనమిప్పుడు యూరోపుకు వెళ్ళి మార్పు చెందుచున్న దాని చరిత్రను అనుసరిద్దాము. గొప్పగొప్పమార్పులు యూరోపులోరానున్నవి. ప్రపంచ చరిత్రలో అవి అంకితము కానున్నవి. ఈ మార్పులను అవ గాహన చేసికోడానికి, ఉపరి భాగమును వదలి లోనికిపోయి పరీక్షించ

వలెను. మనుష్యుల హృదయములో ఎట్టిభావములు రూపము పొందు చున్నవో కనుగొన ప్రయత్నించవలెను. ఊహలు, కామక్రోధాది భావములు, రాగద్వేషములు, మూఢ విశ్వాసములు, ఆశలు, భయములు—ఈ మిశ్రమభావముల ఫలమే కార్యము. ఒకడు చేసేకార్యము, దానిని ప్రోత్సహించిన కారణములతో జోడించి విచారిస్తేనేతప్ప మనకు అర్థముకాదు. కాని ఇది సులభమైన విషయముకాదు. చరిత్రలో జరిగిన ప్రధాన సంభవములను తెచ్చిపెట్టిన ఈ కారణములనూ, ఉద్దేశములనూ గురించి నేను సంబంధముగా వ్రాయజాలినప్పటికిన్నీ ఈఉత్తరములను ఇంకా చప్పగా, ఇంకా బరువుగా ఉండేటట్లు చెయ్యడం నాకు ఇష్టంలేదు. ఒక్కొక్కప్పుడు అనుకుంటూ ఉంటాను—నాకు ఇష్టమైన విషయాన్ని గురించీ, నాకు ఇష్టమైన దృక్పథాన్నిగురించీ ఉత్సాహముచెంది నేను వ్రాసేటప్పుడు నేను పోగూడనంత లోతుకుపోయి, నేను మునిగి, నిన్ను ముంచుతున్నానని. ఏమిచేయను? నీవు భరించాలి. కాన ఈ కారణము లెట్టివో తెలిసికోడానికి అంత లోతుగా వెళ్ళవద్దు. కాని వాటిని ఉపేక్షించడమున్నూ చాలా తెలివితక్కువ. అట్లా మనము చేసినట్లయితే చరిత్రయొక్క ఆకర్షణా, ప్రాముఖ్యమూ మరుగుపడతాయి.

పదహారవ శతాబ్దిలోనూ, పదిహేడవ శతాబ్ది మొదటిభాగములోనూ యూరోపులో జరిగిన అల్లరులను గురించీ, లేచిన సాంఘికాది పరిణామములను గురించీ మనము పర్యాలోచించితిమి. 17వ శతాబ్ది మధ్యలో (1648) వెస్టు ఫాలియాసంధి జరిగెను. దానితో భయంకరమైన ముప్పై సంవత్సరముల యుద్ధము ముగిసింది. మరుసటి సంవత్సరములో ఇంగ్లాడులోని అతఃకలహము ముగిసింది. ఛార్లసు I కి శిరశ్ఛేదమైనది. పిమ్మట కొంతకాలముపాటు శాంతివచ్చింది. యూరోపు ఖండము పూర్తిగా అలసిపోయింది. అమెరికా అధినివేశములతోనూ, ఇతర దేశములతోనూ చేసిన వాణిజ్యమునకు ఫలముగా యూరోపుకు ధనము చేకూరింది. దీనివల్ల కొంత ఉపశమనము కలిగింది. వివిధ

ప్రజాతరగతుల మధ్యనుండే వైషమ్యాలు తగ్గినవి.

ఇంగ్లాండులో శాంత విప్లవము వచ్చినది. జేమ్సు II ను పంపించివేశారు. పార్లమెంటుకు 1688 లో విజయము చేకూరింది. ఛార్లసు I పై లేవనెత్తిన అంతఃకలహములోనే పార్లమెంటుకు విజయము వచ్చింది. 40 సంవత్సరములకు పూర్వము యుద్ధము చేసి పొందిన నిర్ణయ ఫలమునే శాంత విప్లవము ఖాయముచేసింది.

తత్ఫలముగా ఇంగ్లాండులోరాజు మరుగుపడ్డాడు. కాని యూరోపు ఖండములో, స్విట్జర్లాండు, హాలెండు మున్నగు చిన్న ప్రదేశములలో తప్ప, పరిస్థితులు వేరుగా ఉన్నవి. బాధ్యతలేని నిరంకుశ ప్రభువులు ఇంకను దేశపాలనము చేయుచుండిరి. మహాచక్రవర్తి యనబడు లూయీ XIV ఆదర్శ ప్రాయుడుగా, మార్గదర్శిగా ఉండెను. ఇతరులతనిని అనుసరించు చుండిరి. యూరోపు ఖండములో పదిహేడవ శతాబ్దము లూయీ XIV చక్రవర్తిగారి శతాబ్దమైనది. తమకురానున్న దుర్దశను పాటించక, ఇంగ్లాండురాజు ఛార్లసు I కి తటస్థించిన పాటును బట్టియైన నేర్చుకొనక ఈ యూరోపు రాజులు వైభవముతో, మూర్ఖతతో నిరంకుశ పరిపాలనము సాగిస్తూపోయారు. దేశములోని సర్వాధికారాలు తమవే అన్నారు; ధనమంతా తమదేనన్నారు. వారి దేశము వారి సొంత ఆస్తివలె ఉండెను. 400 సంవత్సరముల క్రితము ఒక ప్రసిద్ధ డచ్చి విద్వాంసుడు. ఇరాస్మస్ అనువాడు ఇట్లు వ్రాసెను—

> "పక్షులన్నింటిలోనూ, బుద్ధిమంతుల దృష్టిలో రాజత్వానికి మాదిరిగా ఉండదగ్గది రాబందేఅని తోస్తుంది. దానికి అందమూ లేదు, కలస్వనమూ లేదు, ఆహారమునకా పనికిరాదు; అది మాంసాహారి, అత్యాశగలది, అందరూ అసహ్యించుకొనేది, అందరికీ బాధకలిగించేది, అపకారము చేయగల శక్తి అధికముగా గలది. శక్తికిమించి అపకారము చేద్దామనే ఆసక్తికలది."

నేడు చాలావరకు రాజులంతరించారు. ఉన్నవారేమో గత

కాలాన్ని తలపించు శిథిలాలు. వారికి అధికారము సున్న. వారిని మన మిప్పుడు ఉపేక్షించవచ్చు. కాని అంతకన్న దుర్మార్గులు ఇతరులు వారి స్థానే వచ్చిరి. పిదప కాలమునాటి ఈ సామ్రాజ్య వాదులకూ, ఇనుము రాజులకూ, నూనె రాజులకూ, వెండి రాజులకూ, బంగారు రాజులకూ ఇంకా రాబందే ఉచితమగు లాంఛనమైనది.

యూరోపులోని ఏకాధిపత్యములు ప్రబలమైన కేంద్ర రాజ్యములను అభివృద్ధిలోనికి తెచ్చెను. ప్రభువులు, పాలెగాండ్లు అను పాతకాలపు ఫ్యూడల్ భావనలు అంతరించినవో, అంతరించు చున్నవో. దేశము ఒకే ఒక వ్యక్తి అనే నూతన భావన దాని స్థానే వచ్చెను. రీష్ల్యూ, మజిరేన్ అనే సమర్థులగు ఇద్దరు మంత్రుల కాలమున ఫ్రాంసు ఈ భావన ప్రవేశపెట్టెను. ఇట్లు జాతీయతా, కొంతవరకు దేశభక్తీ పెరిగినవి. ప్రజల జీవితములలో ప్రధాన స్థానమింతవరకూ ఆక్రమించిన మతము వెనుకకు తగ్గింది. కొత్తభావనలు దాని స్థానే వచ్చినవి. ఈ జాబులోనే తరువాత ఈ విషయమునుగురించి చెప్పుతాను.

17 వ శతాబ్దిలో నేటి విజ్ఞాన శాస్త్రమునకు పునాదులు పడడం వల్లా, ప్రపంచ వ్యాపారరంగము (World market) సృష్టింపబడుట వల్లా దానికి ఘనత వచ్చింది. బ్రహ్మాండమైన ఈ మార్కెట్టు (వ్యాపార రంగము) యూరోపు ఆర్థిక పరిస్థితులను తలక్రిందు చేసెను. తరువాతి కాలములో యూరపులోనూ, ఆసియాలోనూ, అమెరికాలోనూ జరిగిన అనేక విషయములు మనకు అర్థము కావాలంటే ఈ కొత్త వ్యాపార రంగాన్ని మనము మనస్సులో పెట్టుకోవాలి. కొంత కాలమునకు విజ్ఞాన శాస్త్ర మభి వృద్ధిచెంది, ఈ ప్రపంచ వ్యాపార రంగమునకు కావలసిన అవసరములను సరఫరా చేయుటకు తగిన సాధనలను చేకూర్చెను.

18వ శతాబ్దిలో అధినివేశములూ, సామ్రాజ్యమూలూ సంపాదించుటకు ఇంగ్లాండు, ఫ్రాంసులు పోటీ పడినవి. దీనికి ఫలితముగా యూరోపులోనేగాకుండా కెనడాలోనూ, ఇండియాలోనూ యుద్ధము వారికి

తటస్థించింది. శతాబ్ది మధ్యలో ఈ యుద్ధములైన పిమ్మట కొంతకాలము పాటు దేశము శాంతముగా ఉండెను. పైకి చూచుటకు యూరోపు శాంతముగా కలతలు లేకుండా ఉండెను. మర్యాదస్థులూ, సంస్కారులూ అయిన స్త్రీ పురుషులతో యూరోపులోని రాజ సభలన్నీ నిండి ఉండెను. కాని ఈ శాంతము బాహ్యమందే ఉన్నది. లోనికి దిగిచూస్తే కనిపించేది సంక్షోభము. నూతనాభిప్రాయములతోనూ, నూతన భావములతోనూ ప్రజల మనస్సులు కలతచెందుచున్నవి; తొట్రుపాటు పడుచున్నవి, రాజ సభలోని అదృష్టవంతులనూ, పైతరగతులలోని భాగ్యవంతులనూ మినహాయిస్తే మిగిలిన జనసామాన్య మంతా పెరిగిపోతూన్న బీదరికము కారణముగా అనేక కష్టములకు పాలుకావలసి వస్తోంది. 18 వ శతాబ్ది రెండవభాగములో యూరపులో కానవచ్చు శాంతము నిజమైన శాంతము కాదు. రానున్న తుపానుకది నాంది. 1789 జూలై 14 వ తేదీన ఈ తుపాను అందుకొంది. యూరోపులో ఏకాధిపత్యము లన్నింటిలో మేటి అనదగిన దేశముయొక్క రాజధానిలో, పారిస్‌లో, ఈ తుపాను అందు కొంది. ఈ ఏకాధిపత్యమునది తుడిచిపెట్టుకుపోయింది. పాతకాలము నాటి బూజు పట్టిన ఆచారములనూ, హక్కులనూకూడా అది తుడిచి పెట్టుకు పోయింది.

నూతనాభిప్రాయములు కారణముగా ఈ తుపానున్నూ, దీని తరువాత వచ్చిన మార్పున్నూ ఫ్రాంసులోనూ, కొంతవరకు ఇతర యూరోపియన్ దేశములలోనూ చాలాకాలంబట్టి తయారవుతూ ఉన్నవి. మధ్య యుగముల కాలమందంతా, యూరోపులో ప్రధాన స్థాన మాక్రమించినది మతమే. తరువాతకూడా, సంస్కరణ కాలమున (Reformation) కూడా ఇది ఈవిధముగానే ఉండెను. రాజకీయ, ఆర్థిక విషయాలన్నీ మత దృష్టితోనే విచారించేవారు. మతమనగా పోపు యొక్కయు, లేదా చర్చికి సంబంధించిన ఉన్నతోద్యోగులయొక్కయు అభిప్రాయములన్నమాట. మతము కట్టుదిట్టములతో ఉండెను. అచ్చటి

సంఘ వ్యవస్థ ఇండియాలోని వర్ణవ్యవస్థవలె ఉండెను. తొలుతటి రోజులలో వర్ణవిభాగము వృత్తులనుబట్టి వచ్చినదే. మనుష్యులుచేయు వ్యాపారములనుబట్టి సంఘములోని తరగతులు వచ్చునన్న భావనయే మధ్య యుగములలో సంఘమును గురించి పెట్టుకొన్న అభిప్రాయము లకు మూలాధారము. ఇండియాలో ఒక వర్ణము వారిలో సమానత్వ మున్నట్లే ఒక తరగతి వారిలో అచ్చట సమానత్వముండెను. కాని రెండు తరగతులలోగాని, అంతకు హెచ్చుగానున్న తరగతులలోగాని ఇట్టి సమానత్వము లేదు. సంఘముయొక్క పునాదులలోనే ఈ విభేధము కానవచ్చుచుండెను. ఇది యిట్లుండరాదని చెప్పినవాడెవడున్నూ లేడు. ఈ పద్ధతివల్ల బాధపడేవారితో చెప్పేమాట "స్వర్గములో మీకు ప్రతిఫలము ముట్టుతుంది" అని. ఈ విధముగా న్యాయముకాని సాంఘిక విభాగమును మతము సమర్థించేది. ప్రజల మనస్సులను దీనిమీద నిలవకుండా ఉండగలందులకు పరలోకము మీదకు తిప్పేది. ఇంతేకాదు "ధర్మ కర్త సిద్ధాంతము" అనే దాన్నికూడా ప్రచారములోపెట్టింది—దీని ప్రకారము భాగ్యవంతులు, బీదవారికి ధర్మ కర్తలు. భూస్వామి కౌలుదారునికి ధర్మ కర్తయై భూములను తన స్వాధీనములో నుంచుకొనును. సమర్థించరాని విషయము నీరీతిగా చర్చి సమర్థించు చుండెను. ఈ సిద్ధాంతమువల్ల భాగ్యవంతుడి కిబ్బంది ఏమీలేదు. బీదవాళ్ళకు లాభమూ లేదు. ఇట్టి తెలివితేటలతో కూడిన సమర్థనలు ఆకలిగొన్న బీదవారికి అన్నపు కరుళ్లు కాజాలవు.

కాతలిక్కులకునూ, ప్రాటస్టెంటులకునూ జరిగిన మతయుద్ధములకూ, కాతలిక్కుల యొక్కయూ, కాల్వినిస్టులయొక్కయూ అసహనమునకూ, ఇంక్విసిషనుకూ ఇట్టి మత సాంఘిక దృక్పధమే కారణము. విన్నావా? యూరోపులో వేలకొద్ది స్త్రీలు మంత్రకత్తెలని, ముఖ్యముగా ప్యూరిటనులవలన, తగులబెట్టబడిరి. చర్చి అభిప్రాయములకు వ్యతిరేకముగా నున్నవన్న కారణమున విజ్ఞాన శాస్త్రమునకు సంబంధించిన

నూతనాభిప్రాయములు అణచివేయబడినవి. ఇట్టి దృక్పథము మానవ జీవితమును ముందుకు పోకుండా చేసింది. అభివృద్ధిమాట అసలే లేదు.

పదహారవ శతాబ్దినుంచి ఈ అభిప్రాయాలు మార్పు చెంద దొడగాయి. విజ్ఞానశాస్త్రము తలయెత్తింది. సర్వతోముఖమైన మతము పట్టు సడలింది. రాజకీయ, ఆర్థిక వ్యవహారములకు మతముతో సంబంధము లేదనే భావనపుట్టింది. 17, 18 శతాబ్దులలో హేతువాదము వృద్ధి చూపిందని చెప్పుతారు. అనగా మూఢ విశ్వాసమునకు వ్యతిరేకముగా హేతువు తల యెత్తి ప్రబలింది. 18 వ శతాబ్దిలోనే మత సహనము విజయము సాధించిందని చెప్పుతారు. ఇది కొంతవరకు యదార్థమే. ఈ విజయమున కర్థమేమిటంటే ప్రజలు తమ మతముపట్ల పూర్వము చూపిన అభిమానాన్ని అప్పుడు చూపడం మానుకొన్నారన్నమాట. మత సహనము ఉపేక్షకు బహు దగ్గరగా ఉండెను. ఒకవిషయమును గురించి ఎవరైనా పట్టుదలగా ఉంటే దాని విషయములో సహనము చూపరు. కాని పట్టుదల లేనిపట్ల తమకెంతో సహనబుద్ధి ఉన్నదని చెప్పుకొంటారు. పారిశ్రామిక పరివర్తనమున్నూ (Industrialism) యంత్రమున్నూ రావడంతోనే మతము పట్ల నిర్లక్ష్య భావమ్ము అతిశయించింది. యూరోపులో ప్రాచీన మత విశ్వాసములయొక్క పునాదులు విజ్ఞాన శాస్త్రము లాగివేసింది. నూతన పరిశ్రమలు, నూతన ఆర్థిక వ్యవహారములూ, నూతన సమస్యలను తెచ్చిపెట్టాయి. ప్రజల బుద్ధులు వాటిలో నిమగ్నమయాయి. మత విశ్వాసములపేరా మత సిద్ధాంతముపేరా తలలు బద్దలుకొట్టుకునే అలవాటు, పూర్తిగా కాక పోయినా, చాలావరకు యూరోపులో పోయింది. దానికి బదులు ఆర్థిక, సాంఘిక విషయముల పేర తలలు బద్దలుకొట్టుకో ప్రారంభించారు.

యూరోపులోని మత పరివర్తనమునకు సంబంధించిన ఈ కాలమును నేటి ఇండియాతో పోల్చి చూడడం లాభకరంగా ఉంటుంది. మతమునకూ, ఆధ్యాత్మికమునకూ ఇండియా పెట్టినది పేరని స్తోత్ర

పూర్వకంగాను, హేళనగానూకూడా తరుచు చెప్పుతారు. యూరోపుకు మతము లేదనీ, భోగవస్తువులమీద ప్రీతి అతిశయమనీ చెప్పి దానికిని ఇండియాకును గల భేదములెన్నుతారు. నిజమునకు మతబుద్ధి గల ఇండియా, హిందువుల దృక్పథముతో—మతమునకు సంబంధమున్నంత మట్టుకు—16 వ శతాబ్ది యూరోపుతో దగ్గిర పోలిక గలిగిఉన్నది. ఈ పోలిక మాత్రం సుదీర్ఘంగా తీసుకుపోగూడదు. మత విశ్వాస, మత సిద్ధాంత విషయములకు అధిక ప్రాముఖ్య మిచ్చుటలోను, రాజకీయార్థిక విషయములను మత సంఘముల శ్రేయస్సుతో ముడిపెట్టుటలోను, మత కలహములలోను, మధ్యకాలపు యూరపులో ఉన్న పరిస్థితులే ఇక్కడా ఉన్నవనుట సుస్పష్టము. పాశ్చాత్యులు కార్యపరులు, విషయ వాదులు (Materialists) అని చెప్పుటకుగాని, ప్రాచ్యులు ఆధ్యాత్మిక పరులు, పరాశక్తులు అని చెప్పుటకుగాని వీలులేదు. ఉన్న తేడా ఏమిటంటే పాశ్చాత్యులు పారిశ్రామికముగా యంత్రసహాయముతో వృద్ధిలో ఉన్నారు. అందలి మంచీ, చెడ్డాకూడా అనుభవిస్తున్నారు. ప్రాచ్యులు ఇంకా పారిశ్రామికం కాలేదు. వ్యవసాయ కార్యములలోనే నిమగ్నులై ఉన్నారు.

సహనబుద్ధి, హేతువాదము యూరోపులో మెల్లగా వృద్ధిపొందినవి. మొట్టమొదట ఇట్టి అభిప్రాయాలు అంకురించడానికి పుస్తకాలు అంతగా తోడ్పడలేదు. బహిరంగముగా క్రైస్తవమును విమర్శించడానికి ప్రజలు భయపడుతూ ఉండడం ఇందుకు కారణము. అట్లా చేస్తే చెరసాలో, వేరే ఇతరదండనో తప్పదు. కంఫ్యూసియసును అమితంగా పొగిడాడనే కారణాన్ని పురస్కరించుకొని ఒక జర్మను తత్త్వవేత్తను దేశమునుంచి బహిష్కరించారు. అట్లాచేయడం క్రైస్తవమును నిందించినట్లే అన్నారు. 18 వ శతాబ్దిలో ఈ అభిప్రాయములు స్పష్టమగుటవల్లా, సామాన్యమగుటవల్లా ఈ విషయములనుగురించి గ్రంథములు రచింపబడ్డవి. హేతువాద సిద్ధాంతములకు ఇతర విషయములకు సంబంధించిన

గ్రంథములు వ్రాసిన వారిలో ఆనాడు మిక్కిలి ప్రసిద్ధుడు, ఫ్రెంచివాడైన వాల్టేర్. అతనిని చెరలో పెట్టారు. దేశమునుంచి బహిష్కరించారు. చివరకతడు జినీవా దగ్గరనున్న ఫెర్నీలో కాపురం పెట్టుకున్నాడు. చెరసాలలో ఉన్నప్పుడు వ్రాసుకోడానికి అతనికి కాగితమూ, సిరా ఇవ్వ లేదు. ఒక గ్రంథములో పంక్తులమధ్య అతడు సీసము ముక్కలతో పద్యములు వ్రాసుకొనేవాడు. చిన్నతనమందే అతడు ప్రసిద్ధుడయాడు. తన అసాధారణ సామర్థ్యమువల్ల అతడు పదవయేటనే ప్రపంచదృష్టి నాకర్షించాడు. అన్యాయమూ, మతవిషయముల మౌర్ఖ్యమూ అతనికి గిట్టవు. వాటిని నిర్మూలించడానికతడు పూనుకున్నాడు. అతని ప్రసిద్ధ వాక్యము—"దౌష్ట్యము నణచివేయండి" అని. అతడు చాలాకాలం జీవిం చాడు (1604—1778). బహుళ గ్రంథ నిర్ణేత. క్రైస్తవ మతము నతడు విమర్శించాడని పూర్వాచార పరాయణులైన క్రైస్తవులందరూ అతనిని అమితంగా ద్వేషించారు. అతడొక గ్రంథములో ఇట్లు వ్రాశాడు— "పరీక్షచేసి మంచిచెడ్డలు విచారించకుండా తన మతమునంగీకరించేవాడు, మెడమీద కాడి పెట్టడానికి సమ్మతించే ఎద్దువంటివాడు." హేతువాదము తట్టు ప్రజలు మొగ్గడానికీ, నూతనాభిప్రాయములు వారాస్వాదించడానికీ వాల్టేరు వ్రాతలు చాలో తోడ్పడ్డాయి. ఫెర్నీలో అతడు కాపురమున్న యిల్లు అనేకులు పోయి ఇంకా దర్శిస్తూ ఉంటారు.

వాల్టేర్ సమకాలికుడు వేరొక గ్రంథకర్తగలడు. అతడు వాల్టేర్ కన్న చిన్నవాడు. అతని పేరు జీన్ జాకీస్ రూసో. అతని జన్మస్థానము జినీవా. అతని పేరుచెప్పి జినీవా గర్విస్తూంటుంది. అచ్చట అతని శిలా ప్రతిమ చూచాము జ్ఞాపకమున్నదా? మత రాజకీయాలను గురించి అతడు వ్రాసిన గ్రంథాలు సంచలనము కలిగించాయి. సాహసముతో కూడుకొన్న అతని నూతన సాంఘిక, రాజకీయ, సిద్ధాంతాలుకారణముగా అనేకమందిలో నూతనాభిప్రాయాలూ, నూతన నిర్ణయాలూ అంకురిం చాయి. అతని రాజకీయ సిద్ధాంతాలీకాలమున చెల్లవుకాని మహావిప్లవము

నకు ఫ్రెంచి ప్రజలను అవి సంసిద్ధము చేయడానికి తోడ్పడ్డాయి. రూసో విప్లవమును తెచ్చిపెట్టమని బోధించలేదు. విప్లవము వస్తుందని బహుశా అతడు అనుకోనూలేదు. కాని అతని గ్రంథములున్నూ, అభిప్రాయము లున్నూ ప్రజల హృదయములలో విప్లవ బీజాలు నాటాయి. అవి అంకురించి విప్లవముగా వికసించాయి.

అతని ప్రసిద్ధ గ్రంథము "సోషల్ కాంట్రాక్టు" అనునది. అందలి ప్రథమ వాక్యము ప్రసిద్ధమైనది (జ్ఞాపకాన్నిబట్టి వ్రాస్తున్నాను). "మానవుడు స్వేచ్ఛతో పుట్టాడు; కాని అన్నిచోట్లా అతడు సంకెళ్లతో ఉన్నాడు."

రూసో గొప్ప విద్యాదక్షుడు. అతడు సూచించిన నూతన బోధనా పద్ధతు లనేకము నేడు పాఠశాలలలో ప్రచార మందున్నవి.

18 వ శతాబ్దిలో ఫ్రాంసులో వాల్టేర్, రూసోలేగాక రచయితలూ, తాత్వికులూ అనేకులుండిరి. ఇంకొక్క పేరుమాత్రము నే నుదహరిస్తాను. అది మాంటెస్క్యూ. అతడు ఇతర పుస్తకములతోపాటు "ఎస్పిరిట్ డిలోయ్" అనే గ్రంథాన్ని వ్రాశాడు. ఈ కాలమునందే పారిస్‌లో విజ్ఞాన సర్వస్వముకూడా ప్రచురింపబడెను. దానినిండా డీడ్రో మున్నగు సమర్థులగు రచయితలు రాజకీయ, సాంఘిక విషయములపై వ్రాసిన వ్యాసములుండెను. ఆ కాలమున ఫ్రాంసునిండా తత్త్వవేత్తలున్నట్లు తోస్తుంది. అంతేకాదు, వారి గ్రంథములు విరివిగా ప్రజలు చదువుతూ ఉండేవారు. చాలామంది సామాన్యజనులు వారి ఉద్దేశములను గ్రహించి, వారి సిద్ధాంతములను చర్చిస్తూ ఉండేవారు. ఈ విధముగా ఫ్రాంసులో మత విషయకమగు అసహనముకూ, రాజకీయ, సాంఘిక హక్కులకూ వ్యతిరేకముగా ప్రబలమగు ఊహలు పొడచూపెను. స్వాతంత్ర్యము సాధించవలెననే అస్పష్టమగుకోరిక వారిలో అంకురించెను. అయినప్పటికీ విశేషమేమిటంటే తాత్వికులుగాని, ప్రజలుగాని రాజును వదుల్చుకో తలపలేదు. ప్రజాప్రభుత్వ భావన ఆనాడు సామాన్యముగా అందరికీ

తెలియదు. ఆదర్శప్రాయుడగు రాజు ప్లాటో చెప్పినట్టి తత్త్వవేత్తయగు రాజువంటివాడు వస్తాడనీ, తమ కష్టములు తొలగిస్తాడనీ, న్యాయముగా పాలిస్తాడనీ, స్వేచ్ఛ నిస్తాడనీ వారాసించు చుండిరి. ఏమైనా తాత్త్వికులు వ్రాసిన విషయమిది. బాధపడుతూన్న ప్రజా సామాన్యము రాజు నెంతవరకూ ప్రేమిస్తున్నారనే విషయం సందేహాస్పదమైనది.

ఫ్రాంసులోవలె ఇంగ్లాండులో రాజకీయాభి ప్రాయములు వృద్ధి నందలేదు. ఇంగ్లీషువాడు రాజకీయ జంతువు కాడనిన్నీ, ఫ్రెంచివాడు రాజకీయ జంతువనిన్నీ చెప్పుకోవడం కద్దు. ఇది ఇట్లా ఉండగా 1688 లో జరిగిన ఇంగ్లీషు విప్లవము కొంతవరకు ఈ బిగువు తగ్గించింది. అయినా కొన్ని తరగతుల ప్రజలు ఇంకా హక్కులనేకము అనుభవిస్తున్నారు. నూతన ఆర్థిక సమస్యలూ, (వీటినిగురించి వేరొక జాబులో వ్రాస్తాను.) వర్తకమూ, అమెరికా, ఇండియా వ్యవహారములలో చిక్కుకొనిపోవుట కారణముగా ఇంగ్లీషువారికి తీరుబడిలేకుండెను. సాంఘికముగా పెద్ద ఒత్తిడి వచ్చినప్పుడు అప్పటికప్పుడు రాజీ జరుగుటవల్ల ప్రమాదము తప్పింది. ఫ్రాంసులో ఇట్టి రాజీకి సావకాశము లేదు. అందువల్ల అది తారుమారయినది.

18 వ శతాబ్ది మధ్యలో నేటి నవల ఇంగ్లాండులో వృద్ధియైనదని తెలిసికొనుటకు ముచ్చటగా నుండును. "గలివరు ప్రయాణములు," "రాబిన్‌సన్ క్రూసో" అను నవలలు రెండూ 18 వ శతాబ్ది తొలి భాగములో వచ్చినవని నీకిదివరలో చెప్పియుంటిని. వాటి తరువాత నికరమైన నవలలు వచ్చినవి. ఈ కాలమున ఇంగ్లాండులో పఠనాశక్తి గల ప్రజలు క్రొత్తగా పొడచూపుచుండిరి.

18 వ శతాబ్దిలోనే గిబ్బన్ అనే ఇంగ్లీషువాడు "రోమక సామ్రాజ్యము క్షీణించి, పతనమగుట" అనే ప్రసిద్ధ గ్రంథాన్ని వ్రాశాడు. రోమక సామ్రాజ్యమును గురించి వ్రాశేటప్పుడు అతనిని గురించీ, అతని గ్రంథమును గురించీ నీకు చెప్పియున్నాను.

(88)

96

# యూరోపులో గొప్ప మార్పులు రానున్నవి

సెప్టెంబరు 24, 1932

18 వ శతాబ్దిలో యూరోపులోని, అందు ముఖ్యముగా ఫ్రాంసులోని, స్త్రీ, పురుషుల చిత్తవృత్తులను కొద్దిగా తెలిసికొంటిమి. వృద్ధి నందుచున్న నూతనాభిప్రాయాలకున్నూ, పాత అభిప్రాయలకున్నూ జరిగిన సంఘర్షణ కొంతవరకు మనము చూడగలిగితిమి. ఇంతవరకు తెరవెనుక ఉండి చూచితిమి కాబట్టి యూరోపు నాటక రంగమున నటించిన పాత్రల నిప్పుడు పరిశీలింతము.

ఫ్రాంసులో లూయీ XIV చివరకు ఎలాగైతేనేమి 1757 లో మరణించాడు. అనేక తరములు దాటి బ్రదికేడతడు. అతని తరువాత అతని ముని మనమడు లూయీ XV రాజ్యానికి వచ్చాడు. ఇతడు దీర్ఘ కాలం, 59 సంవత్సరములు, రాజ్యం చేశాడు. వరసగా వచ్చిన ఈ ఇద్దరు రాజులూ లూయీ , లూయీ XV అను వారలు వెరసి 131 సంవత్సరములు రాజ్యం చేశారు. ప్రపంచములో దీనిని మించి రాజ్యము చేసిన వారెవరూ ఉండి ఉండరు. చీనాలో ఇద్దరు మంచూ చక్రవర్తులు కాంగ్-హి, చియెన్‌లంగ్ అనువారు ఒక్కొక్కరు 60 సంవత్సరములుపైగా రాజ్యము చేసిరి. కాని వారొకరి తరువాత ఒకరు వచ్చినవారు కారు. వీరుభయులమధ్యా వేరొకరు రాజ్యముచేసియుండిరి.

లూయీ XV పరిపాలనము దీర్ఘకాలము జరిగినదన్నమాట అటుంచితే అతని పరిపాలనములో లంచగొండితనము, కుట్రలు అమితముగా ఉంటూవచ్చాయి. రాజ్యాదాయము రాజు భోగములకు వినియోగపడేది. రాజ్యములో దూబరా ఎక్కువగా ఉండెను. కొలువులోనుండే స్త్రీ, పురుషులు రాజుగారి అనుగ్రహాన్ని సంపాదించి ఉచితంగా భూములనూ, ధనాదాయముండే ఉద్యోగములనూ పొందుతూ ఉండేవారు.

అనగా పని చెయ్యకుండా వారికి ఆదాయము వచ్చేదన్నమాట. రానురాను ఈ భారమంతా ప్రజలమీద పడేది. నిరంకుశత్వము, అసమర్థత, దుష్ట పరిపాలనము కలిసి మెలిసి ఉండెను. శతాబ్ది ముగియకుండానే వారు బాట చివరకు వచ్చి అఖాతములో కాలు పెట్టారంటే ఆశ్చర్యమెందుకు ? ఆశ్చర్యకరమైన విషయము బాట అంత దీర్ఘముగా ఉండడమూ; పతన మంత ఆలస్యముగా జరగడమున్నూ. ప్రజల కోపానికీ, తీర్పుకీ గురి కాకుండా లూయీ XV తప్పించుకొన్నాడు. గురియైనవాడు లూయూ XVI.

ఇంత అసమర్థతా, దౌష్ట్యమూ లూయీ XV లో ఉన్నప్పటికీ అతడుమాత్రము తనకు రాజ్యములో నిరంకుశాధికారము కలదని గట్టిగా నమ్మినవాడే. అతడు సమస్తమున్నూ; అతనికి ఇష్టమువచ్చినపని చేయడానికి ఎవరూ కాదనరాదు. 1760 లో పారిస్‌లో జరిగిన ఒక సమావేశంలో అతడు చెప్పినమాటలివి—

> "నాలోనే రాజత్వము నిలిచియున్నది. శాసనములు చేసే అధికారము పూర్తిగా నాదే. అందుకై నేనితరులసలహా తీసుకో నవసరములేదు. ఈ నా అధికారములో ఇతరులకు భాగములేదు. దేశక్షేమము నావల్లనే కలుగవలెను; దేశక్షేమమునకు ప్రధాన రక్షకుడను నేనే. నా ప్రజకునాపై పూర్తిగా నమ్మకముగలదు. జాతియొక్క హక్కులుగాని, క్షేమముగాని నన్నువిడిచి ఉండవు. నా హక్కులూ, అధికారములున్నూ అవీ ఒకటే; అవి నా స్వాధీనములో నున్నవి."

18 వ శతాబ్దిలో చాలాకాలమువరకు ఫ్రాంసు రాజీవిధముగా నుండెను. కొద్ది కాలముపాటు తన అధికారమును యూరోపుపై అతడు చెలాయించినట్లు తోచును. కాని ఆశాపరులగు ఇతర రాజులతోనూ, జాతులతోనూ పేచీలు వచ్చుటవల్ల అతడు ఓడిపోయినట్లు ఒప్పకోవలసి వచ్చింది. ఫ్రాంసు ప్రతిపక్షులు కొందరు యూరోపులో ప్రాముఖ్యమును

కోల్పోయిరి. వారి స్థానే ఇతరులు తలయెత్తి ఫ్రెంచి అధికారముపై కాలుదువ్వుచుండిరి. సామ్రాజ్యకీర్తికొద్దికాలమే అనుభవించిన స్పెయిన్, యూరోపులోను ఇతర ప్రదేశములందును వెనుకబడ్డది. కాని దానికి అమెరికాలోనూ, ఫిలిప్పైను దీవులలోనూ పెద్దపెద్ద అధినివేశములింకా ఉండెను. ఆస్ట్రియాలోని హాప్సుబర్గువంశము ఇంతవరకూ సామ్రాజ్యమున ప్రముఖత్వమునూ, తత్ద్వారా యూరోపులో నాయకత్వమునూ వహించి యున్నప్పటికీ నేడు పూర్వమువలె ప్రసిద్ధిగాలేదు. సామ్రాజ్యములో నాయకత్వము వహించిన రాజ్యముగా ఆస్ట్రియా నేడులేదు. వేరొకరాజ్యము, ప్రషియా అను పేరుగలది, తలయెత్తి ఆస్ట్రియా అంత ప్రాముఖ్యము సంపాదించెను. ఆస్ట్రియా రాజ్యాధిపత్య వారసత్వము విషయమున యుద్ధములు తటస్థించెను. చాలాకాలముపాటు మేరియా తెరీసా అను స్త్రీ రాజ్యము చేసెను.

1648 సంవత్సరములో జరిగిన వెస్టుఫాలియా సంధి కారణముగా ప్రషియా, యూరోపు జాతులలో ఒక ప్రధాన జాతి అయ్యెను. హూయెన్‌చోవెరన్‌వంశమువారక్కడరాజ్యముచేయుచుండిరి. ఆస్ట్రియాలోని హాప్సుబర్గు వంశము వారి అధీశతను వారు ప్రతిఘటించుచుండిరి. నలభైఆరు సంవత్సరముల పాటు (1740-1786) ఫ్రెడిరిక్కు ప్రషియాను పాలించెను. యుద్ధములందు విజయములు సాధించుటచే అతనికి ఘనుడను బిరుదు వచ్చెను. యూరోపులోని ఇతర రాజులవలెనే అతడొక నిరంకుశ ప్రభువు. అయితే అతడు తత్త్వవేత్తనని నటించి వాల్టేర్ స్నేహమును సంపాదించ ప్రయత్నించెను. అతడు బలమైన నౌకాదళమును నిర్మించెను. మంచి సేనా నాయకుడు. అతడు హేతువాది (Rationalist) నని చెప్పుకొనుచుండెను. ఈ క్రింది వాక్యములతడు చెప్పినవని చెప్పుదురు—"తనకు తోచిన విధముగా ప్రతివాడును స్వర్గమునకు పోవుటకు సావకాశముండవలెను."

పదిహేడవ శతాబ్దినుంచిన్నీ ఫ్రెంచి సంస్కృతి యూరోపులో

ప్రాధాన్యము వహించింది. 18 శతాబ్ది మధ్య కాలములో ఇది ఇంకను ప్రబలముగా ఉండెను. వాల్టేర్ యూరోపులో అఖండకీర్తి సంపాదించెను. కొందరీ శతాబ్దిని "వాల్టేర్ శతాబ్ది" అనికూడా అంటారు. యూరోపు సంస్థానములన్నింటిలో ఫ్రెంచి సారస్వతము పఠింప బడుచుండెను. వెనుకబడియున్న సేంటుపీటర్సు బర్గులోకూడా అట్లు జరుగుచుండెను. సంస్కారులైన విద్యావంతులు ఫ్రెంచి భాషలో మాట్లాడుట, ఫ్రెంచి భాషలో వ్రాయుట గొప్పగా ఎంచుకొనేవారు. ఘనుడగు ఫ్రెడరిక్కు ఎప్పుడూ ఫ్రెంచిలో మాట్లాడుతూ, ఫ్రెంచిలో వ్రాస్తూఉండేవాడు. అతడు ఫ్రెంచిలో పద్యములు వ్రాయుటకుకూడా ప్రయత్నించెను. తాను వ్రాసిన పద్యాలు సవరించిమెరుగుపెట్టమని వాల్టేరును కోరేవాడు.

ప్రషియాకు తూర్పుగా రష్యా ఉన్నది. అది వృద్ధినందుచున్నది. పిదపకాలమున నది మహారాజ్యము కానున్నది. చీనాదేశ చరిత్ర పరిశీలించే సందార్భాన రష్యా ఎట్లు సైబీరియాను దాటి పసిఫిక్కువరకూ వ్యాపించినదో, అలాస్కానుకూడా దాటినదో మనము తెలిసికొని ఉన్నాము. 17వ శతాబ్దము చివరరోజులలో రష్యాను ఘనుడగు పీటరు అను ప్రబలుడగు రాజు పరిపాలించుచుండెను. మంగోలియనులతో సహవాసము చేయుటవల్ల వారి సంప్రదాయములు కొన్ని రష్యాకు పట్టుబడెను. వాటిని తుదముట్టించుటకు పీటరు పూనుకొనెను. రష్యాను అతడు పాశ్చాత్య సంప్రదాయాను సారిగా జేయగోరెను. ప్రాచీన సంప్రదాయములతో నిండియుండిన, పాత రాజధానియగు మాస్కోను అతడు వదలిపెట్టి ఒక క్రొత్తనగరమును రాజధానిగా అతడునిర్మించెను. దీనికే సేంటు పీటర్సు బర్గు అని పేరు. ఇది ఉత్తరమున, ఫిన్లాండు సింధు శాఖపైని, నీవా నదీతీరమున ఉన్నది. బంగారు గోపురముల తోనూ, గోపుర శిఖరములతోనూ ఈ నగరము, మాస్కోను పోలక, విశిష్టముగా ఉండెను. పడమటి యూరోపులోని మహానగరములనది పోలియుండెను. పాశ్చాత్యీకరణము (Westernization) నకు

చిహ్నముగా పీటర్సుబర్గు ఉండెను. యూరోపు రాజకీయములలో రష్యా అధికముగా పాల్గొనజొచ్చెను. పీటర్సు బర్గు అనే పేరు నేడు ప్రచార ములో లేదని నీకు తెలిసియుండవచ్చును. కడచిన 20 సంవత్సరముల లోనూ అది రెండుమార్లు పేరు మార్చుకొన్నది. మొదట అది పెట్రో గ్రాడుగా మారినది. తరువాత లెలిన్ గ్రాడుగా మారినది. ఆ పేరే నేడు నిలిచి ఉన్నది.

ఘనుడగు పీటరు రష్యాలో అనేక మార్పులు తెచ్చిపెట్టెను. ఒక మార్పు సంగతి చెప్పితే నీకు సరదాగా ఉండవచ్చును. ఆ కాలమున రష్యాలో "టెరెం" అను పేరుగల ఘోషా ఆచారము ఉండెను. దాని నతడు అంతరింపజేసెను. పీటరు ఇండియామీద దృష్టి పెట్టుకొనెను. అంతర్జాతీయ రాజకీయములలో ఇండియా విలువనతడు గుర్తించెను. తన వీలునామాలో అతడిట్లువ్రాసెను- "ఇండియా వాణిజ్యము, ప్రపంచ వాణిజ్యమనే మాట జ్ఞాపకముంచుకొనుము; ఎవరైతే ఇండియా వాణి జ్యమును చేజిక్కించుకుంటారో వారు యూరోపును ఏలగలుగుతారు." ఇండియాలో అధికారమును సంపాదించిన పిమ్మట ఇంగ్లాండు శీఘ్ర కాలములో ప్రబలమైన విషయము చూస్తే అతని తుది మాటలు ఎంత సత్యమో వెల్లడి అవుతోంది. ఇండియాను స్వప్రయోజనములకై ఉపయోగించుకొన్న ఇంగ్లాండుకు ప్రతిష్ఠా వచ్చింది. భాగ్యమూ వచ్చింది. ఎన్నోితరములపాటు ఇంగ్లాండు ప్రపంచజాతులలో అగ్రగామి అయినది.

ఒకతట్టు ప్రషియా ఆస్ట్రియాలకున్నూ, వేరొకతట్టు రష్యాకున్నూ మధ్యగా పోలెండు ఉన్నది. ఇది వెనుకబడిన దేశము. ఇందలి రైతులు బీదవారు. ఇందు పరిశ్రమలుకాని, వాణిజ్యముగాని లేవు. పెద్ద పట్టణము లున్నూ లేవు. ఈ దేశమందలి రాంజ్యాంగ వ్యవస్థ (Constitution) విశిష్టమైనది. రాజును ఎన్నుకొందురు. కాని అధికారమేమో ఫ్యూడల్ కులీనుల హస్తగతమై ఉండెను. దానిచుట్టునూ ఉన్న దేశములు ప్రబల

పోతూన్నకొద్దీ అది బలహీనము కాజొచ్చినది. ప్రషియా, ఆస్ట్రియా, రష్యా దేశములు దానిని కబళించ చూచుచుండెను.

అయినప్పటికీ 1683 లో వియన్నాను తురుష్కులు పట్టుకొన ప్రయత్నించినప్పుడు వారిని వెనుకకు కొట్టినది పోలెండు రాజే. నాడు మొదలు ఆటొమన్ తురుష్కులు ఇతరులను డీకొనుట మానుకొనిరి. వారికి శక్తి సన్నగిల్లెను. అదృష్టము వెనుకబట్టెను. ఇకముందు వారాత్మ రక్షణకు పూనుకొనిరి. యూరోపులోని తురుష్క సామ్రాజ్యము మెల్ల మెల్లగా హరించిపోజొచ్చెను. మనమిప్పుడు 18 వ శతాబ్ది మొదటి భాగమును గురించి ప్రసంగించు కొనుచున్నాము. ఈ కాలమున యూరోపుకు ఆగ్నేయమున టర్కీ ప్రబలమగు దేశముగా ఉండెను. టర్కీ సామ్రాజ్యము హంగరీనుండి పోలెండు వరకూ బాల్కను రాజ్యములపై వ్యాపించి ఉండెను.

దక్షిణమున ఇటలీ చీలికలై వేర్వేరు రాజుల పాలనమందుండెను. యూరోపు రాజకీయములలో దానికంత ప్రాముఖ్యములేదు. పోపు ఈ కాలమున అధికారమును చెలాయించుచుండుట లేదు. రాజు లతనిని గౌరవముతో చూచు చుండిరి. కాని రాజకీయ విషయములందతనిని ఉపేక్షించుచుండిరి. క్రమక్రమముగా యూరోపులో ఒక నూతన పద్ధతి తలయెత్తు చుండెను. అది గొప్ప పవరులు (Great Powers) అనే పద్ధతి. ప్రబలమగు కేంద్రైకాధి పత్యములు (Centralised Monarchies) జాతి భావన వృద్ధి నందుటకు కారణమైనవని నీకిదివరలో చెప్పియుంటిని. ప్రజలు తమ దేశములగూర్చి ఒక విశిష్ఠ భావన పెట్టుకొన జొచ్చిరి. ఇట్టి భావన నేటికాలమున సామాన్యమైనదే. కాని ఈ కాలమునకు ముందిది అసామాన్యమైనది. ఫ్రాంసు, ఇంగ్లాండు (బ్రిటానియా), ఇటాలియా మున్నగు ఇట్టి మూర్తులు వెలువడజొచ్చినవి. జాతికివి చిహ్నలుగా ఉండెను. పిదప కాలమున 19 వ శతాబ్దిలో, స్త్రీ, పురుషుల హృదయములందీ మూర్తులు విస్పష్టాకారమును వహించి

వారి హృదయములందు సంచలనము కలిగింపజొచ్చెను. అవి నూతన దేవతలైనవి. దేశ భక్తి పరులీదేవతల నుపాసించ జొచ్చిరి. వాటిపేర వాటికొరకు దేశ భక్తులు ఒకరితో నొకరు పోరాడుచు, ఒకరి నొకరు చంపుకొనుచు ఉండిరి. భారతమాత యనుభావన మన హృదయముల నెట్లు కదలించునో నీకు తెలుసును. ఊహా జనితమైన ఈ మిథ్యామూర్తి కొరకు ప్రజలు బాధలపాలై ఎట్లు మరణింతురో నీకు తెలుసును. ఇట్లే ఇతర దేశములందలి ప్రజలుకూడా తమ మాతృదేశమును గూర్చి భావించుచుండిరి. కాని ఇది తరువాతి కాలమున పరిణమించిన పరిస్థితి. ప్రస్తుతము నేను నీతో చెప్పదలచిన దేమనగా—18 వ శతాబ్దిలో జాతీయత, దేశభక్తి అను భావము వేళ్ళు తన్నినదని. ఫ్రెంచి తత్త్వవేత్తలు ఇట్టి భావన కలుగుటకు సహాయ భూతులైరి. ఫ్రెంచి విప్లవము ఈ భావనకు స్థిరరూపమునిచ్చినది.

ఈ జాతులే పవరులు (Powers). రాజులు వచ్చుచుండిరి, పోవుచుండిరి. కాని జాతులు సాగిపోవుచునే ఉండెను. క్రమక్రమముగా ఈ పవరులలో కొన్ని మిగిలిన వాటికన్న ఎక్కువ ప్రాధాన్యమును వహించెను. 18 వ శతాబ్ది తొలి రోజులలో "గొప్ప పవరులు" అనిచెప్పుకోబడినవి ఫ్రాంసు, ఇంగ్లాండు, ఆస్ట్రియా, ప్రషియా, రష్యా దేశములు. స్పెయినువంటి దేశములు మరికొన్ని నామమాత్రము గొప్పవి. కాని అవి ఖిలమగుచున్నవి.

ఇంగ్లాండు శీఘ్రముగా భాగ్యవంతమగుచుండెను. ప్రాముఖ్యమును పొందుచుండెను. ఎలిజబెత్తు కాలము వరకు ఇంగ్లాండు ప్రధాన దేశముగా యూరోపునందుకాని, ప్రపంచమందుగాని భావింపబడుట లేదు. దాని జన సంఖ్య తక్కువ. ఆ కాలమున బహుశా 6,000,000 జన సంఖ్య ఉండియుండును. ఈ సంఖ్య నేటి లండను జనసంఖ్యకన్న తక్కువ. కాని ప్యూరిటన్ విప్లవము జరిగిన పిమ్మటను, రాజుపై పార్లమెంటు విజయము సాధించిన పిమ్మటను ఇంగ్లాండు నూతన

పరిస్థితులకు అనుగుణముగా సంచరించి పురోభివృద్ధిచెందినది. స్పెయిను పరిపాలనమును వదిలించుకొన్న పిమ్మట హాలెండుకూడ ఇట్లే చేసినది.

18 వ శతాబ్దిలో అమెరికాలోను, ఆసియాలోను అధినివేశముల సంపాదించుటకై యూరోపియన్ పవర్లనేకము ప్రాకులాడినవి. ఇందు విషయమై ముఖ్యముగా ఇంగ్లాండు, ఫ్రాంసు దేశములు పెనగులాడినవి. అమెరికాలోనూ, ఇండియాలోనూ కూడా ఇంగ్లాండుదే పైచెయ్యి అయినది. ఫ్రాంసు దేశము లూయీ XV యొక్క అసమర్థ పరిపాలనలో ఉండడమే కాకుండా యూరోపియన్ రాజకీయములలో ఎక్కువగా తగుల్కొని ఉండెను. 1756 మొదలుకొని 1763 వరకు ఈ రెండు జాతులకునూ, ఇంకా ఇతర జాతులనేకమునకునూ, యూరోపులోనూ, కెనడాలోనూ, ఇండియాలోనూ యుద్ధములు చెలరేగెను. ప్రముఖత్వమెవరికి చెందవలెనో నిర్ణయించుటకీ పోరాటము. ఈ యుద్ధమును ఏడు సంవత్సరముల యుద్ధమంటారు. ఇండియాలో ఈ యుద్ధమును కొంత మనము చూచితిమి. ఇచ్చట ఫ్రాంసు పరాజయమందెను. కెనడాలోకూడా విజయము ఇంగ్లాండుకే చిక్కెను. యూరోపులో ఒక కొత్త రాజనీతిని ఇంగ్లాండు అవలంబించెను. డబ్బిచ్చి తన యుద్ధములు ఇతరులచేత పోరాడించి అది పేరు తెచ్చుకొనెను. ఘనుడగు ఫ్రెడరిక్కు ఇంగ్లాండుకు మిత్రుడై ఉండెను.

ఏడు సంవత్సరముల యుద్ధముయొక్క ఫలితము ఇంగ్లాండుకు చాలా అనుకూలముగా ఉండెను. ఇండియాలోనూ, కెనడాలోనూ, దానిని ప్రతిఘటించు యూరోపియన్ జాతులు ఎవరూ లేకుండిరి. సముద్రముల మీద దాని ఆధిపత్యము నెలకొల్పబడెను. ఈ విధముగా ఇంగ్లాండు ఒక సామ్రాజ్యమును స్థాపించుకొనుటకును, దానిని వృద్ధి చేసుకొనుటకును, ఒక ప్రపంచజాతిగా పరిణమించుటకును, తగిన స్థితిలోనుండెను. ప్రషియాకు కూడ పలుకుబడి ఎక్కువయ్యెను.

ఈ యుద్ధమువల్ల మరల యూరోపు అలిసిపోయెను. మరల

యూరోపులో శాంతి నెలకొనినట్లు కనిపించెను. అయినా ప్రషియా, అస్ట్రియా, రష్యా దేశములు పోలెండు రాజ్యమును కబళింపుటకు ఈ శాంతి అడ్డురాలేదు. ఈ జాతులతో యుద్ధము చేసే స్థితిలో పోలెండు లేదు. కాన యీ మూడు తోడేళ్ళును దానిమీద పడి, దానిని పంచుకొని, పోలెండు స్వాతంత్ర్యమును తుదముట్టించెను. మూడు పర్యాయములు ఇట్టి పంపకములు జరిగెను—1772 లో, 1793 లో, 1795లో. మొదటి పంపకము జరిగిన పిమ్మట పోలెండు ప్రజలు, దేశమును సంస్కరించి బలపరుచుటకు గొప్ప ప్రయత్నమును చేసిరి. ఒక పార్లమెంటును వారు స్థాపించుకొనిరి. కళా సారస్వతములు పునరుద్ధరింపబడెను. కాని పోలెండు చుట్టూ ఉన్న నిరంకుశ ప్రభువులు ఒకమారు రక్తమును రుచి చూచి ఉన్నవారే కాబట్టి పూర్తిగా పోలెండును భక్షిస్తేనే గాని వారికి తృప్తి కలుగలేదు. అయినా వారికి పార్లమెంటుల మీద అంత ప్రేమా లేదు. కాబట్టి పోలెండు ప్రజలు ఎంత దేశభక్తి పరాయణు లైనప్పటికీ, గొప్ప యోధుడైన కోసిఉస్కో నాయకత్వమున ఎంత ధైర్యముగా పోరాడినప్పటికీ 1795 లో పోలెండు యూరోపు దేశ పటమునుంచి మాయమైనది. అది అప్పుడు అంతరించినా పోలులు దేశ భక్తిని మరువలేను. స్వాతంత్ర్యము కొరకై స్వప్నములు కంటూనే ఉండిరి. 123 సంవత్సరముల పిమ్మట వారి స్వప్నము సిద్ధించింది. మహా సంగ్రామానంతరము పోలెండు స్వతంత్ర దేశముగా మళ్ళీ అవతరించింది.

18 వ శతాబ్ది రెండవ భాగములో యూరోపులో కొంత శాంతి నెలకొన్నదని చెప్పతిని. కాని ఇది పైపైనిమాత్రమే కనిపించుచున్నది. ఇది దీర్ఘకాలము నిలువలేదు. ఈ శతాబ్దిలో జరిగిన అనేక సంఘటన లను గురించికూడా చెప్పి ఉన్నాను. కాని 18 వ శతాబ్ది మూడు విషయ ములకు—మూడు విప్లవములకు—ప్రసిద్ధి గన్నది. ఈ శతాబ్దిలో యూరో పులో జరిగిన యితర విషయములన్నీ వీటిముందు నిస్సారమగుచున్నవి.

ఈ మూడు విప్లవములును ఆ శతాబ్ది నాల్గవ పాదములో జరిగినవి. అవి మూడు విధములైన విశిష్ఠ విప్లవములు. ఒకటి రాజకీయ విప్లవము, ఒకటి పారిశ్రామిక పిప్లవము, ఒకటి సాంఘిక విప్లవము. రాజకీయ విప్లవము అమెరికాలో జరిగినది. బ్రిటిషు అధినివేశములే ఈ తిరుగుబాటు చేసినవి. ఇందుకు ఫలితముగా స్వతంత్ర ప్రజాప్రభుత్వము అమెరికా సంయుక్త రాష్ట్రములను పేర వెలిసినది. మనకాలమున అమెరికా సంయుక్త రాష్ట్రములు ఎంతో ప్రబలముగా ఉన్నవి. పారిశ్రామిక విప్లవము ఇంగ్లాండులో ప్రారంభమయి, పడమటి యూరోపియన్ దేశములకును ఇతర ప్రదేశములకునూ వ్యాపించినది. ఇది శాంతియుతమగు విప్లవము. దీనివల్ల కలిగిన ఫలితములనేకము. ప్రపంచమున మానవజీవితములో ఇవి తెచ్చినన్నిమార్పులు చరిత్రలో జరిగిన మరియే యితర విషయములును తేలేదు. అది కారణముగా నీటి ఆవిరి వినియోగములోనికి వచ్చినది. పెద్ద యంత్రము వచ్చినది. అసంఖ్యాకములగు పారిశ్రామిక ఫలితములను నిత్యము మన చుట్టుపట్ల మనము చూస్తూనే ఉన్నాము. ఇక సాంఘింక విప్లవము—మహా ఫ్రెంచి విప్లవమే. అది ఏకాధిపత్యమును తుదముట్టించినది. ధనాఢ్యులనుభవించు లెక్కలేనన్ని హక్కులను తుదముట్టించింది. కొత్త తరగతుల ప్రజలు ముందుకు వచ్చారు. ఈ మూడు విప్లవములను గురించీ ప్రత్యేకముగా కొంతవిపులముగా మనము తెలిసికోవలసి ఉన్నది.

ఈ గొప్ప మార్పులు వచ్చేముందు యూరోపులో ఏకాధిపత్యములు సర్వతంత్ర స్వతంత్రములై ఉండెను. ఇంగ్లాండులోనూ, హాలెండులోనూ పార్లమెంటులున్నమాట వాస్తవమే కాని అవి కులీనుల చేతులలోను, భాగ్యవంతుల చేతులలోను ఉండెను. చట్టములు భాగ్యవంతులకొరకే. వారి ఆస్థిని, వారి హక్కులను నిలుపుటకొరకే చేయబడుచుండెను. విద్యాబోధకూడ భాగ్యవంతుల కొరకే. అధికృత గల తరగతి ప్రజలకే. నిజమునకు ప్రభుత్వము ఇట్టి తరగతి ప్రజలకొరకే

ఉండెను. ఆ కాలమున బీదవారిని గురించిన సమస్యే ఒక పెద్ద సమస్యగా ఉండెను. సంఘములోని ఉపరి భాగమందలి ప్రజల పరిస్థితులు కొంత బాగు పడినప్పటికీ బీదవారు హీనస్థితిలోనే ఉండిరి. మరింత హీనముగా కనిపించుచుండిరి.

18 వ శతాబ్ది పొడుగునా యూరోపులోని జాతులు క్రూరమగు బానిస వ్యాపారమును సాగించుచుండిరి. కొంతకాలముపాటు యూరోపులో బానిసలంటూ లేరు కాని భూమిని దున్ని వ్యవసాయము చేసే కమతగాండ్రు మాత్రము బానిసలకంటే మంచి స్థితిలో లేరు. అమెరికా దేశమును కనిపెట్టిన పిమ్మట బానిస వ్యాపారము మిక్కిలి క్రూర రూపముతో తలయెత్తినది. దీనిని ప్రారంభించినవారు స్పానిష్ వారును, పోర్చుగీసులును. వీరు ఆఫ్రికా తీరమందలి నీగ్రోలను పట్టుకొని, పొలములలో పని చేయుటకు అమెరికాకు పంపేవారు. ఈ హేయ వ్యాపారములో ఇంగ్లాండు పూర్తిగా పాల్గొన్నది. ఈ ఆఫ్రికనులకష్టాలు ఊహించడానికి నీకుగాని మరి ఎవరికీగాని సాధ్యముకాదు. వన్య మృగములను వేటాడినట్లు వేటాడి వాళ్ళను పట్టుకొనేవారు. వాళ్ళ నందరినీ కలిపి గొలుసులతో బంధించేవారు. అప్పుడు అమెరికాకు పంపించేవారు. ప్రయాణము ముగియక మునుపే అనేకమంది తోవలో చనిపోయేవారు. ఈ ప్రపంచములో బాధల పాలైనవారు పలువురున్నారు. నీగ్రోలు సహించినంత తీవ్రబాధలు సహించినవారు మరెవ్వరూ లేరు. ఇంగ్లాండు నాయకత్వమున బానిస వ్యాపారము 19 వ శతాబ్దిలో రద్దు చేయబడినది. ఈ విషయమును నిర్ణయించుటకు అమెరికాలో అంతఃకలహము చెలరేగెను. అమెరికా సంయుక్త రాష్ట్రములలో నేడు నివసించు లక్షలాది నీగ్రోలు ఈ బానిసలసంతానమే.

ఒక సంతోష దాయకమగు విషయమును చెప్పి ఈ జాబు ముగిస్తాను. ఈ శతాబ్దమందు జర్మనీ, ఆస్ట్రియాలలో సంగీత విద్య మిక్కిలి వృద్ధి చెందినది. యూరోపియన్ సంగీత విద్యలో అగ్రగణ్యులు

జర్మనులని నీకు తెలుసును. అందు కొందరు ప్రసిద్ధులు 17 వ శతాబ్దిలో ఉండిరి. ఇతర దేశములందువలెనే యూరోపులోకూడా సంగీతము మత సంబంధమగు కర్మ కాండలో ఒక భాగముగా ఉండెను. క్రమక్రమముగా మతమునుండి ఇది విడివడి ఒక కళగా పరిణమించెను. 18 వ శతాబ్దిలో ఇద్దరు మహానుభావులు ప్రసిద్ధిగాంచి యుండిరి. వారు మోజార్టు, బీటోవిన్ అనువారు. బాల్యమందే వారు అసాధారణ ప్రజ్ఞ చూపియుండిరి. వారిద్దరును ఉపజ్ఞ గల వాగ్గేయ కారకులు. పాశ్చాత్య దేశములలో సాటి లేని వాగ్గేయ కారకుడని చెప్పుకొను బీటోవిన్ చెవిటివాడు. ఇది వింత విషయముకాదా ? ఇతరుల కొరకు అతడు రచించిన అద్భుత కృతులు అతడు విన నోచుకోలేదు. కాని ఆతని హృదయము అతని కొరకై పాడిన కృతులనే అతడు పట్టుకొని లోకమునకు ప్రదర్శించి ఉంటాడు.

## 97
## మహా యంత్రాగమనము

సెప్టెంబరు 26, 1932

పారిశ్రామిక విప్లవమునుగూర్చి ఇప్పుడు ప్రసంగించుకొందుము. అది ఇంగ్లాండులో ప్రారంభమైనది. కాని ఇంగ్లాండులోని దాని చరిత్ర కొద్దిగా తెలుసుకొందము. ఫలానా తేదీని ఇది జరిగినదని చెప్పలేను. గారడీవలె ఒక ప్రత్యేక తేదీని ఈ మార్పు జరుగలేదు. కాని అది వేగముగా అల్లుకొనిపోయెను. 18 వ శతాబ్ది మధ్యనుంచి మొదలుకొని నూరు సంవత్సరములు గడవక మునుపే జీవిత విధానమునది మార్చి వేసెను. ఈ జాబులలో తొలి కాలమునుంచీ అనేక వేల సంవత్సరముల పాటు మనము చరిత్ర మార్గముల ననుసరించితిమి. అనేక మార్పులు మనము గమనించితిమి. కాని ఈ మార్పులేవీ కూడా, తరుచు అవి గొప్ప మార్పులైనప్పటికీ, ప్రజా జీవనముముఖ్య విషయములలో

మార్చలేదు. 18 వ శతాబ్ది తొలి రోజులలో సోక్రటీసుగాని, అశోకుడు గాని, జూలియస్ సీజరుగాని, ఇండియాలోనిఅక్బరు కొలువు కూటము నకు వచ్చియున్నట్లయితే, లేదా ఇంగ్లాండుకు గాని, ఫ్రాంసుకుగాని పోయి ఉన్నట్లయితే వారికి ఎన్నో మార్పులు కనిపించి ఉండును. కొన్ని మార్పులను వారామోదించి యుందురు. కొన్ని తిరస్కరించి యుందురు. ఏమైనా మొత్తంమీద బాహ్య రూపములో, అభిప్రాయము లలో ఎక్కువ భేదములుండవు. కాబట్టి వారు ప్రపంచాన్ని పోల్చుకొని ఉందురు. మరిన్నీ బాహ్య రూపాన్నిబట్టి చూస్తే ఈ కాలమునకు మనము తగమనే అభిప్రాయము పూర్తిగా వారికి కలిగి ఉండదు. వారు ప్రయాణం చెయ్యవలసివస్తే గుర్రమునెక్కిగాని, గుర్రపు బండిలో కూర్చుని గాని, వారి కాలములో చేసినట్లే ప్రయాణము చేసి ఉందురు. ప్రయాణ కాలములోకూడా తేడా ఉండదు.

కాని ఈ ముగ్గురిలో ఎవరైనా మన కాలమునాటి ప్రపంచమునకు వచ్చి ఉన్నట్లయితే వారు ఆశ్చర్య మగ్న మానసులగుదురు. వారి ఆశ్చర్యములో తరుచు బాధారేఖలు తోచవచ్చును. నేటి కాలమున మనుష్యులు మిక్కిలి వేగముగా పోవు గుర్రముకన్నను, శరవేగము కన్నను ఎక్కువ వేగముగా ప్రయాణము చేయుచుండుట అతడు చూచును. రైళ్ళమీద, స్టీమర్లమీద, కార్లమీద, విమానములమీద నేటి ప్రపంచ మందలి మానవులందరూ అతి వేగముగా పోతూన్నట్లు అతడు చూచును. 18 వ శతాబ్దిలో ఉదయించిన పారిశ్రామిక విప్లవము కారణముగా తలయెత్తిన కొత్త పరిశ్రమలవల్ల తయారైన టెలిగ్రాఫులు, టెలిఫోనులు, వైర్లెస్సులూ నేటి ముద్రాశాలలు ప్రకటించిన అసంఖ్యాక ములగు పుస్తకములూ, వార్తా పత్రికలూ, ఇంకా ఇతర విశేషము లనేకమూ అతడు ఆసక్తితో చూచి వాటినిగురించి తెలిసికొనగోరును. సోక్రటీసుగాని, అశోకుడుగాని, జూలియస్ సీజరుగాని వీటిని చూచి ఆమోదిస్తారో, నిరాకరిస్తారో నేను చెప్పజాలను. కాని తమకాలము

నాడున్న పద్ధతులకన్న ఇవి భిన్నముగా నున్నట్లు మాత్రము వారు తెలుసుకొంటారు.

పారిశ్రామిక విప్లవను ప్రపంచములోనికి మహా యంత్రమును తెచ్చిపెట్టినది. యంత్రయుగమును ప్రవేశపెట్టినది. అంతకుముందు లోకములో యంత్రములు లేకపోలేదు. కాని అవి ఈ కొత్త యంత్రమంత పెద్దవికావు. యంత్రమనగా ఏమి? తాను చేసుకొనే పనికి మానవునకు సహాయము చేసే ఒక పెద్ద ఉపకరణమేయంత్రము. మానవుడు ఉపకరణములు చేసుకొను జంతువు అంటారు. తొలిరోజుల నుండీ అతడు ఉపకరణములను చేస్తూనే ఉన్నాడు. వాటిని బాగుపరిచి వృద్ధి చేయుటకు ప్రయత్నిస్తూనే ఉన్నాడు. తనకన్న ఎన్నిరెట్లో బలముగా ఉన్న జంతువులపై మానవుడు తన ఆధిక్యతను నెరపడానికి కారణమీ ఉపకరణములే. ఉపకరణము ఒక హస్త విశేషము. దానిని మూడవ చెయ్యి అనవచ్చును. యంత్రమొక ఉపకరణ విశేషము. ఉపకరణమున్నూ, యంత్రమున్నూ చేరి మానవుని జంతు సృష్టినుండి పైకి లేవనెత్తినవి. ప్రకృతి బంధమునుండి మానవ సంఘమును విడిపించినవి. ఉపకరణ యంత్రముల సహాయముతో వస్తువులను తయారు చేయుట మానవునకు సులభమనిపించినది. అతడు అధికముగా వస్తువులను తయారు చేసెను. అతనికి తీరిక ఎక్కువ అయ్యెను. ఇందుకు ఫలితముగా నాగరీక కళలున్నూ, విజ్ఞాన శాస్త్రమున్నూ, బుద్ధులున్నూ వికసించినవి.

కాని ఈ మహా యంత్రమువల్లనున్నూ, దాని ననుసరించివచ్చిన యంత్రములన్నిటి వల్లనున్నూ మానవులకు కేవలమూ ఉపకారమే కలిగినదని చెప్ప వీలులేదు. అది నాగరీకాభివృద్ధికి తోడ్పడినమాట నిజమే. దానితోపాటు వినాశన కారులగు భయంకర యుద్ధ మారణ యంత్రములను తయారుచేసి, అనాగరికతాభివృద్ధికిన్నీ తోడ్పడినది. వస్తుసమృద్ధి దానివల్ల కలిగిన మాట నిజమే. కాని ఈ సమృద్ధి జన

సామాన్యమునకు కాదు; ముఖ్యముగా కొద్దిమంది కొరకు మాత్రమే. భాగ్యవంతుల భోగమునకున్నూ, బీదవారి దరిద్రమునకున్నూ మధ్య నుండే అంతరమునది వెనుకటికన్న వృద్ధి చేసినది. మానవుని ఉపకరణముగాను, సేవకుడుగాను ఉండుటకు బదులు అది మానవునకు యజమాని అయినది. ఒక పక్షమున—అదికొన్ని సుగుణములను మానవులకు నేర్పినది—సహకారము, నిర్మాణము, సకాలమున పనులు చేయుట. రెండవ పక్షమున—అది కారణముగా లక్షలాది మానవుల జీవితము ఉత్సాహములేని రోకటిపాట అయినది. సంతోషమూ, స్వేచ్ఛా లేని భారమైనది.

యంత్రమువల్ల కలిగిన ఇబ్బందులకు యంత్రమునేల మనము నిందించవలెను? దానిని దుర్వినియోగము చేసిన మానవుడి దాతప్పు; దానినుండి పూర్తిగా లాభములందలేని సంఘముదా తప్పు. ప్రపంచముగాని, ఏ దేశముగాని పారిశ్రామిక విప్లవమునకు ముందున్న స్థితికి వెళ్ళగలుగుననుట అసంభవము. పారిశ్రామిక పరివర్తనము (Industrialism) వల్ల కలిగిన మేళ్ళు బహుళముగా ఉంటూండగా, దానివల్ల కలిగిన కీళ్ళను వదల్చుకొనుటకై మేళ్ళను వదలుకొనుట వివేకము కాదు. కోరదగ్గది కాదు. ఏమైతేనేమి వచ్చిన యంత్రము రానేవచ్చింది. అది పొమ్మంటే పోదు. కాబట్టి మన కర్తవ్యమేమనగా, మనము పరిష్కరించవలసిన సమస్య ఏమనగా పారిశ్రామిక పరివర్తనమువల్ల కలిగిన మేళ్ళను నిలుపుకోవలెను. దాని కంటియున్న కళంకమును పరిహరించవలెను. దానివల్ల వచ్చే ధనమువల్ల మనము బాగుపడవలెను. ధన సంపాదనకు కారకులైన వారందరికీ సమానముగా ఈ ధనము పంచిపెట్టబడవలెను.

ఇంగ్లాండులోని పారిశ్రామిక విప్లవమును గురించి నీకు చెప్పుటకు ఈ లేఖలో ఉద్దేశించితిని. కాని నా అలవాటు చొప్పున అప్రస్తుత విషయములను గురించి ముచ్చటిస్తున్నాను. పారిశ్రామిక పరివర్తనమువల్ల

కలిగే ఫలితములను చర్చిస్తున్నాను. ఈనాటి ప్రజలను బాధిస్తూన్న ఒక సమస్య నీకు తెలియజెప్పాను. నేటికి వచ్చుటకు ముందు మనము నిన్నటినిగూర్చి తెలుసుకోవాలి. పారిశ్రామిక పరివర్తనమువల్ల కలిగిన ఫలితములను చర్చించుకొనుటకు ముందు అది ఎప్పుడు? ఎట్లు? వచ్చిందో మనము తెలుసుకోవలెను. ఈ విప్లవమెంత ప్రధానమైనదో నీకు నచ్చజెప్పుటకు ఈ ఉపోద్ఘాతమింత పెంచితిని. ఇది పైనున్న రాజులను, పాలకులను మార్చే వట్టి రాజకీయ విప్లవముకాదు. అన్ని తరగతుల ప్రజలకూ, నిజమునకు అందరికీ సంబంధించిన విప్లవమిది. యంత్రమూ, పారిశ్రామిక పరివర్తనమూ సాధించిన విజయము—ఆ యంత్రమును నడిపించిన తరగతి ప్రజల విజయమే. నీకిదివరలో చెప్పినట్లు ఉత్పత్తి సాధనములను తమ వశమునందుంచుకొన్న ప్రజలే ప్రముఖులగుదురు. వెనుకటి కాలములో ప్రధానమగు ఉత్పత్తి సాధనము భూమి కాబట్టి భూమి కలవారే అనగా భూస్వాములే అధికారులుగా ఉండిరి. ఫ్యూడల్ రోజులలో ఇట్లుండెను. భూమిగాక ఇతర సంపద అప్పుడు పొడ చూపింది. అప్పుడు ఈ నూతన ఉత్పత్తి సాధనముల యజమానులతో భూమి కామందులు తమ అధికారాన్ని పంచుకో మొదలుపెట్టారు. ఈ సందర్భమున మహా యంత్రము వచ్చినది. దీనిని స్వాధీనములో ఉంచుకొనే ప్రజా తరగతులు ముందుకు వచ్చి అధికారు లగుట సహజమే కదా. పట్టణములలోని బూర్జువాజా ఎట్లు ప్రాముఖ్య మునకు వచ్చిరో, ఫ్యూడల్ కులీనులతో పోరాడి కొన్నిచోట్ల కొంత విజయము నెట్లు సాధించారో ఈ జాబులలో నీ కనేక పర్యాయములు చెప్పియున్నాను. దాని స్థానమును బూర్జువాజా-నూతన మధ్య తరగతి-ఆక్రమించినదనే భావము బహుశా నీకు కలిగించి ఉంటాను. అట్లాచేసి ఉన్నట్లయితే నేను తప్పు దిద్దుకోవలసి ఉన్నది. ఎందుకంటే మధ్య తరగతులు అధికారమునకు వచ్చుటకు చాలా కాలము పట్టినది. మనము చర్చించుకొను కాలమునాటి కట్లు జరగలేదు. బూర్జువాజా అధికారమును

హస్తగతము చేసుకొనుటకు ముందు ఫ్రాంసులో గొప్ప విప్లవము సంభవించవలసి వచ్చింది. ఇంగ్లాండులో అట్టివిప్లవము తటస్థించునేమో అని భయపడవలసివచ్చింది. 1688 సంవత్సరములో తటస్థించిన ఇంగ్లీషు విప్లవమునకు ఫలితము పార్లమెంటు విజయము. కాని పార్లమెంటులోని సభ్యులు కొద్దిమంది ప్రజలకు మాత్రమే ముఖ్యముగా భూస్వాములకు మాత్రమే ప్రతినిధులు. పట్టణములలో నివసించు పెద్ద వర్తకులు పార్లమెంటులో సభ్యులు కావచ్చును. కాని మొత్తముమీద వర్తక తరగతికి—మధ్య తరగతికి—అందు స్థానము లేదు.

ఇట్లు భూస్వాముల చేతులలో రాజకీయాధికారముండెను. ఇంగ్లాండులోను, ఇతర దేశములలోను ఇట్లే ఉండెను. తండ్రినుండి కొడుకుకు భూమి సంక్రమించుచుండెను. రాజకీయాధికారము ఈ విధముగా వంశపారంపర్యపు హక్కు అయ్యెను. ఇంగ్లాండులోని పాకెటు బరోలను గురించి నీకిదివరలో చెప్పియున్నాను. కొద్దిమంది ఎన్నిక దారులు మాత్రమే ఉండి, పార్లమెంటుకు సభ్యులను ఎన్నుకొను ఎన్నిక వర్గములే ఈ పాకెటు బరోలు. ఈ కొద్దిమంది ఎన్నికదారులైనా ఎవరో ఒకరి ఆధీనమందుందురు. కాబట్టి అట్టివాని పాకెటులో (జేబులో). ఈ బరోలున్నట్లు చెప్పబడును. ఇట్టి ఎన్నికలు హాస్యాస్పదములని చెప్ప నక్కరలేదు. లంచగొండితనము, వోట్లు అమ్ముకొనుట, పార్లమెంటు సీట్లు అమ్ముకొనుట అప్పుడు జరుగుచుండెను. పైకి వచ్చుచున్న మధ్య తరగతిలోని భాగ్యవంతులు కొందరు ఈ విధముగా పార్లమెంటులో సభ్యత్వమును కొనుక్కోవచ్చును. ప్రజా సామాన్యమునకుమాత్రము పార్లమెంటు సభ్యత్వము దుర్లభము. వారికి హక్కులులేవు. అధికారము లేదు. అధికారమును వారు కొనుక్కోనూలేరు. కాన భాగ్యవంతులూ, ఉన్నత స్థితిలో నున్నవారూ వారిని పీడించి వారిని స్వలాభమునకు ఉపయోగించుకొంటూ ఉంటే వారేమిచేయగలరు? పార్లమెంటుసభలో వారేమీ చెప్పుకోడానికి లేదు. పార్లమెంటు సభ్యుల నెన్నుకొనే సంద

ర్భములోనైనా వారేమీ చెప్పడానికి లేదు. ఒకవేళ బయటవారు అసమ్మతిని ప్రకటిస్తే అధికారులకు కోపంగా ఉంటూండేది. అట్టిప్రదర్శనములను పశుబలము నుపయోగించి అణచివేసేవారు. వారు కట్టుగాలేరు. బలహీనముగా, నిస్సహాయులై ఉండిరి. తమ దరిద్ర స్థితీ, బాధలూ దుర్భరమైనప్పుడు వారు చట్టములను మరచి అల్లరిలోకి దిగిరి. ఈ విధముగా 18 వ శతాబ్దిలో ఇంగ్లాండులో అక్రమ ప్రవర్తనమూ, శాసనధిక్కారము అమితముగా ఉండెను. ప్రజల సామాన్య ఆర్థికస్థితి పాడుగా ఉండెను. చిన్న వ్యవసాయ దారులకు నిలువ నీడ లేకుండా చేసి పెద్ద భూస్వాములు వారి భూములను కలుపుకొని తమ భూవసతి వృద్ధి చేసుకో ప్రయత్నించుటచేత వారి ఆర్థిక స్థితి మరీ పాడుగా ఉండెను. గ్రామములకు చెందిన ఉమ్మడి భూములు సైతము బలవంతాన తీసుకోబడ్డవి. ప్రజా సామాన్యముయొక్క కష్టములు ఈ విధముగా పెరిగిపోయినవి. పరిపాలనా కార్యములలో తమకేలాటి సంబంధము లేకుండుట ప్రజలకు కోపకారణముగా ఉండెను. తమకు ఎక్కువ స్వేచ్ఛ కావలెననే కోరిక కూడా వారు అస్పష్టముగా వెల్లడించారు.

ఫ్రాంసులో పరిస్థితి ఇంకా పాడుగా ఉండడంవల్ల అది విప్లవానికి దారి తీసింది. ఇంగ్లాండులో రాజు అంత ప్రధాన పురుషుడు కాడు—ప్రజలలో ఫ్రాంసులోకంటె ఎక్కువమంది అధికారాన్ని పంచుకొన్నారు. ఇంతేకాదు ఫ్రాంసులోవలె ఇంగ్లాండులో రాజకీయాభిప్రాయాలు వృద్ధి నందలేదు. కావుననే ఇంగ్లాండు విప్లవమునుంచి తప్పించుకొన్నది. మార్పులు మాత్రమా దేశములో క్రమేణా ప్రవేశించినవి. పారిశ్రామిక పరివర్తనమువల్ల వేగముగా కలిగిన మార్పులున్నూ, నూతన ఆర్థిక నిర్మాణమున్నూ దేశము పురోగమించుటకు మార్గములైనవి.

18 వ శతాబ్దిలో రాజకీయ పరిస్థితులీవిధముగా నుండెను. ఇతర దేశములనుంచి పనివాళ్లు దిగుటవల్ల ఇంగ్లాండులో పరిశ్రమలు చాలా వృద్ధి నందినవి. యూరోపు ఖండములో చెలరేగిన మతకలహములు

కారణముగా ప్రాటస్టెంటులనేకులు తమతమ దేశములను విడిచిపెట్టి ఇంగ్లాండులో తలదాచుకోవలసిన వారైరి. నెదర్లాండులలో తలయెత్తిన విప్లవాన్ని అణచివేయుటకు స్పానియర్డులు ప్రయత్నించే కాలాన శిల్పులనేకులు నెదర్లాండులనుంచి ఇంగ్లాండుకు పారిపోయివచ్చిరి. అట్టివారు 30,000 మంది ఇంగ్లాండు తూర్పు భాగమున నివాసము లేర్పరచుకొన్నారట. అప్పుడు ఎలిజబెత్తు రాణి ఇంగ్లాండు నేలుచుండెను. పరదేశములనుంచి వచ్చి ఇంగ్లాండులో నివాసము లేర్పరుచుకొన్న ప్రతి ఇంటివారూ ఒక్కొక్క ఇంగ్లీషు వాడికి తమ విద్యలు నేర్పవలెననే షరతు ఎలిజబెత్తు ఏర్పరచెను. బట్టలనేత పరిశ్రమమును వృద్ధి చేసుకొనుటకు ఇంగ్లాండు కీ పద్ధతి సాయము చేసినది. ఈ నేత పరిశ్రమము కాలు తొక్కుకొన్న తరువాత నెదర్లాండుల బట్టలు ఇంగ్లాండుకు రాకూడదని ఇంగ్లీషువారు నిషేధించిరి. ఈ కాలమున నెదర్లాండులు తీవ్రమగు స్వాతంత్ర్యయుద్ధములో మునిగి తేలుచుండిరి. వారి పరిశ్రమలు వెనుకబట్టెను. వెనుకటి రోజులలో అనేక నావలు నెదర్లాండులనుండి బట్టలను నింపుకొని ఇంగ్లాండుకు పోతూ ఉండెడివి. ఇది ఇప్పుడు కట్టుబడింది. సరికదా, ఇంగ్లాండునుండి బట్టలు నెదర్లాండులలోకి ప్రవహించడం మొదలుపెట్టి నానాటికీ వృద్ధి చెందినది.

ఇట్లు "వాలూనుల" తెగవారు బెల్జియంనుండి వచ్చి ఇంగ్లీషువారికి నేతపని నేర్పిరి. తరువాత హ్యూజినాట్లను ప్రాట స్టెంటు కాందిశీకులు ఫ్రాంసునుంచి వచ్చి ఇంగ్లీషువారికి పట్టు నేత పని నేర్పిరి. 17 శతాబ్ది మలి భాగములో యూరోపుఖండమంతటినుండియు నేర్పరులగు పనివాళ్ళు అనేకులు వచ్చిరి. వారినుండి ఇంగ్లీషువారు, కాగితపు పరిశ్రమ, గాజు పరిశ్రమ, యాంత్రిక క్రీడావస్తువులు, గడియారములు, వాచీలు చేయుట మున్నగు విద్యలనేకము నేర్చుకొనిరి.

ఇంతవరకును యూరోపులో వెనుకబడియున్న ఇంగ్లాండీవిధముగా ప్రాముఖ్యమును సంపాదించి భాగ్యవంతమైనది. లండనునగరము

కూడ వృద్ధినంది ప్రసిద్ధ రేవు పట్టణమైనది. అందు వర్తకులూ, వ్యాపారస్థులూ అధిక సంఖ్యాకులు నివసిస్తూ ఉండేవారు. 17 వ శతాబ్ది తొలి రోజులలో లండనెంత గొప్ప రేవుపట్టణమో, వర్తకకేంద్రమో తెలియజేయు కథ ఒకటి ఉన్నది. శిరచ్ఛేదము చేయబడ్డ ఛార్లసు I తండ్రి యగు జేమ్సు I ఇంగ్లాండుకు రాజుగా నుండెను. అతనికి నిరంకుశత్వం మీదా, దైవదత్తాధికారం మీదా నమ్మకం హెచ్చు. అతనికి పార్లమెంటు అన్నా, నడుమంత్రపు సిరితో మిడిసిపడే లండను వర్తకులన్నా కిట్టదు. ఒకమారు కోపముతో అతడు తన కొలువు కూటమును ఆక్స్ఫర్డుకు మారుస్తానని లండను పౌరులను బెదిరించాడు. లండనులో లార్డు మేయరు ఈ బెదిరింపుకు చలించలేదు. అతడిట్లన్నాడు— "ప్రభువుల వారు అనుగ్రహించి థేమ్సు నదిని మాకు అట్టే బెడతారని ఆసిస్తున్నాను."

ఛార్లసు I తో కలహము సాగుచున్న రోజులలో లండనులోని భాగ్యవంతులగు ఈ వర్తకులే పార్లమెంటుకు అండగా ఉండి దానికి అమితంగా ధన సహాయము చేశారు.

ఇంగ్లాండులో వృద్ధిజెందిన ఈ పరిశ్రమలన్నీ కుటీర పరిశ్రమలు. అనగా శిల్పులూ, పనివాళ్ళూ తమ తమ కుటీరములలో పరిశ్రమలు సాగించేవారు. లేదా చిన్న సంఘములుగా ఏర్పాటై పని చేసేవారు. ప్రతీ వ్యాపారమునకూ పనివాళ్ల సంఘములుంటూండేవి. అవి ఇండియాలోని వర్ణములవంటివే; కాని మత చ్ఛాయలందులేవు. పనివాళ్ళల్లో కుశలుడు కొత్తవాళ్ళను తనకింద పెట్టుకొని వారికి పని నేర్పుతూ ఉండేవాడు. నేతపని చేసుకొనేవారికి ఎవరి మగ్గములు వారికే ఉండేవి. నూలు వడకేవాళ్ళకు ఎవరి రాటములు వారికుండేవి. నూలు వడుకు పని ఆ కాలములో బాహాటముగా జరుగుతూ ఉండేది. పనిపాటలు లేని వేళలలో బాలికలూ, స్త్రీలూ నూలు వడుకుతూ ఉండేవారు. ఒక్కొక్కప్పుడు చిన్న ఫాక్టరీలు పనిచేస్తూ ఉండేవి. ఒకచోట కొన్ని మగ్గములు చేర్చి పనివాళ్లు కలిసి నేతపని సాగించేవారు. కాని ఎవరిమగ్గముమీద వారు

పనిచేసుకొంటూ ఉండేవారు. ఇంటివద్ద మగ్గముమీద పని చేసుకోదానికీ, వేరొక చోట పదిమందితో కలిసి నేతపని సాగించడానికీ భేదంలేదు. పెద్ద పెద్ద యంత్రములు గల నేటి కాలపు ఫ్యాక్టరీకిన్నీ ఈ చిన్న ఫ్యాక్టరీలకున్నూ ఎట్టి పోలికాలేదు.

కుటీర స్థితిలో పరిశ్రమలు ఉండి వికసించుట ఒక్క ఇంగ్లాండు లోనేకాదు. పరిశ్రమలున్న ప్రతి దేశములోనూ ఇది పరిపాటిగా జరుగు చుండెను. ఇండియాలో ఈ కుటీర పరిశ్రమలు మిక్కిలి వృద్ధిలో నుండెను. నేడు ఇంగ్లాండులో కుటీర పరిశ్రమలు అంతరించినవనియే చెప్పవచ్చును. కాని ఇండియాలో కుటీర పరిశ్రమలనేక మింకను నిలిచియున్నవి. మహా యంత్రమున్నూ, కుటీర మందలి మగ్గమున్నూ ఇండియాలో నేడు ఒకదాని ప్రక్క ఒకటి వృద్ధి చెందుచుండుట చూడ వచ్చును. వాటి సామ్యభేధములను గమనించవచ్చును. మనము ధరించు వస్త్రము ఖాదీకదా. చేతితో తీసిన దారముతో చేనేత మగ్గముమీద నేయ బడినదిది. కాబట్టి ఇది ఇండియాలోని మట్టిగుడెసెలనుండియు, కుటీర ముల నుండియు వచ్చినదన్నమాట.

నూతన యాంత్రిక సృష్టములు (Mechanical inventions) వచ్చుటవల్ల ఇంగ్లాండులోని కుటీర పరిశ్రమల ప్రాభవము తగ్గెను. మనుష్యుడు చేసేపనిని యంత్రములు నానాటికీ అధికముగా చేయ మొదలుపెట్టినవి. తక్కువ శ్రమతో ఎక్కువ వస్తువులు సులభముగా తయారు కాజొచ్చినవి. ఈ సృష్టములు 18 వ శతాబ్ది మధ్యలో వచ్చి నవి. వీటినిగురించి తరువాతి జాబులో విచారింతము.

టూకీగా ఖాదీ ఉద్యమమును గురించి సూచించి యుంటిని. దానిని గురించి విపులముగా ఇక్కడ చెప్పను. కాని ఒక్క విషయము చెప్ప వలసి యున్నది. ఈ ఉద్యమమున్నూ, రాటమున్నూ మహాయంత్ర ముతో పోటీచేయ నుద్దేశింప బడలేదు. రాటమంటే మధ్యయుగములకు పోవడమనిన్నీ, యంత్రములను నిషేధించడమనిన్నీ, పారిశ్రామిక

పరివర్తనవల్ల కలిగే లాభములను తిరస్కరించడమనిన్నీ చాలామంది భ్రమపడతారు. ఇదంతా తప్పు. మన ఉద్యమము పారిశ్రామిక పరివర్తనమునకుగాని, యంత్రములకుగాని, ఫ్యాక్టరీలకుగాని వ్యతిరేకము కాదు. ప్రతివిషయమందలి ఉత్తమాంశములను, శీఘ్రముగా ఇండియా గ్రహించవలెననే మన ఆశ. కాని దేశకాల పరిస్థితులనుబట్టి. రైతుల కడు బీద స్థితిని గమనించి, తీరిక సమయములో నూలు వడకమని వారిని ప్రోత్సహిస్తున్నాము. ఈ విధముగా వారు తమ పరిస్థితులు కొద్దిగా చక్కజేసికోవచ్చును. మనదేశ ధనమును అమితముగా మింగివేస్తూన్న విదేశ వస్త్రములపై అంతగా ఆధారపడవలసిన అవసరముండదు.

## 98
## పారిశ్రామిక విప్లవము ఇంగ్లాండులో ప్రారంభమగుట

సెప్టెంబరు 27, 1932

ఉత్పత్తి పద్ధతులలో బ్రహ్మాండమగు మార్పులు కలగడానికి కారణభూతమైన యాంత్రిక సృష్టముల కొన్నింటినిగూర్చి యిక్కడ నీకు చెప్పెదను. ఒక మిల్లులోగాని, ఫ్యాక్టరీలోగాని వాటిని మనము చూచి నప్పుడు సామాన్యముగా కనిపిస్తవి. కాని మొట్టమొదట వాటిని ఊహించడం, సృష్టించడం చాలా కష్టమైనపని. 1738 లో ఈ సృష్టములలో మొదటిది వచ్చెను. "కే" అనువాడు బట్టలు నేయుటకై "తురి" (Flying shuttle) అను సాధనమును కనిపెట్టెను. ఇది కనిపెట్టుటకు ముందు కండెను చేతబుచ్చుకొని నేతనేయువాడు దారమును పడుగు పోగులగుండా మెల్లగా తీసుకొని పోవుచుండెను. తురిని కనిపెట్టిన పిమ్మట ఈ పని శీఘ్రముగా జరుగు చుండెను. కాన ఉత్పత్తి అయే సరకు రెట్టింపయ్యెను. ఇట్లు త్వరగా నేతపని చేయుటకు దారము

ఎక్కువ కావలసి వచ్చెను. నూలు తీయువారు కావలసిన దారమును సకాలమునకు ఇవ్వలేకుండిరి. కాన దారము త్వరలో తయారు చేయుటకు మార్గములు వెదుకజొచ్చిరి. 1764 లో హార్‌గ్రీవ్సు జెన్నీ రాటము సృష్టించిన పిమ్మట ఈ సమస్య కొంతవరకు పరిష్కారమైనది. రిచర్డు ఆర్క్‌రైట్ మున్నగువారి సృష్టములు తరువాత వచ్చెను. నీటి శక్తి ఉపయోగించబడెను. పిమ్మట కొంతకాలమునకు ఆవిరిశక్తి ఉపయోగించబడెను. ఈ సృష్టములన్నియు తొలుదొల్త ప్రత్తి పరిశ్రమ పట్ల వినియోగింపబడుటవల్ల ఫాక్టరీలు, ప్రత్తి మిల్లులు లేచినవి. కొత్త పద్ధతులను అవలంబించిన తరువాతి పరిశ్రమ ఉన్ని పరిశ్రమ.

1765 లో జేమ్సువాట్ ఆవిరి యంత్రమును తయారుచేసెను. ఇది ఒక గొప్ప విశేషము. నాటినుండియు ఫ్యాక్టరీ ఉత్పత్తికి ఆవిరి శక్తి నుపయోగించ మొదలుపెట్టిరి. కొత్త ఫ్యాక్టరీలకు నేల బొగ్గు ఇప్పుడు కావలసి వచ్చెను. కాబట్టి బొగ్గు పరిశ్రమ వృద్ధియైనది. బొగ్గు వాడుక వృద్ధి కాగా ఖనిజము (Ore) నుంచి ఇనుమును విడదీయుటకు కొత్త పద్ధతు లవలంబించబడినవి. అందువల్ల ఇనుము పరిశ్రమ వేగముగా వృద్ధియైనది. బొగ్గు మళ్ళ వద్ద కొత్తఫ్యాక్టరీలు కట్టబడినవి. అక్కడ బొగ్గు చౌకగా దొరుకుట అందుకు కారణము.

ఇట్లు మూడు గొప్ప పరిశ్రమలు ఇంగ్లాండులో వృద్ధినందెను— నేత పరిశ్రమ, ఇనుము పరిశ్రమ, బొగ్గు పరిశ్రమ. బొగ్గు ప్రాంతములందును, ఇతర ఉచిత స్థలములందును ఫ్యాక్టరీలు లేచెను. దీనితో ఇంగ్లాండు స్వరూపము మారిపోయెను. పచ్చని చెట్లతో విలసిల్లు చక్కని పల్లె ప్రాంతములకు బదులు పలు ప్రదేశములలో పొగ వెలువరించి, చుట్టుపట్టులను కాటుక మయము చేయు పొడుగు చిమ్నీలు గల కొత్త ఫ్యాక్టరీలు కానవచ్చు చుండెను. బొగ్గు గుట్టలతోను, చెత్త కుప్పలతోను పరివేష్టింపబడిన ఈ ఫ్యాక్టరీలు చూచుటకింపుగాలేవు. ఈ ఫ్యాక్టరీలచుట్టును లేచుచున్న కొత్త పట్టణములైనను అందముగాలేవు.

యజమానుల ఆశయము డబ్బు చేసుకొనడమే కాబట్టి అవి ఎట్లా ఉన్నా వారు సహించి ఊరుకొనిరి. అవి పెద్దగా, అందవికారముగా, మురికిగా ఉండెను. తిండి చాలని కూలివాళ్లు వీటినీ సహించి ఉండవలసివచ్చినది. ఫ్యాక్టరీలలోని అనారోగ్య పరిస్థితులనూ సహించి ఉండవలసివచ్చినది.

పెద్ద భూస్వాములు చిన్న రైతులను నిలువ నీడలేకుండా చేసి పంపించివేశారనిన్నీ, నిరుద్యోగము పెరిగి అల్లరులూ, అక్రమ ప్రవర్తనమూ ఇంగ్లాండులో చెలరేగినవనిన్నీ నీకు చెప్పియున్నాను. మొట్ట మొదట ఈ కొత్త పరిశ్రమలవల్ల పరిస్థితులు మరీ పాడైనవి. వ్యవసాయము దెబ్బతిన్నది. నిరుద్యోగము వృద్ధియైనది. కొత్త విషయములు కనిపెట్టేరంటే చేతితో చేసే పనులను యంత్రసాధనలు చేయ మొదలుపెట్టినవన్నమాట. అందుచే పనివాళ్ళను ఇంటికి పంపివేయవలసి వచ్చేది. అది వారికి ఆగ్రహము కలిగించేది. కాన వారిలో పలువురు యంత్రములను ద్వేషించ మొదలుపెట్టారు. వాటిని భగ్నము చెయవలెననికూడా ప్రయత్నించారు. వీరికి యంత్ర భగ్నకారులనే పేరుకూడా వచ్చింది.

యూరోపులోని యంత్ర భగ్నోదంతము చాలా దీర్ఘమైనది. 16వ శతాబ్దిలో అది ప్రారంభమైనది. జర్మనీలో ఒక సాధారణ యంత్రమగ్గము సృష్టింపబడినది. 1579 లో ఒక ఇటాలియన్ పురోహితుడు వ్రాసిన ప్రాచీన గ్రంథములో ఈ యంత్రమును గురించిన వృత్తాంతమిట్లున్నది. డాన్‌జిగ్‌లోని పురపాలక సభవారు "ఈ యంత్రము వాడుటవలన చాలామంది పనివాళ్ళకు పనిలేకుండా పోతుంది. కాబట్టి దానిని నాశనము చేయించారు. దానిని సృష్టించిన వానిని రహస్యముగా పీక నులిమి చంపించారు; లేదా నీటిలో ముంపించి చంపించారు." యంత్రమును సృష్టించిన వానిని ఈ విధముగా శీఘ్రముగా కడతేర్చినప్పటికీ ఈ యంత్రము మళ్ళీ 17వ శతాబ్దిలో తల యెత్తింది. ఇది కారణముగా యూరోపునందంతటా అల్లరులు చెలరేగినవి. అనేక

ప్రదేశములలో దానిని వాడరాదని శాసనములు పుట్టినవి. దానిని బహిరంగముగ తగులబెట్టిరికూడా. మొట్టమొదట ఈ యంత్రమును సృష్టించినప్పుడే దీనిని వాడుకలో పెట్టి ఉన్నట్లయితే ఇతర సృష్టములుకూడా వెనువెంటనే వచ్చెడివి. యంత్రయుగము మరి కొంత శీఘ్రకాలములో వచ్చేది. దానిని అప్పుడు వాడలేదంటే పరిస్థితులప్పటికి పరిపక్వము కాలేదన్నమాట. అనుకూల పరిస్థితులు సంభవించినప్పుడు యంత్రములు వచ్చినవి. ఎన్ని అల్లరులు జరిగినా అవి స్థిరపడ్డవి. యంత్రమును చూచి పనివాళ్ళు ఆగ్రహించుకోవడం సహజమే. క్రమేణా, యంత్రములో తప్పు లేదనిన్నీ, కొద్దిమంది లాభము కొరకు దానిని ఉపయోగించడములోనే తప్పు ఉన్నదనిన్నీ వారు గ్రహించారు. ఇంగ్లాండులో యంత్రాభివృద్ధిన్నీ, ఫ్యాక్టరీల అభివృద్ధిన్నీ ఎట్లు కలిగినవో మనమిప్పుడు విచారింతము.

ఈ కొత్త ఫ్యాక్టరీలు కుటీర పరిశ్రమల ననేకమునూ, పనివాళ్ళనూ కబళించి వేసినవి. ఇంటపని చేసుకొనే వీరు యంత్రముతో పోటీ చేయుట సాధ్యము కానిపని. కాబట్టి తమ ప్రాత వృత్తులనూ, వ్యాపారములనూ వదులుకోవలసి వచ్చినది. అంతేకాదు. తాము ద్వేషించే ఫ్యాక్టరీలలోనే వారు కూలికి కుదురుకోవలసి వచ్చినది. లేదా నిరుద్యోగులతో చేరవలసి వచ్చినది. కుటీర పరిశ్రమల వినాశము హఠాత్తుగా రాకున్నా శీఘ్రముగా వచ్చినది. శతాబ్ది చివరకు—అనగా 1800 ప్రాంతమున—పెద్ద ఫ్యాక్టరీలు అంతటా తలయెత్తినవి. మరి 30 సంవత్సరముల తరువాత ఇంగ్లాండులో స్టీఫెన్‌సన్ కనిపెట్టిన రాకెట్ అనే ఆవిరి ఇంజనుతో రైల్వేలు ప్రారంభమైనవి. ఈ విధముగా యంత్రము దేశమంతా అలముకు పోయినది. ప్రతి పరిశ్రమలోనూ, మానవ జీవితమునకు సంబంధించిన ప్రతి సంస్థలోనూ అది ప్రవేశించింది.

యంత్ర స్రష్టల పేళ్ళు అన్నీ నేను చెప్పలేదు కాని వీరందరూ చేతి పనులు చేయు తరగతి ప్రజలే. ఈ తరగతి ప్రజలనుండియే తొలి

నాటి పరిశ్రమల నాయకులుకూడా వచ్చిరి. వారు చేసిన సృష్టములకు ఫలితముగానున్నూ, వాటి ననుసరించివచ్చిన ఫ్యాక్టరీ పద్ధతి వల్లనున్నూ, యజమానులకునూ, కూలివాళ్ళకునూ మధ్యనుండు అంతరము ఎక్కువైనది. ఫ్యాక్టరీలో పనిచేయు కూలివాడు యంత్రములో ఒక భాగమైనాడు. తనకు అర్థము కానట్టిన్నీ, తాను స్వాధీనములో ఉంచుకోలేనట్టిన్నీ ఆర్థిక శక్తుల చేతులలో అతడు కీలుబొమ్మ అయినాడు. కొత్త ఫ్యాక్టరీలు తమతో పోటీకి దిగినవనిన్నీ, చవుకగా వస్తువులను చేసి అమ్ముచున్నవనిన్నీ, పాతకాలపు పనిముట్లతో తాము అట్లా చెయ్యలేమనిన్నీ పనివాళ్ళూ, శిల్పులూ కనిపెట్టి ఈ ఫ్యాక్టరీలవల్ల తమకు మోసము వస్తోందని అనుకున్నారు. తామే మీ తప్పు చెయ్యకపోయినా తమ వృత్తులు తాము కట్టిపెట్టుకోవలసివచ్చింది. తమ పాతవృత్తులే తాము నిగ్రహించుకోలేనప్పుడు కొత్త వృత్తులలోనికి దిగి నిగ్రహించుకోగలరా? కాబట్టివారు నిరుద్యోగులలో చేరి కడుపు మాడ్చుకోవలసి వచ్చినది. "ఫ్యాక్టరీ యజమానియొక్క డ్రిల్లు చెప్పే సార్జెంటే ఆకలి" అంటారు. ఆకలి చివరకు వారిని ఉద్యోగము కొరకై కొత్త ఫ్యాక్టరీల లోనికి తోలింది. యజమానులు వారిపట్ల ఎట్టి దయా దాక్షిణ్యములూ చూపలేదు. వారికి పని చెప్పారు. కాని కూలి కిట్టదు. ఈ కూలికి ఆసించి ఈ దురదృష్టవంతులు ఫ్యాక్టరీలలో చెమట ఓడ్చి పనిచేసేవారు. ఫ్యాక్టరీలు వారి రక్తము పీల్చివేశేవి. గాలిలేని అనారోగ్యకరమగు ప్రదేశములలో స్త్రీలూ, పసిపిల్లలూ చాలా గంటలు పనిచేసేవారు. చాలా మంది అలసటవల్ల స్మృతి తప్పి పడిపోయేవారు. పురుషులు భూగర్భములో బొగ్గు గనులలో పగలంతా పనిచేసేవారు. నెలల తరబడి ఎండ మొగము చూడకుండా వారుండేవారు.

దీనికంతా యజమానుల క్రౌర్యము కారణమని అనుకోబోకు. బుద్ధిపూర్వకముగా వారు క్రూరముగా ఉండలేదు. ఆ పద్ధతి అటువంటిది. వర్తకము వృద్ధి చేసుకోవాలనీ, దూర ప్రపంచ వ్యాపార

రంగములను ఇతర దేశములనుండి స్వాధీనము చేసుకోవాలనీ వారు తీవ్రకృషి చేశారు. ఎట్టి కష్టములువచ్చినా భరించడానికి వారు సిద్ధమై ఉన్నారు. కొత్త ఫ్యాక్టరీలు కట్టడానికీ, యంత్రములు కొనడానికీ బోలెడంతడబ్బు ఖర్చవుతుంది. ఫ్యాక్టరీలో సరుకు తయారై, మార్కెట్టులో సరుకు చెలామణీ అయిన పిమ్మట వారికి చేతికి డబ్బు తిరిగి వస్తుంది. కాబట్టి ఫ్యాక్టరీ యజమానులు వాటిని నిర్మించడానికి డబ్బు చాలా పొదుపుగా వాడుకోవాలి. సరుకు చెలామణీ అయిన పిమ్మట వచ్చే సొమ్ముతో వారు కొత్త ఫ్యాక్టరీలు కట్టుకుంటూపోయారు. అందరి కన్న ముందుగా పారిశ్రామిక పరివర్తనము వచ్చుటవల్ల ఇతర దేశముల కంటె వారు ముందుండుట తటస్థించింది. ఈ పరిస్థితులను పురస్కరించుకొని లాభము తియ్యవలెనని పూనుకొన్నారు. లాభము తీశారు కూడాను. వర్తకము వృద్ధి చేసుకోవాలనీ, ఎక్కువడబ్బు చేసుకోవాలనీ పిచ్చి కోర్కెలు పెట్టుకొని వారు దిక్కులేని పనివాళ్లను హింసబెట్టారు. ఈ పనివాళ్ళ కష్టమే వారికి డబ్బు చేసిపెడుతోంది.

ఈ విధముగా ఈ కొత్త పరిశ్రమ పద్ధతి బలహీనులను హింసించి, బలవంతులు బాగుపడుటకు అనుకూలముగా ఉన్నది. చరిత్ర పొడుగునా బలవంతులు బలహీనులను బాధపెట్టి లాభము పొందడము మనము చూస్తున్నాము. ఫ్యాక్టరీ పద్ధతివల్ల ఇది మరీ సులభమయింది. దేశశాసనము ప్రకారము బానిసత్వముండరాదు. కాని క్రియకు తిండిలేక బాధపడు కూలివాడు, ఫ్యాక్టరీలో కూలికి కుదురుకొన్న బానిస. వెనుకటి బానిసకన్న ఏ విధముగానూ మెరుగుగాలేడు. శాసనము యజమానికే అనుకూలముగా ఉంటోంది. మతము సైతము అతని పక్షమే మాట్లాడింది. ఇహలోకములో కష్టములు సహిస్తే పరలోకముతో స్వర్గ సుఖములు కలుగుతవని చెప్పింది. పాలక తరగతుల అనుకూల సిద్ధాంతము ప్రకారము సంఘములో బీదవారు ఉండుట అవసరము. కాబట్టి వారికి తక్కువ కూలి యిచ్చుట దోషముకాదు.

ఎక్కువ కూలి యిచ్చినట్లయితే బీదవారు సుఖముగా కాలక్షేపము చేస్తారే కాని కష్టపడిపనిచేయరు. ఇట్టి ఊహలు యజమానులకు లాభకరమైనవీ, సుఖముకలిగించేవిన్నీ. ఫ్యాక్టరీ యజమానులయొక్కా, ఇతర భాగ్య వంతులయొక్కా క్షేమమునకు ఇట్టి ఊహలు అనుకూలముగా ఉన్నవి.

ఈ కాలమును గురించి చదువుటకు ఉత్సాహకరముగాను, లాభ కరముగాను ఉంటుంది. ఎన్నో విషయములు తెలుసుకోవచ్చును. యంత్రములద్వారా సరుకు ఉత్పత్తి చేయడంవల్ల ఆర్థిక శాస్త్రములోనూ, సంఘములోనూ బ్రహ్మాండమైన మార్పులు వచ్చినవి. సంఘనిర్మాణము తలక్రిందులైనది. కొత్తతరగతుల ప్రజలు ముందుకు వచ్చారు. పలుకు బడి సంపాదించారు. శిల్పులు ఫ్యాక్టరీలలో కూలివాళ్లయారు. ఇంతే కాదు. నూతన ఆర్థిక పరిస్థితులను పురస్కరించుకొని, ప్రజల అభి ప్రాయములు మత విషయములోనూ, నీతి విషయములోనూ మార్పు జెందుతవి. ప్రజా సామాన్యముయొక్క నమ్మకములు వారిశ్రేయస్సుకూ, వారి తరగతి ప్రజల శ్రేయస్సుకూ అనుగుణముగా ఉంటవి. తమకు పలుకుబడి ఉన్నట్లయితే తమ శ్రేయస్సుకు రక్షకముగా ఉండే శాసన ములే చేసుకో పూనుకుంటారు. ఇదంతా ధర్మ సమ్మతముగా కనిపించే టట్లే చేస్తారు. శాసనము చేయడానికి ప్రధానోద్దేశము మానవకల్యాణమే అని ఖండితముగా చెప్పుతారు. ఇండియాలోని ఇంగ్లీషు రాజ ప్రతినిధు లున్నూ, ఇతర ఉద్యోగస్థులున్నూ చెప్పే ధర్మ పన్నాలు మనకు అనుభవైక వేద్యమే. ఇండియా శ్రేయస్సుకు వారెట్లు పాటుపడు చున్నదీ మనకు నిరంతరమూ చెప్పుతూనే ఉన్నారు. ఇట్లా చెప్పుతూ వారు ఆర్డినెన్సులతోనూ, బాకులతోను మనలను పరిపాలిస్తున్నారు. మన ప్రజల రక్తము పీల్చివేస్తున్నారు. మన జమీందారులు తమరైతు లను ప్రేమిస్తూన్నట్లు చెప్పుతారు. కాని వారిని పీడించి సిస్తు వసూలు చెయ్యడానికి జంకరు. చివరకు రైతులకు ఏమీ మిగలదు—కృశించిన తమ దేహాలుతప్ప. మన పెట్టుబడిదారులూ, ఫ్యాక్టరీ యజమానులూ

తమ కూలివాళ్ళపట్ల తమకు సద్భావమున్నట్లు చెప్పుతారు. కాని ఈ సద్భావము, కూలీ డబ్బు హెచ్చించడానికిగాని, కూలీలకు సదుపాయములు చేయడానికిగాని క్రియకు పనికిరాదు. లాభములతో కొత్త భవనములు లేస్తవేకాని కూలివాని మట్టిగుడిసె బాగుపడదు.

తమ లాభము కొరకని మనుష్యులు తమ్ము ఎట్లు మోసగించుకొని ఇతరుల నెట్లా మోసగిస్తారో చూస్తే ఆశ్చర్యకరంగా ఉంటుంది. 18 వ శతాబ్దిలోనూ, తరువాతనూ కూలీల స్థితిని బాగుపరచే ప్రయత్నాలను ప్రతిఘటిస్తూ ఇంగ్లీషు యజమానులు ఈ విధంగా ఉండిరి. ఫ్యాక్టరీ శాసనములు వారు చేయరాదన్నారు. కూలీల వసతి బాగుచేసే సంస్కరణములు పనికిరావన్నారు. కూలీల కష్టములను తొలంగించే బాధ్యత సంఘమునకు లేదన్నారు. సోమరిపోతులే బాధపడతారనే అభిప్రాయం వారికి సంతృప్తి నిచ్చింది. ఏమైనా కూలీలు తమవంటి మానవులే అని వా రూహించలేదు. వారొక కొత్త సిద్ధాంతమును లేవనెత్తారు. అది "వ్యక్తుల వ్యాపారములలో ప్రభుత్వము కలుగజేసికొనకుండుట" (లేసేఫేర్). అనగా వారు తమ ఇష్టము వచ్చినట్లు తమ వ్యాపారమును, ప్రభుత్వముయొక్క జోక్యము లేకుండ, సాగింపుకొనగోరిరి. ఇతర దేశములకన్న ముందుగా సరుకు తయారు చేయుటకు ఫ్యాక్టరీలు వారు ప్రారంభించారు. కాబట్టి వారికి నాయకత్వం వచ్చింది. వారు కోరింది ఎట్టి అభ్యంతరములూ లేకుండా ధనార్జనముచేయుట. లేసేఫేర్ ఒక విధముగా దైవదత్త సిద్ధాంతమైనది. సద్వినియోగము చేసుకోగలగాలిగాని ప్రతీ వానికీ అది సదవకాశము ఇచ్చినట్లు భావింపబడింది. ముందుకు చొచ్చుకు పోవడానికి ప్రతీ పురుషుడూ, స్త్రీ ప్రపంచాన్ని ధిక్కరించాలి. అందు పలువురు కృత కృత్యులు కాలేకపోతే చేసేదేమున్నది.

ఈ జాబులో, నాగరీకతకు ఆధారభూతమైన అన్యోన్య సహకారము ఎట్లు వృద్ధి పొందినదో చెప్పియున్నాను. కాని లేసేఫేర్ సిద్ధాంతమున్నూ, పెట్టుబడి పద్ధతిన్నీ (Capitalism) వన్యమృగముల

చట్టమును ప్రవేశపెట్టినవి. కార్లైలు దీనినే "పంది సిద్ధాంత" మన్నాడు. వ్యాపారమునందునూ, జీవితమందును ఈ కొత్త చట్టాన్ని ప్రవేశపెట్టిన వారెవరు? కార్మికులు కారు. పాపము వారీవిషయములో చెప్పుకొనే దేమీలేదు. పరిశ్రమల యజమానులే. తాము లాభములు సంపాదించి కృతార్థులై, తమ వ్యవహారములలో ఇతరులు, తెలివితక్కువగా దయాదాక్షిణ్యముల పేరుచెప్పి కలుగచేసికోకూడదన్నారు. స్వేచ్ఛ పేరు చెప్పినీ్న, ఆస్థిపై ఉండు హక్కులపేరు చెప్పినీ్న వారు మనుష్యులు కాపురముండు ఇండ్లు తప్పనిసరిగా పరిశుభ్రముగా ఉంచుకోవలెని చెప్ప కూడదన్నారు: సరుకులో కల్తీ కలిపినా కలుగజేసుకో కూడదన్నారు.

నేను పెట్టుబడి పద్ధతి అనే మాట వాడియుంటిని. చాలాకాలము నుంచి అన్ని దేశాలలోనూ ఒక విధమగు పెట్టుబడి పద్ధతి ఉండెను—అనగా కూడబెట్టిన ధనముతో పరిశ్రమలు సాగిస్తూ ఉండేవారు. కాని మహా యంత్రాగమనమువల్లనూ, పారిశ్రామిక పరివర్తనమువల్లనూ ఫ్యాక్టరీలలో ఉత్పత్తికి ఎక్కువ ధన మొత్తములు కావలసివచ్చెను. దీనిని "పారిశ్రామిక మూలధనము" (Industrial capital) అనేవారు. పారిశ్రామిక విప్లవానంతరము వృద్ధిజెందిన ఆర్థిక విధానమును తెలియజేయుటకు పెట్టుబడి పద్ధతి (Capitalism) అనే పదము నిప్పుడు వాడుతున్నారు. ఈ విధానము ప్రకారము పెట్టుబడిదారులు—అనగా మూలధనము కలవారు—ఫ్యాక్టరీలను తమ స్వాధీనములో నుంచుకొని లాభములు అనుభవిస్తున్నారు. పారిశ్రామిక పరివర్తనముతోపాటు పెట్టుబడి పద్ధతికూడా సోవియట్ యూనియన్‌లోనూ, మరిఒకటి రెండు ప్రదేశములలోనూ తప్ప, ప్రపంచమందంతటా వ్యాపించెను. మొదటి నుంచీ ధనికులకూ, బీదవారికీ మధ్యనుండే భేదమును పెట్టుబడి పద్ధతి రూఢిచేసింది. పరిశ్రమలు యాంత్రికములగుటవల్ల ఉత్పత్తి పెరిగినది. ఎక్కువ ధనము చేజిక్కింది. కాని ఈ ధనము కొద్దిమంది చేతులలోకి మాత్రమే పోయింది—వీరు కొత్త పరిశ్రమల యజమానులు. కార్మికులు

దరిద్రులుగానే ఉండిపోయిరి. మెల్లమెల్లగాకార్మికుల అవస్థ ఇంగ్లాండులో బాగుపడజొచ్చెను. ఇందుకు ప్రధాన కారణము ఇండియాను, ఇతర ప్రదేశములను స్వార్థోపయోగమునకు ఇంగ్లాండు పరిపాలించుట. కాని పరిశ్రమలవల్ల వచ్చు లాభములలో కార్మికుల వాటా మిక్కిలి తక్కువ గానే ఉండెను. పారిశ్రామిక విప్లవమున్నూ, పెట్టుబడి పద్ధతిన్నీ ఉత్పత్తి సమస్యను పరిష్కరించినవి. కొత్తగా వచ్చిన ధనము ఎట్లు పంపకము చేయవలెనను సమస్యను అది పరిష్కరించలేదు. కాబట్టి ఉన్నవాళ్లకూ, లేనివాళ్లకూ మధ్యనుండే పోరాటము నిలిచియుండడమే కాకుండా తీవ్ర రూపాన్నికూడా పొందింది.

పారిశ్రామిక విప్లవము 18వ శతాబ్ది రెండవ భాగములో సంభవించింది. సరిగా ఈ కాలములోనే బ్రిటిషువారు ఇండియాలోనూ, కెనడాలోనూ యుద్ధము సాగిస్తున్నారు. అప్పుడే ఏడు సంవత్సరముల యుద్ధము సంభవించింది. ఈ సంఘటనలకు పరస్పర సంబంధముంటూ వచ్చెను. ప్లాసీ యుద్ధానంతరమూ, తరువాతా తూర్పు ఇండియా సంఘమున్నూ, అందలి ఉద్యోగులున్నూ (క్లైవుజ్ఞాపకమున్నాడా ?) ఇండియా నుంచి బలవంతముగా గ్రహించి పట్టుకుపోయిన అమిత ధన మొత్తముల సహాయముతోనే ఈ నూతన పరిశ్రమలు ప్రారంభించిరి. పారిశ్రామిక పరివర్తనము డబ్బుతో కూడుకొన్న పని అని ఈ జాబులోనే తెలిపియుంటిని. అది ధనమును మింగివేస్తుంది. కొంతకాలమువరకూ లాభములుండవు. అప్పులు తీసుకొనుటవల్లనో, ఇతర మార్గములుగానో కావలసినంత డబ్బు సంపాదించగలిగితేనేతప్ప, పరిశ్రమలు ఫలించి డబ్బు వచ్చేవరకూ దరిద్రమూ, క్లేశమూ తప్పవు. వృద్ధి జెందుచున్న పరిశ్రమలకూ ఫ్యాక్టరీలకూ కావలసిన పెద్ద ధన మొత్తములు ఇండియా నుండి అదునుకు ఇంగ్లాండు సంపాదించగలుగుట దాని అదృష్టమే.

ఫ్యాక్టరీలు కట్టిన పిమ్మట కొత్త కొరతలు పుట్టుకోవలసి వచ్చింది. ఫ్యాక్టరీలకు ముడి పదార్థాలు కావలసివచ్చినవి. ముడిపదార్థా

లను వస్తువులుగా తయారు చేయవలసి ఉన్నది. గుడ్డ తయారు చెయ్యాలంటే పత్తి కావాలి. ఇంతకన్న అవసరమైనవి కొత్త వ్యాపార రంగములు. ఫ్యాక్టరీలలో తయారైన సరుకు ఇక్కడ అమ్మడు పోవలెను. ఫ్యాక్టరీలు మున్ముందుగా కట్టుటవల్ల ఇంగ్లాండు ఇతర దేశముల కన్న ముందు పడింది. ముందుపడ్డా సులభంగా మార్కెట్టులు దొరకకుంటే ఆ దేశము కష్టపడవలసి వచ్చేదే. ఇప్పుడుకూడా బుద్ధిపూర్వకముగా కాకున్నా ఇండియా ఇంగ్లాండుకు కలిసివచ్చింది. ఇండియాలోని పరిశ్రమలను నాశనము చేయడానికి ఇండియాలోని ఇంగ్లీషువారు అనేక మార్గాలవలంబించారు. ఈ విధంగా ఇంగ్లీషు గుడ్డలను ఇండియా మీద బలవంతాన రుద్దారు. ఈ విషయమును గురించి ముందు ముందు విపులముగా చెప్పుతాను.

బ్రిటిషువారు ఇండియాను స్వాధీనములో ఉంచుకొని తమ లాభమునకై అనుకూల పరిస్థితులందు కల్పించుట, ఇంగ్లాండులోని పారిశ్రామిక విప్లవమునకు సహాయ భూతముగా నున్నదనే మాట జ్ఞాపకముంచుకోవలెను,

పందొమ్మిదో శతాబ్దిలో పారిశ్రామిక పరివర్తనము ప్రపంచమన్ని భాగములకూ వ్యాపించెను. ఇంగ్లాండులో అమలులోనున్న పద్ధతుల మీదనే ఇతర దేశములలోనూ, పెట్టుబడిదారుల పరిశ్రమలు వృద్ధి చెందెను. పెట్టుబడిపద్ధతి కొత్త సామ్రాజ్యవాదము (Imperialism) నకు తప్పనిసరిగా దారితీయును. ప్రతిప్రదేశమందూ ముడివస్తువులకోసం, తయారైనసరుకు అమ్మకోడానికి మార్కెట్టులకోసం గోలఎక్కువైనది. ముడి వస్తువులూ, మార్కెట్టూ సంపాదించుటకు సులభమార్గము అన్యదేశాక్రమణమే. కాన ప్రబలజాతులు కొత్తదేశముల నాక్రమించుకోడానికి పెనగులాడుకొన్నారు. ఇండియానూ, సముద్రాధి కారమునూ చేత నుంచుకొన్న ఇంగ్లాండు అనుకూల స్థితిలో నుండెను. సామ్రాజ్య వాదమునుగురించీ, తత్ఫలములను గురించీ ముందు కొంతచెప్పుతాను.

పారిశ్రామిక విప్లవము కారణముగా ఇంగ్లాండులో వస్త్రములను తయారుచేయు లాంకషైరు వారికీ, ఇనుము-యజమానులకూ, బొగ్గు-యజమానులకూ పలుకుబడి నానాటికీ అతిశయించెను.

## 99

# అమెరికా ఇంగ్లాండునుండి విడిపోవుట

అక్టోబరు 2, 1932

18వ శతాబ్దిలో సంభవించిన రెండవ మహావిప్లవమునుగూర్చి ఇప్పుడు విచారింతము—అది ఇంగ్లాడుపై అమెరికా అధినివేశములు చేసిన తిరుగుబాటు. ఇది రాజకీయ విప్లవము మాత్రమే. మనము చర్చించిన పారిశ్రామిక విప్లవమంత ప్రధానమైనదికాదు. యూరోపులోని సంఘము యొక్క పునాదులను ఊపివేసిన, వెంటనే రానున్న ఫ్రెంచి విప్లవ మంత ప్రధానమును కాదు. అయినా అమెరికాలో జరిగిన ఈ రాజకీయ పరివర్తనము ముఖ్యమైనదే. దీనినుండి గొప్ప ఫలములు రానున్నవి. అప్పుడు స్వాతంత్ర్యము సాధించిన అమెరికన్ అధినివేశములు ఇప్పుడు మిక్కిలి ప్రబలమై, మిక్కిలి భాగ్యవంతమై పారిశ్రామికముగా ప్రపంచ మున ప్రథమస్థానము వహించియున్నవి.

"మేఫ్లవర్" పేరు జ్ఞాపకమున్నదా ? 1620 లో ప్రాటస్టెంటులను కొందరిని ఇంగ్లాండునుండి అమెరికాకు తీసుకుపోయిన ఓడ అది. జేమ్సు I నిరంకుశ పరిపాలనము వారికి కిట్టలేదు. అతని మతమున్నూ వారికి నచ్చలేదు. కాస వీరు—ఇంగ్లాండును వదిలిపెట్టి, అట్లాంటిక్ మహా సముద్రమును దాటి కొత్త వింత దేశమునకు పోయిరి. నాటినుండియు వారికి పిల్‌గ్రిం పాదిరీలు అనే పేరు వచ్చినది, అక్కడ ఒక అధినివేశమును ఏర్పరుచుకొని స్వేచ్ఛగా బ్రదుకవలెనని వారు కోరిరి. ఉత్తరమున వారుదిగి ఆ ప్రదేశమునకు న్యూప్లిమత్ అను పేరు పెట్టిరి




1 మెసచూసెట్సు 7 వర్జీనియా
2 న్యూహాంషయిర్ 8 ఉ. కరోలినా
3 న్యూయార్క్ 9 ద. కరోలినా
4 పెన్సిల్వేనియా 10 జార్జియా
5 మేరీలాండు
6 డిలావేర్ 11 కనెక్టికట్
12 రోడ్ దీవులు

వారికన్న ముందుగా, ఉత్తర అమెరికా తీరమున వలస లేర్పరుచు కొనుటకు కొందరు పోయిరి. తరువాత అనేకులు వారివెంటనే వెళ్ళిరి. తూర్పు తీరమున ఉత్తరమునుండి దక్షిణమునకు చిన్న వలసలు ఏర్పడెను. కాతలిక్కు అధినివేశములుండెను. కెవాలియర్ కులీనుల అధినివేశములుండెను. క్వేకర్ అధినివేశములుండెను. పెన్సిల్వేని యా పేరు క్వేకరైన పెన్ అను వానినిబట్టి వచ్చినది. అంతేకాక అందు డచ్చివారు, జర్మనులు, డేనులు, కొందరు ఫ్రెంచివారుకూడా ఉండిరి. అనేక తరహాల మనుష్యులందుండిరి. అందరికన్న ఎక్కువసంఖ్య ఇంగ్లీషువారిదే. డచ్చివారొకపట్టణమునుస్థాపించి దానికి న్యూఆమ్స్టర్డామ్ అని పేరు పెట్టిరి. ఈ పట్టణమును తరువాత ఇంగ్లీషువారు వశము చేసికొని దానికి న్యూయార్కు అనే పేరుపెట్టిరి. ఇప్పుడది ఎంతో ప్రసిద్ధ పట్టణమైనది.

ఇంగ్లీషు అధినివాసులు బ్రిటిషు రాజుయొక్కయు, పార్లమెంటు యొక్కయు అధికారము నంగీకరించియుండిరి. వారిలో పలువురు ఇంగ్లాండులో పరిస్థితులు తమకనుకూలముగా లేని కారణమున ఇండ్లను వదలి వచ్చిరి. వారు రాజు చేసిన పనులనుగాని, పార్లమెంటు పనులను గాని ఆమోదించియుండలేదు. అయినా వారికి తెగతెంపులు చేసికొనుట కిష్టములేదు. దక్షిణ అధినివేశములలో కెవాలియరులును, రాజుపక్షము వారును ఉండిరి. వారికి ఇంగ్లాండుపై అభిమాన మెక్కువగా ఉండెను. అధినివేశ ప్రజలు ఎవరిబ్రతుకు వారు బ్రతుకుచుండిరి. వారిలో సమానత్వమేమీలేదు. 18 వ శతాబ్దికి తూర్పు తీరమున 13 అధినివేశము లుండెను. ఇవి అన్నియు బ్రిటిషువారి అధీనమందుండెను. ఉత్తరమున కెనడా ఉండెను; దక్షిణమున స్పానిష్ వారి ప్రదేశముండెను. ఈ పదమూడు అధినివేశములలోనూ డచ్చివారికీ, డేనిష్‌వారికీ, ఇతరులకూ చెందిన వలసలు ఇంగ్లీషువారే కబళించుటచే అవి వారి వశమందే ఉండెను. ఈ అధినివేశము తీరమునందును, కొంత లోపలికిని ఉండె

నన్నమాట మరువవద్దు. వాటికి ఆవల పడమరగా పసిఫిక్కు మహా సముద్రమువరకూ వ్యాపించిన పెద్ద భూభాగములుండెను. ఈ 13 అధి నివేశములకూ సుమారు పదిరెట్లు వైశాల్యము కలిగియుండెను. ఎర్ర ఇండియనులను తెగలవారి యాధీనములో అవి యుండెను. వారందు నివసించుచుండిరి.

శతాబ్ది మధ్య భాగములో ఇంగ్లాండుకును, ఫ్రాంసుకును ప్రపంచ మందంతటా యుద్ధము జరిగెను. దీనినే ఏడు సంవత్సరముల (1756-1763) యుద్ధమందురు. అది యూరోపులోనేకాదు; ఇండియాలోనూ, కెనడాలోనూకూడా జరిగెను. ఇందు ఇంగ్లాండు విజయము కాంచెను. ఫ్రాంసు కెనడాను ఇంగ్లాండుకు వదులుకోవలసివచ్చెను. ఇట్లు అమెరికా నుండి ఫ్రాంసు తొలగించబడెను. ఉత్తర అమెరికాలోని అధినివేశము లన్నీ ఇంగ్లాండు స్వాధీనములోనికి వచ్చెను. కెనడాలోనున్న క్వ్యాబెక్ రాష్ట్రములోమాత్రము ఫ్రెంచివారు కొందరుండిరి. ఇదివినా అధినివేశము లన్నింటా ముఖ్యముగా ఇంగ్లీషువారే ఉండిరి. నేటికికూడా క్వ్యాబెక్‌లో ఫ్రెంచిభాష మాటాడుదురు. ఫ్రెంచివారి సంస్కృతి అందుకలదు. దాని చుట్టును ఆంగ్లో-సాక్సనులుండిరి. ఇది వింతకాదా? క్వ్యాబెక్ రాష్ట్రము లోని మాంట్రీలు (మౌంటు రాయల్) అనే పెద్ద నగరములో ఉన్నంత మంది ఫ్రెంచి భాష మాటాడే జనం, పారిస్ వినా ఇంకే పట్టణ మందును లేరు.

ఆఫ్రికానుండి అమెరికాకు నీగ్రోలను తెచ్చు నిమిత్తము యూరో పియన్ దేశములు బానిస వ్యాపారము చేసేవారని వెనుక ఒక జాబులో నీకు తెలిపియుంటిని. భయంకరమైన, అసహ్యాకరమైన ఈ వ్యాపారము స్పానిష్, పోర్చుగీసు, ఇంగ్లీషువారల చేతులలో ఉండెను. అమెరికాలో ముఖ్యముగా దక్షిణ రాష్ట్రములందు పొగాకు తోటలు విస్తారముగా పెంచుటవల్ల కూలివాళ్ళు కావలసివచ్చిరి. ఆ దేశమందున్న ఎర్ర ఇండి యనులు దేశద్రిమ్మరులగుటచే ఒక్కచోట నివసించుట కిష్టపడరు.

అంతేకాదు. బానిస పద్ధతులమీద పనిచేయుటకు వారొప్పుకోలేదు; వారు లొంగలేదు. జాతి విచ్ఛేదమైననుసరే అని వారు భీష్మించుకొనిరి. తరువాత ఆ జాతి విచ్ఛేదమైనది. దాదాపు వారు నాశనము చేయబడ్డారు. నూతన పరిస్థితులలో నిలువలేక పలువురు మరణించిరి. ఒకప్పుడు ఖండమందంతటను నివసించిన వీరు నేడు కొద్దిమంది మాత్రము మిగిలియున్నారు.

ఎర్ర ఇండియనులు తోటలలో పనిచేయుటకు సమ్మతించలేదు. కాబట్టి కూలివాళ్ళు కావలసివచ్చిరి. నమ్మటకు వీలుకాని క్రూరపద్ధతుల నవలంబించి, ఆఫ్రికాలో నివసించు దురదృష్టవంతులను వేటాడి సముద్రముమీద అమెరికాకు పంపేవారు. ఈ ఆఫ్రికన్ నీగ్రోలు దక్షిణ రాష్ట్రములైన వర్జీనియా, కరోలినా, జార్జియాలకు పంపబడిరి. అచ్చట వారు ముఖ్యముగా పొగాకు తోటలలో గుంపులు గుంపులుగా చాకిరీ చేయవలసి వచ్చినది.

ఉత్తర రాష్ట్రములలో పరిస్థితులు వేరుగా నుండెను. మేఫ్లవర్‌లో దిగిన పిల్‌గ్రిం పాదిరీల ప్యూరిటన్ సంప్రదాయములు ఇంకను అక్కడ ఆచరణలో ఉండెను. దక్షిణమునందువలె బ్రహ్మాండమగు తోటలక్కడ లేవు. ఉన్న తోటలు ఇమిడికగా ఉండెను. ఇక్కడ తోటలలో పని చేయుటకు బానిసలుగాని, ఎక్కువమంది కూలివాళ్ళుకాని అవసరము లేకుండిరి. కొత్త భూమికి కొరతలేదు. కాబట్టి ప్రతియొక్కడున్నూ ఒక కొత్త పొలము సంపాదించుకొని యాజమాన్యము వహించుచుండెను. కాన ఒక విధమగు సమత్వభావము అధినివాసులలో కుదురుకొనెను.

ఇట్లు ఈ అధినివేశములలో రెండు విధములగు ఆర్థిక విధానములు వృద్ధినందుచుండుట మనము గమనించవచ్చును. చిన్న పొలములు, సమత్వభావముతోను కూడుకొన్న విధానమొక్కటి. పెద్ద పొలములు, బానిసత్వముతోను కూడుకొన్న విధానమొకటి. ఈ రెండు విధానములందును ఎర్ర ఇండియనులకు స్థానములేదు. ఈ ఖండములో

ఆదిమ నివాసులైన వీరు మెల్లగా పడమరగా తొలగిపోవునట్లు బలవంత పెట్టబడిరి. ఎర్ర ఇండియనులలో నున్న కక్షలు, కలతలు కారణముగా ఈ పని సులభముగా జరిగెను.

ఇంగ్లీషు రాజును, ఇంగ్లాండులోని పెద్ద భూస్వాములును ఈ అధినివేశములను—ముఖ్యముగా దక్షిణ అధినివేశములను స్వార్థోపయోగమునకు తిప్పుకొన ప్రయత్నించు చుండిరి. అందువల్ల వారికి వాటిమీద అభిమానమెక్కువ. ఏడు సంవత్సరముల యుద్ధమైన పిమ్మట అమెరికన్ అధినివేశములనుండి ధనమును గ్రహించుటకు ప్రత్యేక ప్రయత్నము చేయబడెను. ఇంగ్లీషు పార్లమెంటులో భూస్వాము లధికముగా నుండిరి. కాన వారు రాజుకు మద్దత్తుగా ఉండి అధినివేశములను స్వార్థోపయోగమునకు తిప్పుకొన ఇష్టపడిరి. ఈ కాలమునందే ఇండియాలో, బెంగాలులో బ్రిటిషువారు ఇండియా వర్తకము సాగకుండ అనేక ఆటంకములు కల్పించి ధనము దోచుకొనుటకు ప్రారంభించిరి.

అధినివాసులు తమపై ఎట్టి నిర్బంధములూ పెట్టరాదనియు, కొత్త పన్నులు వేయరాదనియు అభ్యంతరపెట్టిరి. ఏడు సంవత్సరముల యుద్ధములో విజయముకాంచిన ఇంగ్లీషు ప్రభుత్వము బలముగాను, ఆత్మవిశ్వాసముతోను ఉండెను. కాన వారిఅభ్యంతరములను లెక్కపెట్టలేదు. ఏడు సంవత్సరముల యుద్ధమువల్ల అధినివాసులుకూడ అనేక విషయములు నేర్చుకొనిరి. వివిధ అధినివేశములయొక్కయు, రాష్ట్రముల యొక్కయు ప్రజలు ఒకరి నొకరు కలుసుకొని పరిచయము సంపాదించుకొనిరి. ఇంగ్లీషు సైన్యముతో కలిసి వారు ఫ్రెంచిసైన్యముతో పోరాడి యుండిరి. కాన వారికి యుద్ధము చేయుట అలవడినది. యుద్ధ విషయములు తెలిసినవి. కాబట్టి అధినివాసులుకూడా తమకు అన్యాయము, అపకారము జరుగుననే కారణముచేత లొంగుటకుఇష్టపడలేదు.

1773 లో బ్రిటిషు గవర్నమెంటువారు తూర్పు ఇండియా సంఘమువారి తేయాకును వారికి బలవంతముగా అంటగట్ట ప్రయత్నిం

చుటవల్ల పరిస్థితులు తీవ్రమైనవి. ఇంగ్లాండులోని భాగ్యవంతులనేకులకు తూర్పు ఇండియా సంఘములో వాటాలుండెను. కాబట్టి వర్తక సంఘ క్షేమము వారు కోరుచుండిరి. ప్రభుత్వములో వారికి పలుకుబడి ఉండెను. బహుశా ప్రభుత్వ సభ్యులకుకూడా తూర్పు ఇండియా వర్తకముపై అభిమానముండియుండును. తూర్పు ఇండియా సంఘమువారి తేయాకు అమెరికాకు తీసుకుపోవుటకు, అక్కడ అమ్మకటకు అవకాశములు కల్పించి ఆ సంఘమును ప్రోత్సహించుటకు ప్రభుత్వమువారు ప్రయత్నించిరి. దీనివల్ల స్థానికముగా అధినివాసులు చేయుచున్న తేయాకు వర్తకమునకు దెబ్బ తగిలినది. కాబట్టి వారికి కోపముగా నుండెను. కాన ఈ విదేశీ తేయాకును బహిష్కరించుటకు వారు నిశ్చయించు కొనిరి. 1773 లో తూర్పు ఇండియా సంఘమువారి తేయాకును బోస్టనులో దింపుటకు ప్రయత్నించినప్పుడు అమెరికనులు నిరోధించిరి. కొందరు అధినివాసులు ఎర్ర ఇండియనులవలె వేషములు వేసికొనివచ్చి ఓడలెక్కి తేయాకును సముద్రములోకి త్రోసివేసిరి. ఇది బహిరంగముగా, ప్రజలు గుంపులుగా కూడి చూస్తుండగా, జరిగినది. ప్రజలు ఆమోదించుచుండిరి. ఇది ఇంగ్లాండుకు సవాలు. దీనినిబట్టియే తిరుగుబాటు చేసిన అధినివేశములకును, ఇంగ్లాండుకును యుద్ధము తటస్థించెను.

చరిత్రలో జరిగిన విషయములు సరిగా జరిగినవి జరిగినట్లు మళ్లీ జరుగవు. కాని అప్పుడప్పుడు దాదాపు అట్లు జరుగుట ఆశ్చర్యకరమైన విషయము. 1773 లో బోస్టనువద్ద తేయాకును సముద్రములో కలుపుట చాలా ప్రసిద్ధి గన్నది. దానిని "బోస్టను టీపార్టీ" అన్నారు. రెండున్నర సంవత్సరముల క్రితము బాపుజీ ఉప్పు సత్యాగ్రాహమును, దండీయాత్రను, ఉప్పుదండయాత్రలను ప్రారంభించినప్పుడు అమెరికాలో పలువురకు తమ బోస్టను టీపార్టీ జ్ఞాపకమునకు వచ్చినది. ఈ కొత్త "ఉప్పు పార్టీ"ని ఆ టీపార్టీతో పోల్చ మొదలుపెట్టారు. కాని దానికీ దీనికీ తేడాలు చాలా ఉన్నవి.

ఒకటిన్నర సంవత్సరము కడిచినపిమ్మట 1775 లో ఇంగ్లాండు కును, అమెరికన్ అధినివేశములకును యుద్ధము ప్రారంభమైనది. అధినివేశములు దేనిని కాంక్షించి పోరాడుచున్నట్లు? స్వతంత్రము కొరకుకాదు; ఇంగ్లాండునుండి విడివడి పోవలెననికాదు. పోరాటము ప్రారంభించి ఉభయపక్షములందును రక్తపాతము జరుగుచున్నప్పటికీ అధినివాసులు ఇంగ్లాండు రాజైన జార్జి III ను "కరుణాపూర్ణుడగు చక్రవర్తి" అని సంబోధిస్తూ ఉండేవారు. స్వామి భక్తిగల ప్రజక్రింద తమ్ము భావించుకొనేవారు. ఇది గమనించవలసిన విషయము. తరుచు ఈ విధముగా జరుగుచుండుట నీవు గ్రహింతువు. హాలెండులో, స్పెయిను రాజైన ఫిలిప్ II ని, అతని సైన్యములతో తీవ్రముగా పోరాడుచూ, అతనిని మహారాజని సంబోధించేవారు. చాలా సంవత్సరములిట్లు పోరాడిన పిమ్మటనే హాలెండు తప్పనిసరిగా తన స్వాతంత్ర్యమును ప్రకటించుకోవలసి వచ్చినది. ఇండియాలో చాలా సంవత్సరములపాటు సందేహించి సందేహించి, అధినివేశ ప్రతిపత్తా? లేదా వేరొకటా? అని ఆలోచించి ఆలోచించి చివరకు 1930 జనవరి 1 వ తేదీన మన జాతీయ మహాసభవారు స్వాతంత్రము సాధించుటకే నిర్ణయించారు. నేడుసైతము కొందరు స్వాతంత్ర్యమనే భావమును ప్రకటించడానికే భయపడి ఇండియాలో అధినివేశ ప్రతిపత్తి మంచిదని ప్రసంగిస్తూ ఉన్నారు. కాని చరిత్ర మనకు ఉపదేసిస్తూ ఉంటుంది. ఇట్టి పోరాటములకు ఫలము స్వాతంత్ర్యమేనని హాలెండు, అమెరికాల చరిత్ర సుస్పష్టం చేస్తూన్నది.

1774 లో అధినివేశములకును, ఇంగ్లాండుకును యుద్ధము ప్రారంభమగుటకు కొంచెము ముందు వాషింగ్టన్ అన్నాడు—ఉత్తర అమెరికాలో వివేకము గలవాడెవ్వడున్నూ స్వాతంత్ర్యము కోరడని. అయినా అమెరికన్ ప్రజాప్రభుత్వమునకు వాషింగ్టనే ప్రథమ అధ్యక్షుడు కానున్నాడు. 1774 లో యుద్ధము ప్రారంభమైనపిమ్మట అధి నివేశ కాంగ్రెసులోని సభ్యులు 46 గురు జార్జి III తో తాము స్వామి

భక్తిగల ప్రజలమని చెప్పుకొంటూ రక్తపాతము నాపవలసినదనిన్నీ, శాంతి నెలకొల్పవలసినదనీ కోరారు. ఇంగ్లాండుకును, దాని అమెరికన్ సంతానమునకునూ మధ్య సామరస్యము, సద్భావము నెలకొల్పుటకు కోరుచున్నట్లు తెలుపుకున్నారు. వారు కోరేది ఏదో విధమైన అధినివేశ ప్రతిపత్తి. వాషింగ్‌టన్ చెప్పినట్లే వారున్నూ వివేకిమైనవాడు స్వాతంత్ర్యము కోరడని తెలియజేశారు. దీనికే "ఆలివ్ బ్రాంచి అర్జీ" అంటారు.

కాని రెండు సంవత్సరములకు లోపుగా పై అర్జీని పంపినవారిలో 25 మంది వేరొక పత్రముపై చేవ్రాలు చేసిరి—అది స్వాతంత్ర్య ప్రకటన పత్రము.

కాబట్టి అధినివేశములు స్వాతంత్ర్యముకొరకు యుద్ధమును ప్రారంభించలేదు. పన్నులు విధించవద్దనియు, వర్తకమును నిర్బంధించవద్దనియు మాత్రమే వారు కోరిరి. తమకిష్టములేనిదే తమపై పన్నులు విధించుటకు బ్రిటిషు పార్లమెంటుకు అధికారము లేదని వారు చెప్పిరి. "ప్రాతినిధ్యము లేనిదే పన్నులు విధించరాదు," అనేది వారి ప్రసిద్ధ ప్రవచనము. బ్రిటిషు పార్లమెంటులో వారికి ప్రాతినిధ్యములేదు.

అధినివాసులకు సైన్యములేదు. వెనుకకు తప్పుకొని పోవుటకు వారికి బ్రహ్మాండమైన దేశమున్నది. వారు సైన్యమును కూర్చుకొనిరి. దానికి వాషింగ్‌టన్ సర్వసేనాని అయ్యెను. వారికి కొద్ది విజయములు చేకూరెను. తమ పాత శత్రువును సాధించుటకు అదును దొరికినదని ఫ్రాంసు అధినివాసుల పక్షము చేరెను. స్పెయినుకూడా ఇంగ్లాండుమీద యుద్ధమును ప్రకటించెను. ఇంగ్లాండుకు భారమెక్కువయ్యెను. యుద్ధమనేక సంవత్సరములుసాగెను. 1776 లో అధినివాసులు "స్వాతంత్ర్య ప్రకటనము" చేసిరి. 1782 లో యుద్ధము ముగింపుకువచ్చెను. పారిస్ సంధి పత్రముపై శత్రుపక్షములవారు 1783 లో చేవ్రాళ్ళు పెట్టిరి.

ఈ 13 అమెరికన్ అధినివేశములును స్వతంత్ర ప్రజాప్రభుత్వమయ్యెను—దీనినే అమెరికా సంయుక్త రాష్ట్రములందురు. చాలకాలము

వరకు ప్రతి రాష్ట్రమును ప్రత్యేకముగా స్వతంత్రమన్నట్లు భావించు కొనుచుండెను. ఇతర రాష్ట్రములపై అసూయగా నుండెను. క్రమేణా జాతీయతాభావము వారిలో ఉదయించెను. అది పెద్దదేశము. పడమరగా అది విస్తరించుచునే యుండెను. నేటి ప్రపంచములో ప్రప్రథమ గొప్ప ప్రజాప్రభుత్వమదియే. ఆ కాలముననున్న వేరొక ప్రజాప్రభుత్వరాజ్యము చిన్న దేశమైన స్విట్జర్లాండు. హాలెండులో ప్రజాప్రభుత్వమున్నప్పటికీ కులీనులే దానిని నడుపుచుండిరి. ఇంగ్లాండులో ఏకాధిపత్యము మాత్రమే కాదు. దాని పార్లమెంటు భాగ్యవంతులగు భూస్వాముల చేతులలో నుండెను. కాన అమెరికా సంయుక్త రాష్ట్రములు ఒక క్రొత్త తరహా దేశమైనది. యూరోపు, ఆసియా దేశములకున్నట్లు దానికి పూర్వ చరిత్రలేదు. ప్లాంటేషను పద్ధతీ, దక్షిణమున బానిసత్వమూ మినహా యిస్తే ఫ్యూడల్ పద్ధతికి చెందిన ఆచారములేమీలేవు. వంశపరంపరగా వచ్చు కులీన సంప్రదాయ మక్కడలేదు. బూర్జువాజా అనగా మధ్య తరగతి ప్రజలు వృద్ధినందుటకు ఎట్టి ఆటంకములూ లేవు. ఈ తరగతి త్వరలో వృద్ధినందెను. స్వాతంత్ర యుద్ధ కాలమున దాని జనసంఖ్య 40 లక్షలకు తక్కువ. రెండు సంవత్సరముల క్రితము, 1930 లో, దాని జనసంఖ్య సుమారు 12 కోట్ల 30 లక్షలు.

సంయుక్త రాష్ట్రములకు ప్రథమాధ్యక్షుడు జార్జి వాషింగ్టన్. వర్జీనియా రాష్ట్రములో అతడొక గొప్ప భూస్వామి. ప్రజాప్రభుత్వ ప్రతిష్ఠాపకులని పేరందిన ఆనాటి ప్రముఖులు కొందరు—థామస్‌పైన్, బెంజమిన్ ఫ్రాంక్లిన్, పాట్రిక్ హెన్రీ, థామస్ జెఫర్సన్, ఆడమ్సు, జేమ్సు మాడిసన్. బెంజమిన్ ఫ్రాంక్లిన్ ప్రత్యేకముగా పేర్కొనదగ్గ ఘనుడు. అతడు గొప్ప విజ్ఞాన శాస్త్రవేత్తకూడా. పిల్లలెగరవేసుకొను గాలిపటము లెగరవేసి మేఘములలోని మెరుపు విద్యుత్తేనని అతడు నిరూపించెను.

1776 లో ప్రకటింపబడిన స్వాతంత్ర్య ప్రకటనములో "మానవు

లందరు సమానులై జన్మించుచున్నారు" అనే వాక్యమున్నది. విమర్శించి చూస్తే ఇది సత్యేతరమని తోచును. ఎందుకనగా కొందరు బలహీనముగాను, కొందరు దృఢకాయముతోను పుట్టుచున్నారు. కొందరు ఇతరులకంటె సమర్థులుగాను, తెలివి గలవారుగాను పుట్టుచున్నారు. కాని ఆ వాక్యములో గుప్తమైయున్న భావము స్పష్టమైనదే; మెచ్చుకొనదగ్గదే. యూరోపులో ఫ్యూడల్ విధానమునకు సంబంధించిన హెచ్చు తగ్గులు అధినివాసులు లేకుండా చేసుకోవలెనని కోరారు. అది ఒక విశేషమే. స్వాతంత్ర్య ప్రకటన పత్రమును రచించినవారు బహుశా 18వ శతాబ్దిలో ఫ్రాంసులో వెలిసిన తత్త్వవేత్తలైన వాల్టేరు, రూసో మున్నగువారి భావముల నాస్వాదించియే యుందురు.

"మానవులందరును సమానులై జన్మించుచున్నారు"కాని హక్కులేమీ లేకుండా. పాపము, నీగ్రో జాతివాడు బానిసయై యున్నాడు. వాని మాట యేమిటి? ఈ రాజ్యాంగములో అతనికి స్థానమున్నదా? అతడందు ఇమడడు. ఇంకను ఇముడలేదు. చాలా సంవత్సరములు కడచిన పిమ్మట ఉత్తర, దక్షిణ రాష్ట్రముల మధ్య తీవ్రమైన అంతఃకలహము తటస్థించెను. దానికి ఫలితముగా బానిసత్వము తొలగించబడెను. కాని నీగ్రో సమస్య ఇంకను నిలిచియే యున్నది.

## 100
## పారిస్ చెరసాల (బాస్టీలు) ప్రజల వశమగుట

అక్టోబరు 7, 1932

18వ శతాబ్దిలో సంభవించిన రెండు విప్లవములను గురించి సంక్షేపముగా చూచియున్నాము. ఈ జాబులో మూడవ విప్లవమును గురించి కొంత చెప్పుతాను. దీనిని ఫ్రెంచి విప్లవమంటారు. మూడు

విప్లవములలోనూ ఇదియే ఎక్కువ అలజడి కలిగించింది. ఇంగ్లాండులో ప్రారంభమైన పారిశ్రామిక విప్లవము చాలా ప్రధానమైనది. కాని అది మెల్ల మెల్లగా అల్లుకుపోయెను. చాలామంది దానిని గమనించనేలేదు. ఆ కాలమున దాని ప్రాధాన్యము నెవరూగుర్తించలేదు; ఫ్రెంచి విప్లవము అట్లుగాకుండా పిడుగు పడ్డట్లు హఠాత్తుగా విజృంభించి యూరోపును ఆశ్చర్యచకితము చేసింది. ఆ కాలమున యూరోపును రాజులును, చక్రవర్తులును అనేకమంది పరిపాలించుచుండిరి. ప్రాచీన పవిత్ర రోమక సామ్రాజ్యమంతరించి చాలాకాలమైనది గాని దాని పలుకుబడి గ్రంథములలో నిలిచియుండెను. దాని ఛాయ యూరోపునంతను ఆవరించి యుండెను. రాజులు, చక్రవర్తులు, రాజ సభలు, రాచ నగరులు— వీటితో నిండిన ప్రపంచములోనికి ప్రజాసామాన్యమునుండి భయంకరమగు ఈ వింత మృగము వచ్చి పడినది. బూజుపట్టిన ఆచారములను, హక్కులను అది లెక్కపెట్టలేదు. సింహాసనమునుండి ఒక రాజును అది క్రిందకు త్రోసివేసింది. ఇతరులకిట్టిగతియే పట్టునని బెదిరించింది. ప్రజా సామాన్యము చేసిన ఈ తిరుగుబాటు చూచి—తాము ఇంతవరకూ ఉపేక్షించి, అణచిపెట్టి ఉంచిన ప్రజాసామాన్యము చేసిన ఈ తిరుగుబాటు చూచి—యూరోపులోని రాజులును, ఉన్నత కుటుంబములవారును హడలిపోయేరంటే ఆశ్చర్యమేమున్నది ?

ఫ్రెంచి విప్లవము అగ్ని పర్వతమువలె ప్రేలినది. కారణము లేనిదే, చిరకాలముపాటు పరిపక్వస్థితికి రానిదే విప్లవములుగాని, అగ్ని పర్వతములుగాని ఉన్నట్లుండి ఉబుకవు. హఠాత్తుగా ఉబుకుట చూచి మనము ఆశ్చర్య పడుదుము. కాని భూతలమునకు అడుగున ఎన్నియో శక్తులు, ఎంతోకాలముపాటు అన్యోన్యసంఘటన చేసికొనును. అగ్నులు ఒక్కచో చేరును. భూతలము వాటిని అణచిపెట్టలేకపోవును. అప్పుడవి పైకి ఉబుకును. బ్రహ్మాండమగు అగ్ని జ్వాలలు మిన్నంటును. కరిగిన లావాపర్వత సానువులనుండి ప్రవహించును. ఇట్లే, చివరకు

విప్లవరూపముగా ఉబికే శక్తులు సంఘములో లోలోపల చిరకాలము పాటు విజృంభించు చుండును. వేడిచేసినప్పుడు నీరు మరుగుతుంది. వేడియెక్కి యెక్కిగదా అది మరిగేది ?

ఆర్థిక పరిస్థితులును, నూతన భావములును, విప్లవములు పుట్టుటకు కారణము—అధికారములోనున్న అవివేకులు, తమ అభిప్రాయములకు అనుగుణముగా లేని ఏ పరిస్థితులను గమనించక, విప్లవములు ఆందోళన పరులవలన కలుగుచున్నవని అనుకొంటారు. అప్పుడున్న పరిస్థితులకు అసంతుష్టిచెంది, మార్పు రావలెనని కోరుతూ, అందుకై పనిచేసేవారు ఆందోళన పరులు. విప్లవకాలములందు తప్పకుండా వారు కావలసినంత మంది ఉంటారు. అప్పుడున్న అసంతుష్టి, కలవరములు కారణముగా వారు తలయెత్తుతారు. ఆందోళనపరులు ఆదేశించారుగదా అనే కారణము చేతమాత్రమే వేలకొద్ది జనులు కార్యరంగమునకు దూకరు. ఏది ఉన్నా, లేకున్నా మానవులలో అధిక సంఖ్యాకులు కోరేది భద్రత. ఉన్నది పోగొట్టుకో కోరరు వారు. ఆర్థిక పరిస్థితులు విషమించుటవల్ల నానాటికీ బాధలు ఎక్కువై బ్రతుకే బరువైనప్పుడు బలహీనులు సైతము తెగిస్తారు. అట్టి సందర్భములోనే వారు ఆందోళన పరుని మాటలు ఆలిస్తారు. దుఃఖమును తరించే మార్గమునతడు చూపుతూన్నట్లు వారు భావిస్తారు.

నా జాబులనేకములో ప్రజల దుస్థితినిగురించియు, రైతుల తిరుగుబాట్లను గురించియు చెప్పియున్నాను. యూరోపు, ఆసియాలలో ప్రతి దేశమునందును ఇట్టి రైతుల తిరుగుబాట్లు తటస్థించినవి. రక్తపాతము, క్రూరనిర్బంధములు వాటి ఫలితము. వారి దుస్థితి వారిని విప్లవకార్యములలోనికి దింపినది. గమ్యస్థానము గురించి వారికి సుస్పష్ట భావములు లేవు. స్పష్టమగు ఆలోచన లేకపోవుటవల్లనూ, ఆశయములు లేకపోవుటవల్లనూ వారి ప్రయత్నములు నిష్ఫలమైనవి. ఫ్రెంచి విప్లవములో ఒక కొత్త విషయము మనకు గోచరించుచున్నది. అది విప్లవ

మునకు ఆర్థిక ప్రోద్బలముతోపాటు పెద్దయెత్తున భావైక్యతకూడా సిద్ధించింది. అట్టి భావైక్యత ఉన్ననాడు నిజమగు విప్లవము పుట్టును. నిజమగు విప్లవము రాజకీయముగా, సాంఘికముగా, ఆధ్యాత్మికముగా సంఘ నిర్మాణమున మార్పు కలిగించును. 18 వ శతాబ్ది చివర సంవత్సరములలో ఫ్రాంసులో ఇట్లు సంభవించుట మనము గమనింతము.

ఫ్రెంచి రాజుల భోగములను గురించియు, అసామర్థ్యమును గురించియు, అక్రమ ప్రవర్తనను గురించియు నీకు చెప్పియుంటిని. ప్రజాసామాన్యముయొక్క కటిక దరిద్రమును గురించికూడా చెప్పియుంటిని. ఫ్రెంచిప్రజల హృదయములలో జరుగుచున్న కలవరమును గురించికూడా కొంతచెప్పియున్నాను. వాల్టేర్, రూసో, మాంటెస్క్యూ మున్నగువారి నూతన సిద్ధాంతములను గురించియు చెప్పియున్నాను. ఇట్లు అర్థిక దుస్థితియు, నూతన భావములును కలిసి పనిచేయ మొదలు పెట్టినవి. ప్రజలకు నూతన ఆశయములు కలుగుటకు చిరకాలము పట్టును. నూతన భావములు వారిలో క్రమక్రమముగా ప్రవేశించవలెను. పాత అభిప్రాయములను, దురభిమానములను వదలుకొనుటకు ఎక్కువ మంది సమ్మతించరు. ఒక నూతన ఆశయము స్థిరపడి, నూతన భావములను ప్రజలు గ్రహించునరికి తరుచు ఈ భావములప్పటికి పాతబడి పోవును. 18 వ శతాబ్దిలోని ఫ్రెంచి తత్వజ్ఞుల సిద్ధాంతములు యూరోపులో పరిశ్రమలు తల యెత్తుటకు ముందున్న కాలమునకు సంబంధించినవి. ఆ కాలమునందే ఇంగ్లాండులో పారిశ్రామిక విప్లవము తలయెత్తుచుండెను. అది పరిశ్రమలను, జీవితములను మార్చివేయుచుండెను. నిజమునకిది ఫ్రెంచి సిద్ధాంతములనేకములను పూర్వపక్షము చేయుచుండెను. పారిశ్రామిక విప్లవము వృద్ధి జెందినది తరువాతి కాలములో కాబట్టి ఫ్రెంచి తత్వజ్ఞులు రానున్నదానిని ఊహించలేకపోవుట సహజమే. అయినా ఫ్రెంచి విప్లవమును పోషించిన వారి సిద్ధాంతములు కొన్ని పాతబడ్డవి. ఇందుకు కారణము పెద్ద పరిశ్రమల ఆగమనమే.

ఏమైనప్పటికీ ఫ్రెంచి తత్వజ్ఞుల సిద్ధాంతములే విప్లవముపై ప్రబలముగా పని చేసినవి. వెనుకటి రోజులలో ప్రజలు తిరుగుబాటుచేసి పని చేసినట్లు అనేక నిదర్శనములుకలవు. ఎరుకతో ప్రజలు పనిచేయుట లేదా ఎరుక గలవారిచే నడుపబడుచు ప్రజలు పనిచేయుట ఇప్పుడు మనము చూడనగును. కావుననే ఫ్రెంచి మహా విప్లవముయొక్క ప్రాముఖ్యము.

1715 లో లూయీ XV, తాతగారైన లూయీ XIV అనంతరము సింహాసనమెక్కి యాభైతొమ్మిది సంవత్సరములపాటు రాజ్యము చేసినట్లు చెప్పియున్నాను. "నా తరువాత జలప్రళయము" అని అతడన్నాడట. అట్లే అతడు రాజ్యమేలాడు. ఆడుతూ, పాడుతూ కాలక్షేపం చేసి అతడు తన దేశాన్ని అఖాతములోకి త్రోసివేశాడు. బ్రిటిషు విప్లవము చూచిన్నీ, ఇంగ్లీషు రాజును ఉరి తీయడం ఎరిగి ఉండిన్నీ అతడు నేర్చుకొన్నదేమీలేదు. 1774 లో అతని మనుమడు లూయీ XVI అతని తరువాత రాజ్యమేలాడు. ఇతడు వట్టి తెలివితక్కువ మనిషి. అతని భార్యపేరు మేరీ ఆంటోనెట్. ఈమె హాప్సుబర్గు ఆష్ట్రియన్ చక్రవర్తి సోదరి. ఆమెకూడ తెలివితక్కువమనిషే. కాని ఆమెకొక విధమగు మొండి బలముండెను. లూయీ XVI పూర్తిగా ఆమె అదుపాజ్ఞలలో ఉండెను. దైవదత్తాధికారమంటే లూయీ కన్న ఆమెకెక్కువప్రీతి. ప్రజాసామాన్యము నామె ద్వేషించుచుండెను. ఆలు మగళ్ళిద్దరూ కలిసి ఏకాధిపత్యమంటే ప్రజలకు మొహం మొత్తేలాగ చేశారు. విప్లవం ప్రారంభమైన పిమ్మటకూడా ఏకాధిపత్య విషయమున ప్రజలకు స్పష్టాభిప్రాయములేదు. కాని లూయీ, మేరీలు వారి చేతలవల్లా, వారు చేసన తప్పుడు పనులవల్లా ప్రజాప్రభుత్వము తప్పనిసరిగాచేశారు. అయినా అంతకన్న బుద్ధిమంతులు సైతము ఆ సందర్భములలో అంతకన్నా ఎక్కువ చేసేదేమి కనబడదు. 1917 లో రష్యను విప్లవ ప్రారంభ సమయమున రష్యా రాజైన జారును, అతని భార్యయు మిక్కిలి తెలివి తక్కువగా ప్రవర్తించారు. ప్రమాద మెక్కువైనకొద్దీ

ఇట్టివారు మరీ తెలివి తక్కువగా ప్రవర్తించి తమ వినాశాన్ని తాము కొని తెచ్చుకొంటారు. వారికి సరిపోవు లాటిన్ సామెత ఒకటి కలదు— "భగవంతుడు నాశనము చేయదలుచుకొన్నవారిని ముందుగా ఉన్మత్తులను చేస్తాడు." సంస్కృతములోకూడా సరిగా ఇట్టి లోకోక్తియేకలదు- వినాశకాలే విపరీత బుద్ధిః.

ఏకాధిపత్యమునూ, నిరంకుశత్వమునూ తరుచు నిలువబెట్టే ఒక ఆధారము—యుద్ధ విజయకాంక్ష. సర్వదేశమున అల్లరులు తలయెత్తినప్పుడు ఒకరాజో, లేదా ప్రభుత్వసభ్యులో అన్యదేశములలో విజయము సాధించ బోవుదురు. ఈ విధముగా ప్రజల మనస్సులను అన్యథా తిప్పుచుండిరి. కాని ఫ్రాంసులో ఇట్టి దండయాత్రలు ఫలించలేదు. ఏడు సంవత్సరముల యుద్ధములో ఫ్రాంసుకు పరాజయము వచ్చినది. ఏకాధిపత్యమునకది దెబ్బ కొట్టినది. ఖజానాలో డబ్బు నానాటికీ తరిగిపోయి దివాలాను సమీపిస్తోంది. అమెరికా స్వాతంత్ర్య యుద్ధములో ఫ్రెంచివారు కలుగజేసికొనుటవల్ల మరింత ధనవ్యయమైనది. ఈ ధనమంతా ఎక్కడనుంచి వస్తుంది? కులీనులూ, పురోహితులూ, ఉన్నత తరగతి వారూ చాలా పన్నులు చెల్లించనక్కరలేదు. వారి హక్కులను వారు వదులుకోదలుచుకొనలేదు. అయినా అప్పును తీర్చడానికిన్నీ, రాజ పరిజనము దుబారా ఖర్చులకున్నూ డబ్బు పుట్టించవలసి ఉన్నది. ఇక ప్రజా సామాన్యము మాట ఏమిటి? ఫ్రెంచి విప్లవ చరిత్ర వ్రాసిన కార్లైలు అను గ్రంథకర్త వారినిగురించి ఈ విధముగా వ్రాశాడు. అతని శైలిలో ప్రత్యేకత ఉన్నది. వ్రాతద్వారా చక్కనిచిత్రములు ప్రదర్శించుటలో అతడు ప్రసిద్ధుడు—

"కార్మికుల స్థితి అంటారా, అది బాగాలేదు. పాపము! వారు 2 కోట్ల మంది మొదలు $2\frac{1}{2}$ కోట్లమంది వరకూ ఉన్నారు. కాని వారి నందరినీ మనము సంక్షేపముగా, అస్పష్టముగా కట్టకడుతున్నాము. బ్రహ్మాండమైన జనసంఖ్య అయినా అది

అస్పష్టము, దూరగతము. వీరిని ఒక కట్టకట్టి పాటకజనుల మూక అంటున్నాము. లేదా ఇంతకన్న దయగా చెప్పవలసివస్తే "ప్రజాసామాన్యం"అంటున్నాము. ప్రజాసామాన్యమే, నిజమే. కాని, వింతగా ఉంటుంది; నీ ఊహాశక్తితో నీవు విశాలమైన ఫ్రాంసులో ఉన్న వారి మట్టి గుడిసెలలోకీ, కాపురముండు అటకలలోకీ, పాకలలోకీ వెళ్ళి చూస్తే ఈ ప్రజా సామాన్యములో ఉన్నవారంతా మనుష్య వ్యక్తులే అని తెలుస్తుంది. అందులో ప్రతి వ్యక్తికీ హృదయమున్నది. కష్టములున్నవి. చర్మమున్నది. గట్టిగా గిల్లితే రక్తము వస్తుంది."

ఈ వర్ణన 1789 నాటి ఫ్రాంసుకేకాదు. 1932 నాటి ఇండియాకును. ఎంత చక్కగా సరిపోవుచున్నదో! మనలో పలువురము ప్రజాసామాన్యమును, లక్షలకొద్ది రైతులను, కార్మికులను కట్టగాకట్టి, వారిని అందవికారమైన దురదృష్ట మృగముగా భావించడంలేదూ? చిరకాలము నుంచి వారు బరువులుమోయు మృగములుగానే ఉంటున్నారు. ఇప్పుడూ అలాగే ఉన్నారు. వారికి మనము సానుభూతి చూపుతాము. అనుగ్రహభావముతో వారికి ఉపకారము చెయ్యవలెనంటాము. అయినా వారిని వ్యక్తులనిగాని, మానవులనిగాని, మనబోటివాళ్ళే అనిగాని ఊహించము. వారివారి మట్టి గుడిసెలలో వాళ్లు ప్రత్యేక జీవనాలు గడుపుతున్నారనీ, వాళ్ళకీ మనవలెనే ఆకలీ, చలీ, బాధా ఉన్నవనీ జ్ఞాపకముంచుకోవడం మంచిది. మనలో రాజకీయవేత్తలు పలువురు, న్యాయశాస్త్రదక్షులు రాజ్యాంగ వ్యవస్థలు మున్నగు వాటినిగురించి అలోచిస్తూ, ప్రసంగిస్తూ ఉంటారు. కాని ఈ రాజ్యాంగ వ్యవస్థలూ, శాసనములూ ఏ ప్రజకొరకు చేయబడుచున్నవో వారిని మరిచిపోతారు. కోట్లాది మట్టి గుడిసెలలోనూ, పట్టణమందలి అపరిశుభ్రపు సందు గొందులలోనూ నివసించు వారికి రాజకీయాలంటే—ఆకలికి తిండీ, ఒంటికి బట్టా, ఉండను కొంపా మాత్రమే.

లూయీ XVI హయామున ఫ్రాంసు ఈ విధముగా ఉండెను. అతని పరిపాలన ప్రారంభించడం తడవుగా ఆకలి అల్లరులు చెల రేగాయి. చాలా సంవత్సరములపాటు ఇవి సాగాయి. కొన్నాళ్లపాటు వ్యవధి. తరువాత మళ్ళీ రైతుల తిరుగుబాట్లు. డైజనువద్ద ఆకలి అల్లరి జరుగుచుండగా ఒకమారు తిండిలేక మాడుతున్న ప్రజలతో దాని గవర్నరు ఇట్లాచెప్పాడు—"గడ్డి మొలకెత్తిందిలే. పొండి. పొలాలికిపోయి గడ్డిమెయ్యండి." అసంఖ్యాకులగు జనులు భిక్షావృత్తి నవలంభించారు. 1777 లో ఫ్రాంసులో పదకొండు లక్షలమంది యాచకులున్నారని అధి కారులు అంచనావేసి చెప్పారు. ఈ దారిద్ర్యమూ, ఈ దుస్థితీ తలచు కొంటే మాటిమాటికీ ఎట్లా ఇండియా జ్ఞాపకానికి వస్తోందో!

రైతులు ఆకలిగా ఉంట ఒక్క తిండికేకాదు; భూమికికూడా. ఫ్యూడల్ పద్ధతి ప్రకారము కులీనులే భూస్వాములు. దానివల్ల రాబడి చాలా భాగము వారికేపోయేది. రైతులకు విస్పష్టభావాలు లేవు. విస్పష్ట లక్ష్యములేదు. భూమివారికి చెందవలెనని ఆసించుచుండిరి. వారిని అణచివేస్తూన్న ఫ్యూడల్ పద్ధతి అంటే వారికి అసహ్యం. కులీనులన్నా, మతగురువర్గమన్నా (Clergy), ఉప్పు పన్ను అన్నా (మళ్ళీ ఇండియా జ్ఞాపకం వస్తోంది) వారికి ఏవగింపు. ఉప్పుపన్ను బీదలకు భారముగా ఉండేది.

రైతుల స్థితి ఇట్లుండెను. అయినా రాజూ, రాణీ డబ్బుకావాలని తొందరచేస్తున్నారు. ఖర్చు పెట్టడానికి ప్రభుత్వానికి డబ్బు లేదు. అప్పులు పెరిగిపోతూన్నవి. మేరీ ఆంటోనెట్‌ను ఎగతాళికి "మదాంధన లోపమ"నేవారు. డబ్బు పుట్టించడానికి మార్గమేమీలేదు. చివరకు ఏమీ తోచక లూయీ XVI 1789 మేలో "స్టేట్సుజనరల్" అనే సభను సమావేశపరిచాడు. ఈ సభలో రాజ్యమందలి మూడు తరగతుల (వీటిని ఎస్టేటు లంటారు) ప్రజలయొక్క ప్రతినిధులూ ఉందురు: కులీనులు, మతగురువర్గము, సామాన్యులు—ఇవి మూడున్నూ ఆ తరగతులు. ఈ

9

సభ బ్రిటిషు పార్లమెంటు సభల మాదిరిగానే ఉండెను. అవి కులీనులూ, మతగురువర్గమూ గల లార్డుల సభ; కామన్సు సభ. కాని ఈ రెంటికీ చాలా భేదములున్నవి. కొన్ని వందల సంవత్సరములనుంచి బ్రిటిషు పార్లమెంటు నియమము తప్పకుండా సమావేశమవుతోంది. సంప్రదాయములు, నిబంధనలు, కార్యనిర్వహణ పద్ధతీ అందు పాదుకొన్నవి. ఫ్రెంచి సభలోనూ, బ్రిటిషు పార్లమెంటులోనూ ఉన్నవారు ఉన్నత తరగతుల ప్రతినిధులే. స్టేట్సు జనరల్ లోని కామన్సుకంటె, బ్రిటిషు కామన్సు సభలో ఇది ఎక్కువగా ఉన్నది. రైతుల కెక్కడా ప్రాతినిధ్యములేదు.

1789 మే 4 వ తేదీని స్టేట్సు జనరల్ సమావేశము వార్సైలో రాజుచేత తెరువబడెను. కాని ఈ మూడు ఎస్టేటుల ప్రతినిధులను సమావేశపరచినందుకు రాజు వెంటనే విచారించాడు. మూడవ ఎస్టేటువారు, అనగా కామన్సు లేదా మధ్యతరగతివారు, తాము సమ్మతించనిదే పన్నులు వేయరాదని ధిక్కరించి చెప్పారు. ఇంగ్లాండులో కామన్సు సభకిట్టి హక్కు ఉన్నది. అమెరికాలోకూడా మొన్నమొన్ననే ఈ హక్కు ప్రజలకు సంక్రమించింది. వారు ఇంగ్లాండు, పొరపాటున, స్వతంత్రదేశ మనుకున్నారు. యదార్థానికి ఇది వట్టి భ్రమ. ఇంగ్లాండును నడిపిస్తూంట, పాలిస్తూంట కులీనులున్నూ, భూస్వాములున్నూ. వోటింగు హక్కు చాలా పరిమితము కాబట్టి పార్లమెంటును వీరే గుత్తకు తీసుకొన్నారు.

మూడవ ఎస్టేటు ప్రజలు చేసిన పని లూయీ రాజుకు కోపకారణమయ్యెను. సభా భవనమునుంచి వారి నతడు వెళ్ళగొట్టించెను. కాని వారికి వెళ్ళిపోయే ఉద్దేశములేదు. వెంటనే వారు సమీపమందున్న టెన్నీసు కోర్టులో సమావేశమై రాజ్యాంగ సంస్థ స్థాపించువరకు విడిపోకూడదని శపథము తీసుకొన్నారట. దీనినే టెన్నిసు కోర్టు శపథమంటారు. అప్పుడు రాజు పశుబలమును వారిపై ప్రయోగించడానికి

ప్రయత్నించాడు. కాని అతని సైనికులే అతని ఉత్తరువును పాలించ లేదు. ప్రభుత్వమునకు అండగానున్న సైన్యము తమతోడి ప్రజలపై తుపాకులు పేల్చుటకు నిరాకరించినప్పుడే విప్లవమెప్పుడూ విషమ స్థితికి వస్తుంది. లూయీ బిత్తరపోయి విరమించాడు. కాని యథా ప్రకారము తెలివితక్కువగా అన్యదేశ పటాలములను రప్పించి తన ప్రజలపై కాల్పించవలెనని కుట్రచేశాడు. ప్రజలిది సహించలేకపోయారు. 1789 జూలై 14 తేదీని పారిస్‌లో వారు తిరగబడ్డారు. బాస్టీలు అను చెరసాలను వారు స్వాధీనము చేసుకొని ఖైదీలను విడిచిపెట్టారు.

బాస్టీలు పతనము చరిత్రలో మహత్తర సంఘటనము. విప్లవ ప్రారంభమునకది అంకురార్పణము. దేశమందంతటా ప్రజలుతిరుగబడుట కదియొక సంకేతము. ఫ్రాంసులో పాత పద్ధతీ, ఫ్యూడల్ పద్ధతీ, ఏకాధి పత్యమూ, హక్కులూ అంతమైనవన్నమాట. యూరోపులోని రాజు లకూ, చక్రవర్తులకూ అది భయంకరమగు ధూమకేతువు. మహారాజుల సంప్రదాయమును ప్రవేశపెట్టిన ఫ్రాంసు నేడు వేరొక సంప్రదాయము నకు దారి తీసింది. యూరోపు నిశ్చేష్టయైనది. కొందరాకార్యమును చూచి భయముతో వణకిపోయారు. పలువురాకార్యమును చూచి మంచి రోజులు రానున్నవని ఆశ చెందారు. జూలై 14 వ తేదీ నేడుకూడా ఫ్రాంసులో జాతీయోత్సవదినము. ప్రతిసంవత్సరము ఈ యుత్సవమును దేశమంతటా చేస్తారు.

జూలై 14 వ తేదీని బాస్టీలు పారిస్ ప్రజల వశమైనది. కాని అధికారములో ఉన్నవారికి ఎంతగా కళ్ళు మూసుకుపోతాయో! దానికి క్రితము దినమందే, 13 వ తేదీని వార్సైలో రాజుగారికి విందుజరిగింది. రాజ దంపతుల సమక్షమున నాట్యమూ, సంగీతమూ జరిగినవి. తిరుగ బడ్డ పారిసు ప్రజలపై విజయము కోరుతూ పానీయ పానములుకూడా జరిగినవి. యూరోపులో ఏకాధిపత్యముపై అభిమానము ఎంత తీవ్ర ముగా నున్నదో తలుచుకొంటే ఆశ్చర్యం వేస్తుంది. నేటి యుగములో

మనము ప్రజా ప్రభుత్వములకలవాటు పడితిమి. రాజులంటే మనకంత లక్ష్యములేదు. ప్రపంచములో ఇంకా కొద్దిగా మిగిలి ఉన్న రాజులు నేడు జాగ్రత్తగా మసలుకొంటున్నారు. లేకుంటే ఇంతకంటే హీనస్థితి వస్తుందేమోనని భయము. అయినా చాలామంది ఏకాధిపత్య భావము నకు వ్యతిరేకులు. అది ప్రజలలో విభేదములు కలిగించుననీ, రాజ బంధువులూ, రాజాశ్రితులూ ప్రజలతో కలవకుండా కేటాయింపుగా ఉండునట్లు చేయుననీ వారి అభిప్రాయము. కాని 18 వ శతాబ్ది యూరో పులో ఇట్టి భావనలేదు. ఆనాటి ప్రజలకు రాజులేని దేశమంటే ఏమిటో ఊహించుకోవడమే కష్టము. లూయీ అంత అవివేకముగా ప్రవర్తించి నప్పటికీ, ప్రజలను తృణీకరించ ప్రయత్నించినప్పటికీ అతనిని పద భ్రష్టుని చేద్దామని ఎవరికీ లేదు. సుమారు మరిరెండు సంవత్సరముల పాటు అతనిని సహించారు. అతని కుట్రలు సహించారు. అతడు పారి పోవుటకు ప్రయత్నించి పట్టుబడ్డప్పుడుమాత్రం రాజు లేకుండా కాల క్షేపం చెయ్యడానికి నిశ్చయించుకొన్నారు.

కాని కొంతకాలము జరిగినపిమ్మట అది తటస్థించినది. ఇంతలో స్టేట్సు జనరల్ జాతీయ సభగా (National Assembly) మారినది. రాజు నియమబద్ధ ఏకాధిపతిగా భావింప బడ్డాడు. అనగా సభవారు చెప్పి నట్లు చేసే రాజు. కాని అతనికిది ఇష్టములేదు. మేరీ ఆంటోనెట్‌కు అసలే ఇష్టములేదు. పారిస్ ప్రజల కతనిమీద అభిమానములేదు. అన్ని రకాల కుతంత్రములూ చేస్తున్నాడని వారనుమానించారు. అప్పుడు రాజ దంపతులు వార్సైలో కొలువు దీరియుండిరి. పారిస్‌కు అది చాలా దూరము. కాబట్టి అతని చర్యలు గమనించడానికి వీలులేకుండెను. వార్సైలో భోగములతో ఉత్సవములువారు చేసుకొంటూన్నట్లు వార్తలు వచ్చినవి. ఆకలితో మాడుతున్న పారిస్‌ప్రజల నివి ఉద్రేకింపచేశాయి. కాన రాజ దంపతులను పారిస్‌లోని టూలెరీసుకు వింతగా ఊరేగిస్తూ కొని వచ్చారు. తరువాతి జాబులో విప్లవచరిత్ర సాగిస్తాను.

101

# ఫ్రెంచి విప్లవము

అక్టోబరు 10, 1932

ఫ్రెంచి విప్లవమునుగురించి వ్రాయుటకు నాకు కొంచెము కష్టముగా ఉన్నది. విషయము లేకకాదు. అది బోలెడంత ఉన్నది. ఆ విప్లవమొక నాటకము వంటిది. అది మనలను ఆశ్చర్యమున ముంచి వేయును. అది నిరంతరమూ మారుచుండును. మనలను ఆకర్షించి, భయపెట్టి, పులకితులను జేసే అసాధారణ విషయములతో అది నిండి యుండును. రాజులకు, రాజతంత్రజ్ఞులకు సంబంధించిన రాజకీయములకు ఆవాసస్థానము. ఇతరులు ప్రవేశింపరాని రహస్యపు గది. అర్థముకాని గూఢత్వము వాటి నావరించియుండును. అనేక పాపములు ఆ తెరవెనుక జాగ్రత్తగా దాగి ఉంటవి. ఉన్నతికి అత్యాశతో పోటీపడువారి పోరాటము మృదుభాషణము వెనుక మరుగుపడును. ఈ పోటీలవల్ల యుద్ధము సంప్రాప్తమై వారి అత్యాశకు బలిగా యువకులనేకులు మరణించినప్పటికీ వారి నీచోద్దేశములు వెల్లడియైనప్పుడు మనకు కష్టముగా నుండదు. ప్రాణములర్పింపవలసిన మహదాశయములంటూ, మహోద్యమము లంటూ ప్రజలను మభ్యపెడతారు.

కాని విప్లవము సంగతి వేరు. దాని వాసస్థానము పొలము, వీధి, సంతబజారు. దానిపద్ధతులు మోటువి. రాజులకూ, రాజ తంత్రజ్ఞులకూ ఉన్న విద్యాధనము విప్లవకారులకులేదు. వారి భాషణము మృదువు కాదు: గౌరవప్రదముకాదు. కుట్రలు, దురాలోచనలు వారిమాటలవెనుక పొంచుండవు. వారిలో గూఢత్వమేమీ లేదు. వారి మనోవ్యాపారములను మరుగుపరుచుటకు తెరలుండవు. విప్లవ కాలమున రాజకీయములు రాజుల యొక్కయు, రాజకీయములు వృత్తిగా పెట్టుకొన్న రాజ్యతంత్రవేత్తల యొక్కయు ఆటగా ఉండవు. రాజకీయములప్పుడు

యదార్థ పరిస్థితుల నెదుర్కొనవలసియుండును. వాటి వెనుకనుండేవి— కల్లకపట మెరుగని మానవ స్వభావమూ, క్షుధార్తుల కాలీకడుపులూ.

1789 నుంచి 1794 వరకూ నున్న అయిదు సంవత్సరముల కాలములోను క్షుధార్తులగు ప్రజాసామాన్యము ఫ్రాంసులో కార్యరంగమున పని చేసిరి. వారే భీరువులగు రాజ్యతంత్రవేత్తలను బలవంతము చేసి ఏకాధిపత్యమును, ఫ్యూడల్ పద్ధతిని, చర్చిహక్కులను రద్దు చేయించారు. భయంకరమగు వధ్యశిల అనే దేవతకు మొక్కులు చెల్లించి, గతములో వారి నణచిపెట్టిన వారిమీదా, ఇప్పుడు సంపాదించిన స్వాతంత్ర్యమునకు భంగము తెచ్చుటకు కుట్రలు పన్నుతున్నట్లు అనుమానించిన వారిమీదా వారే కసి తీర్చుకున్నారు. గుడ్డపీలికలు కట్టుకొని జోళ్లులేకుండా నడిచే వీరే, అప్పటికప్పుడు ఆయుధములు నిర్మించుకొని తమ విప్లవమును రక్షించుటకు యుద్ధరంగమున దిగి, ఏకమై తమ మీదికి వచ్చిన సుశిక్షితమగు యూరోపు సైన్యమును వెనుకకు కొట్టినవారు. ఈ ఫ్రాంసు ప్రజలు అత్యద్భుత కార్యములు చేసిరి. కాని అనేక సంవత్సరముల కాలము అమిత ప్రయాసకులోనై యుద్ధము సాగించిన పిమ్మట విప్లవములో శక్తి సన్నగిల్లెను. అప్పుడది ఎదురు తిరిగి తన పిల్లలనే భక్షించుటకు మొదలుపెట్టును. అప్పుడు ప్రతి విప్లవము వచ్చును. అది విప్లవమును కబళించును. ఇంత సాహసించి బాధపడ్డ సామాన్య జనులను తిరిగి ఉన్నత తరగతుల ఏలుబడికి అది పంపుతుంది. ఈ ప్రతివిప్లవమునకు ఫలముగా నియంతయూ, చక్రవర్తియూ అయిన నెపోలియన్ ఉదయించాడు. ప్రతి విప్లవము కాని, నెపోలియన్ కాని ప్రజలను వెనుకటి స్థితికి పంపలేరు. విప్లవము సాధించిన ప్రధాన విజయములను ఎవ్వరూ తుడిచివేయలేరు. కొద్దికాలముపాటైనా బీదలు తమ దాసిసత్వమునుండి విముక్తి చెందిన దివ్యస్మృతిని ఫ్రెంచి ప్రజలనుంచిగాని, యూరోపు ప్రజలనుంచిగాని ఎవ్వరూ తీసివేయజాలరు.

విప్లవము తొలి రోజులలో నాయకత్వమునకై అనేక కక్షలు గుద్దులాడుకొనుచుండెను. అందు రాజ పక్షీవలంబులున్నారు. వారు లూయీ XVI ను అఖండైకాధి పతిని జేయ వ్యర్థమగు ఆశలు పెట్టుకొన్నారు. మితవాదులగు లిబరల్ పక్షమువారున్నారు. వారు రాజును నియమబద్ధ ఏకాధిపతినిచేయ సంసిద్ధులై ఉన్నారు. మితవాదులగు ప్రజాప్రభుత్వ వాదులున్నారు. వారిని గిరోండి పక్షమందురు. అతివాదులగు ప్రజాప్రభుత్వ వాదులున్నారు. వారిని జాకొబిన్సు అందురు. జాకొబిన్ కాన్వెంటులో వారు సమావేశమగుచుండుటవల్ల ఆ పేరు వచ్చినది. ఇవి ప్రధాన పక్షములు. ఈ పక్షములలోనూ బయటాకూడా తరిచూచి లాభము కొట్టుటకు ప్రయత్నించే సాహసికులున్నారు. ఈ పక్షములకూ, ఈ వ్యక్తులకూ వెనుక ఫ్రాంసులోని ప్రజాసామాన్యమున్నారు. ముఖ్యముగా పారిస్‌లోని జనసామాన్యము. వీరు తమనుండియే వచ్చిన ఊరూ, పేరూ లేని అనేక నాయకుల ఆజ్ఞల ప్రకారము నడుచుకొంటూ ఉన్నారు. పరదేశములలో, ముఖ్యముగా ఇంగ్లాండులో విప్లవమువచ్చినప్పుడు పారిపోయి తలదాచుకొన్న ఫ్రెంచి కులీనులుండి కుట్రలు చేస్తున్నారు. యూరోపులోని జాతులన్నీ విప్లవముచేసిన ఫ్రాంసుకు ఎదురుతిరిగి ఉండెను. పార్లమెంటు పరిపాలనముండినీ్న సంపన్నుల చేతులలో చిక్కుకొన్న ఇంగ్లాండును, యూరోపు ఖండమందలి రాజులును, చక్రవర్తులును సామాన్య మానవుని యీ తిరుగుబాటుచూచి భయపడిపోయారు. దానిని అణచివేయ ప్రయత్నించారు.

రాజున్నూ, రాజ పక్షీవలంబులున్నూ చేరి కుట్రలుపన్ని తమ వినాశనమును దగ్గరకు తెచ్చుకొన్నారు. జాతీయసంఘము (National Assembly) లో మొట్టమొదట ప్రాధాన్యము వహించిన పక్షము మితవాదులైన లిబరల్ పక్షము. ఇంగ్లాండు, అమెరికాలో ఉన్న రాజ్యాంగ వ్యవస్థవంటి వ్యవస్థ ఫ్రాంసుకుండవలెనని వారు కోరిరి. వారి నాయకుడు మిరాబో అనువాడు. జాతీయసంఘములో సుమారు రెండుసంవత్సరముల

పాటు వారు అధికారములో ఉంపిరి. విప్లవము ప్రథమ దినములో చేకూరిన విజయమునకుపొంగి వారు ధైర్యముతో అనేక ప్రకటనలు చేసిరి. కొన్ని ముఖ్యమగు మార్పులు తీసుకొనివచ్చిరి. బాస్టీలు చెరసాల ప్రజాధీనమైన మరి ఇరవై రోజులకు 1789 ఆగష్టు 4 వ తేదీని జాతీయ సంఘములో ఒక వింత విశేషము జరిగెను. సంఘములో అప్పుడు చర్చనీయాంశము—ఫ్యూడల్ హక్కులను, అధికారములను రద్దుచేయుట. అప్పుడు ఫ్రాంసులోనున్న వాతావరణము ప్రజలనావేశపూరితులను చేసినది. కొత్తగా ఆర్జించిన స్వాతంత్ర్యము ఫ్యూడల్ ప్రభువులనుకూడా ఉత్సాహపూరితులను చేసినది. జాతీయ సంఘ భవనమున సమావేశమైన కులీనులలో పెద్దలు, చర్చినాయకులు లేచి ఫ్యూడల్ హక్కులను ప్రత్యేకాధికారములను వదలుకొంటూన్నామని పోటీపడి చెప్పిరి. కొన్ని సంవత్సరములవరకూ అధిక ఫలము సిద్ధించకపోయినప్పటికీ ఉదారభావముతోనూ, సద్భావముతోనూ చెప్పిన మాటలివి. అప్పుడప్పుడు—తరుచుగాకాదు—అట్టి ఉదార భావములు సంపన్నులకు కలుగుచుండును. లేదా తమహక్కులు నిలువవనే జ్ఞానము వారికి కలుగుటవల్ల అట్టి ఔదార్యమును చూపుట ఉత్తమ పద్ధతి అని వారు భావించి యుండవచ్చును. అంటరాని తనమును నిర్మూలించుటకు బాపు ఉపవసించినప్పుడు ఇండియాలో కొద్ది రోజుల క్రిందటనే సవర్ణ హిందువులు ఇట్టి ఉదార కార్యమును చేసిరి. ఇంద్రజాలమువలె దేశమందంతటా సానుభూతి వ్యాపించింది. హిందువులు తమ సోదరుల చేతులకు తగిలించిన సంకెళ్లు కొంతవరకు సడలిపోయినవి. వేలకొద్ది సంవత్సరముల కాలము అంటరానివారు ప్రవేశింపరాని ఇండ్ల తలుపులు తెరుచుకొన్నవి.

ఉత్సాహోద్రేకముతో విప్లవము జరిపిన ఫ్రాంసులోని జాతీయ సంఘము తీర్మానముచేసి కమతగాళ్ళ పద్ధతినీ, హక్కులనూ, ఫ్యూడల్ విచారణ సభలనూ, కులీనులూ, మతగురువర్గమూ పన్నులు

చెల్లించనక్కరలేదను పద్ధతినీ, బిరుదులు సైతమూ రద్దుచేసెను. రాజింకను నిలిచియుండగనే కులీనులు బిరుదులు పోగొట్టుకొనుట వింత విషయమే.

పిమ్మట జాతీయ సంఘము మానవుని స్వత్వ ప్రకటనమును (Declaration of Rights) ఆమోదించింది. ప్రసిద్ధమగు ఈ ప్రకటన భావము అమెరికన్ స్వాతంత్ర్య ప్రకటనమును బట్టి బహుశా వచ్చి యుండవచ్చును. కాని అమెరికన్ ప్రకటనము సూక్ష్మముగాను, సరళము గాను ఉండెను. ఫ్రెంచి ప్రకటన మన్ననో దీర్ఘముగాను, క్లిష్టము గాను ఉండెను. మానవుని స్వత్వములనగా మానవునకు సమానత్వము, స్వేచ్ఛ, సుఖము ఇయ్యగలవనుకొను హక్కులు. మానవుని స్వత్వ ప్రకటన మాకాలమున ధైర్య సాహసములతో కూడుకొన్న పనిగా కనిపించెను. తరువాత సుమారు నూరు సంవత్సరముల కాలమది లిబరలు పక్షము వారికినీ, ప్రజా పక్షీయులకునూ (Democrats) అధి కార పత్రమయ్యెను (Charter). కాని అది నేడు పాతబడ్డది. మన కాలపు సమస్యలనది పరిష్కరించలేదు. శాసనమునుబట్టి వచ్చినవట్టి సమానత్వమువల్లనున్నూ, వోటు ఉండుటవల్లనున్నూ నిజమైన సమా నత్వముకాని, స్వేచ్ఛకాని, సుఖముకాని ఉండవనే సంగతి ఎంతో కాలము గడచిన పిమ్మటగాని ప్రజలు గ్రహించలేకపోయారు. అధికార ములోనున్న వారు స్వప్రయోజనపరులై ఇతరవిధముల తమ్ము బాధించ గలరనే సంగతి వారు గ్రహించలేకపోయారు. ఫ్రెంచి విప్లవము నాటి రాజకీయాభిప్రాయాలు నేడు లేవు. అవి చాలా వృద్ధిచెంది మార్పు చెందినవి. బహుశా నేటి సాంప్రదాయకులు (Conservatives) పలు వురు మానవుని స్వత్వ ప్రకటనమందలి గంభీర సూత్రములను నేడు ఆమోదిస్తారు. అంటే వారు నిజమైన సమానత్వమూ, స్వేచ్ఛా ప్రసా దించడానికి సిద్ధముగా ఉన్నారనికాదు. ఈ సంగతి మనకు తెలుసును. ఈ ప్రకటనము వ్యక్తుల ఆస్తిని రక్షించింది. ఫ్యూడల్ హక్కులకూ,

ప్రత్యేకాధి కారములకూ సంబంధించిన కారణము వల్ల కులీనుల యొక్కయూ, చర్చియొక్కయూ ఆస్తులు ప్రభుత్వము స్వాధీనము చేసికొంది. ఆస్తిని కలిగియుండుట అనే హక్కు మాత్రము పవిత్ర మనీ, అతిక్రమించరానిదనీ భావించుచుండిరి. నీకు బహుశా తెలిసియే యుండును—నేటి పరిపక్వ రాజకీయ సిద్ధాంతములనుబట్టి చూచినచో— వ్యక్తుల కాస్తియుండుటయే దోషము. వీలైనంతవరకు దానిని లేకుండ చేయవలెను.

మానవుని స్వత్వ ప్రకటనము మనకు నేడు సామాన్య పత్రము వలె కనిపించవచ్చును. నిన్నటి ఉదారాదర్శములు తరుచు నేటి సామా న్యాంశములగుచుండును. కాని స్వత్వ ప్రకటనమును చేసినప్పుడు యూరోపు పులకరించింది. బాధితులకూ, పతితులకూ మంచి రోజులు రానున్నవని అది చాటించినట్లయ్యెను. కాని రాజు కీప్రకటనము ఇష్టము లేదు. ఇది దైవదూషణకింద తోచిం దతనికి. దానిని ఆమోదించనని తిరస్కరించాడు. అతడింకను వార్సైలోనే ఉండెను. అప్పుడు పారిస్ ప్రజాసమూహము, స్త్రీల నాయకత్వమున వార్సై రాజ భవనముకు వచ్చారు. ప్రకటన పత్రమును రాజుచేత ఆమోదింపచేశారు. పారిస్ వెళ్ళమని రాజును బలవంతముకూడా చేశారు. ఈ వింత ఊరేగింపును గురించే నేను వెనుకటి జాబు చివర భాగమున సూచించాను.

జాతీయ సంఘము ఇంకను ప్రయోజనకరమైన సంస్కరణముల ననేకము చేసెను. చర్చియొక్క పెద్ద ఆస్తి ప్రభుత్వ వశమయ్యెను. ఫ్రాంసు కొత్తగా 80 భాగములుగా విభజింపబడెను. ఈ విభాగమే నేటికిని ఉన్నదని నా అభిప్రాయము. వెనుకటికన్న మంచి న్యాయ స్థానములు, వెనుకటి ఫ్యూడల్ న్యాయస్థానముల స్థానే స్థాపించబడినవి. ఇదంతా బాగానే ఉన్నది. కాని జరుగవలసినంత జరుగలేదు. భూమి కావలెనని కోరే రైతులకిది అట్టే లాభించలేదు. తిండికి బాధపడే పట్టణ వాసులైన సామాన్య ప్రజకూ ఇది అట్టే లాభించలేదు. విప్లవగతి

ఆగినట్లు తోస్తుంది. పట్టణమందలి ప్రజాసామాన్యమునకుగాని, రైతులకు గాని, పాటక జనులకుగాని, జాతీయ సంఘములో ప్రాతినిధ్యము లేదు. జాతీయసంఘము మధ్య తరగతి ప్రజల స్వాధీనమున నుండెను. వారి నాయకుడు మీరాబో. కోరిన ఉద్దేశములు ఫలించినవని వారికి తోచడముతోనే విప్లవము నాపుటకు వారు శాయశక్తులా ప్రయత్నించారు. వారు లూయీ రాజుతో సమేతం చేరి రాష్ట్రములలోని రైతులను తుపాకులతో కాల్పించారు. వారి నాయకుడు మీరాబో రాజుకు అంతరంగిక మంత్రిగా ప్రవర్తించాడు. బాస్టీలు ముట్టడించి పట్టుకొని, తత్ద్వారా సంకెళ్ళను విడగొట్టుకొంటిమని తలచిన సామాన్య జనులు జరిగిన సంగతి చూచి ఆశ్చర్యపోయారు. వారి స్వేచ్ఛ వెనుకటివలెనే దూరముగా ఉండెను. వెనుకటి ప్రభువుల వలెనే ఈ జాతీయ సంఘము కూడ తమ్ము అణచిపెట్టుచుండెను.

జాతీయ సంఘములో భంగపడి, విప్లవమునకు హృదయము వంటివారైన పారిస్ ప్రజలు వారి విప్లవ శక్తికి వేరొక ద్వారమును కనిపెట్టిరి. ఇదియే కమ్యూన్—అనగా పారిస్ పురపాలక సంఘము. కమ్యూనే కాకుండా దానికి అనేకమంది సభ్యులను పంపిన నగరములోని ప్రతీ భాగమున్నూ ప్రత్యేక జీవసంఘములద్వారా ప్రజాసామాన్యముతో సంబంధము పెట్టుకొని ఉండెను. ఈ కమ్యూనున్నూ, ముఖ్యముగా నగర భాగములున్నూ విప్లవ నాయకులైనారు. మితవాదులైన మధ్య తరగతి ప్రజలు గల జాతీయ సంఘమునకు పోటీదారులైనారు.

ఇంతలో బాస్టీలు పతన సాంవత్సరికోత్సవము వచ్చినది. జూలై 4 వ తేదీని పారిస్ ప్రజలు గొప్ప ఉత్సవం చేశారు. దానిపేరు ఫెడరేషన్ ఉత్సవమంటారు. నగరమును అలంకరించుటకు పారిస్‌లో సామాన్య ప్రజలు పూనుకొని ఉచితముగా పనిచేశారు. ఆ ఉత్సవము వారిదే అని వారు భావించారు.

1790, 1791 సంవత్సరములలో విప్లవ మీవిధముగా నుండెను.

జాతీయసంఘము విప్లవోత్సాహమును కోల్పోయెను. అది ఎన్నో మార్పులను చెందెను. కాని పారిస్ ప్రజలు విప్లవోత్సాహముతో ఆడి పోవుచుండిరి. రైతులు ఇంకను భూమిపై కన్ను వేసియుండిరి. ఈ విధముగా పరిస్థితులు చిరకాల ముండజాలవు. విప్లవము ముందు తోసుకుపోనైనా పోవాలి, లేదా అంతరించనైనా అంతరించాలి. మితవాద నాయకుడైన మీరాబో 1791 సంవత్సరమున మరణించెను. రాజుతో అతడు కుట్రలు పన్నుచున్నప్పటికీ ప్రజలలో పలుకుబడి పోలేదు. ప్రజల ఉత్సాహమునతడు అరికట్టుచుండెను. 1791 జూన్ 21 వ తేదీని ఒక విశేషము సంభవించెను. దానితో విప్లవమెట్టిమార్గము పట్టేదీ నిర్ణయమాయెను. లూయీ రాజును, మేరీ ఆంటొనెట్‌ను మారు వేష ములు వేసుకొని పారిపోవ ప్రయత్నించారు. పొలిమేర వరకు వారు వెళ్ళగలిగారు. కాని వెర్డంవద్దనున్న వారనీస్‌కడ కొందరు కర్షకులు వారిని పోల్చుకొన్నారు. వెంటనే వారిని పారిస్‌కు తీసుకువచ్చారు.

పారిస్ ప్రజలకు సంబంధించినంతమట్టుకు, రాజదంపతులు చేసిన ఈ పని వారికి ముప్పు తెచ్చిపెట్టింది. ప్రజాప్రభుత్వభావము శీఘ్రగతిని పెంపొందుచుండెను. అయినా జాతీయ సంఘమును, ఆనాటి ప్రభుత్వవైఖరియు ప్రజాభిప్రాయములకుసంబంధించిలేదు. కాన లూయీని పదభ్రష్టుని చేయమన్న వారందరినీ వారు తుపాకులతో కాల్చి చంపు చుండిరి. పలాయనానంతరము రాజును బహిరంగముగా ద్రోహియని నిందించి నందుకు మారట్ అను విప్లవయోధుని అధికారులు వేటాడారు. అతడు పారిస్ మురికి నీళ్ళ కాలువలలో దాక్కోవలసివచ్చినది. అచ్చట అతనికి భయంకరమైన చర్మవ్యాధి సంక్రమించింది.

చెప్పటకువింతగా ఉంటుంది, లూయీ రాజు మరో సంవత్సరం వరకూ నామకా రాజుగా ఉండెను. 1791 సెప్టెంబరులో జాతీయ సంఘము అస్తమించింది. దాని స్థానే లేజిస్లెటివ్ అసెంబ్లీ వచ్చింది. ఇదికూడ జాతీయ సంఘమువలెనే మితవాదపరముగానే ఉండెను. పై

తరగతి ప్రజలకు మాత్రమే ఇందు ప్రాతినిధ్యమున్నది. ఫ్రాంసులో అతిశయించుచున్న విప్లవజ్వరమునకిది అనుగుణముగా లేదు. విప్లవ జ్వరము ప్రజలలో వ్యాపించెను; అతివాద ప్రజాప్రభుత్వవాదులు అనగా జాకొబినులు, ప్రజలనుంచి వచ్చినవారు ప్రబలులైరి.

యూరోపు ప్రజలు భయవిహ్వలులై యీ వింత సంఘటనలను పరికించి చూచుచుండిరి. కొన్నాళ్ళపాటు ప్రషియా, ఆస్ట్రియా, రష్యాలు కొల్లగొట్టుకుంటూ అన్యధా ప్రవృత్తులై ఉండిరి. వారు పోలెండు రాజ్యమును తుదముట్టిస్తున్నారు. కాని ఫ్రాంసులో సంఘటనలు అతి తీవ్రగతిని జరుగుచుండుటచే వారు చూడక తప్పినదికాదు. 1792 లో ఆస్ట్రియా, ప్రషియాలతో ఫ్రాంసు యుద్ధము చేయవలసివచ్చెను. నెద ర్లాండులలో ఒకటైన బెల్జియం ఆస్ట్రియా వశమందిప్పుడు ఉండెను. బెల్జియం, ఫ్రాంసులకు ఉమ్మడి సరిహద్దు కలదు. పరదేశ సైన్యములు ఫ్రాంసులో చొరబడి ఫ్రెంచి సైన్యముల నోడించెను. రాజుకీదండ యాత్రతో సంబంధమున్నదని అనుకొనిరి. అట్లనుకొనుట సబబే. రాజ పక్షవలంబులు ద్రోహులుగా అనుమానింపబడ్డారు. విపత్తులు వృద్ధియైన కొద్దీ ఫ్రాంసు ప్రజలు క్రోధమూర్తులైనారు. భీతచేతస్కులైనారుకూడా. ఎక్కడచూచినా వారికి గూఢచారులూ, దేశ ద్రోహులూ కనిపించడం మొదలుపెట్టారు. ఈ విషమ పరిస్థితిలో పారిస్‌లోని విప్లవపరమగు కమ్యూన్ నాయకత్వము వహించెను. ఎర్రజెండా ఎత్తెను. రాజసభవారు తిరుగుబాటు చేసినందుకుగాను సైనిక శాసనము (Martial law) వారిపై ప్రయోగించినట్లు ఎర్రజెండా సూచించును. 1792 ఆగష్టు 10 వ తేదీని రాజనగరును ముట్టడించవలసినదని కమ్యూన్ ఉత్తర విచ్చెను. స్విస్ అంగరక్షకులచేత రాజు వారిని కాల్పించి చంపించెను. కాని విజయము ప్రజలకేదక్కెను. కమ్యూన్, బలవంతాన, లెజిస్లేటీవు అసెంబ్లీచేత రాజును పదభ్రష్టునిచేసి, చెరబెట్టించెను.

నేడు ఎర్రజెండా, కార్మికులజెండా, సామ్యవాదులజెండా, కమ్యూ

నిస్తులజెండా అని అందరికీ తెలుసును. వెనుకటి రోజులలో ప్రజల మీద సైనిక శాసనము ప్రకటించుట కుపయోగించే అధికారులజెండా, ప్రజల తరపున ప్రప్రథమమున ఎర్రజెండా పారిస్ కమ్యూన్యనే వాడిందని నా ఊహ. కాని నిశ్చయంగా చెప్పలేను. దీనిని బట్టియే అది క్రమేణా కార్మికులజెండాగా పరిణమించింది.

రాజును పదభ్రష్టునిచేసి చెరబట్టడముతో సరిపోలేదు. పారిస్ ప్రజలు తమ్ము స్విస్ అంగరక్షకులు కాల్చి చంపినందుకు క్రోధవివశులైనారు. ద్రోహులూ, గూఢ చారులూ చేస్తూన్న పనికి భయమూ, కోపమూ కూడా కలిగినవి. కాబట్టి అనుమానమున్న ప్రతి మనుష్యునీ వారు పట్టుకొని చెరసాలలో వేశారు. పట్టుకొన్నవారిలో చాలామంది నేరస్థులే. కాని అందు పలువురు నిరపరాధులు. కొన్ని దినములైన పిమ్మట క్రోధ పిశాచము ప్రజల నావరించింది. వారు చెరసాలలోని నేరస్థులను బయటకు తీసికొని వచ్చిరి. బూటకపు విచారణ చేయించిరి. తరువాత వారిలో చాలామందిని చంపివేసిరి. ఇట్లు 1000 మంది హత్య చేయబడ్డారట. వీటిని సెప్టెంబరు హత్యలంటారు. పారిస్ ప్రజల మూక పెద్ద పెట్టున రక్తము మొదటిసారు చవి చూడడం ఇప్పుడే. రక్త పిపాస చల్లారుటకు ఇంకను రక్త పాతము కానున్నది.

సెప్టెంబరులోనే ఫ్రెంచి సేనలు దండెత్తివచ్చిన ఆస్ట్రియన్, ప్రషియన్ సేనలపై ప్రథమ విజయమును సాధించెను. ఇది వామీ అను చిన్న యుద్ధములో చేకూరినది. చిన్న యుద్ధమైనను దీనినుండి వచ్చిన ఫలితములు పెద్దవి. విప్లవము దీనివల్ల రక్షింపబడింది.

1792 సెప్టెంబరు 21 తేదీని లెజిస్లెటీవు అసెంబ్లీ స్థానేవచ్చిన నేషనల్ కన్వెంషను సమావేశమైనది. దీనికి ముందున్న రెండు సంఘములకన్న ఇది అభిప్రాయములలో ముందు పడియున్ననూ, కమ్యూన్ కంటె ఇంకను వెనుకబడియేయుండెను. కన్వెంషను చేసిన ప్రథమ కార్యము ప్రజాప్రభుత్వమును ప్రకటించుట. వెంటనే లూయీ XVI

విచారణ జరిగినది. అతనికి ఉరిశిక్ష విధింపబడింది. 1793 జనవరి 21 తేదీని ఏకాధిపత్య దోషములకతడు బలికావలసి వచ్చినది. అతనిని శిరచ్ఛేదము చేశారు. పారిస్ ప్రజలు తిరుగులేని ఒక మార్గములో కాలు పెట్టారు. యూరోపులోని రాజులను, చక్రవర్తులనూ ధిక్కరించారు. వారింక వెనుకకు అడుగు వేయడమంటూలేదు. విప్లవ నాయకుడైన డాంటన్ రాజ రక్తసిక్తమైన వధ్యశిలపై నిలుచుండె అక్కడ కూడిన ప్రజలనుద్దేశించి ఉపన్యసించాడు. యూరోపు రాజులకు సవాలు చేశాడు. అతడన్న మాటలివి—"యూరోపు రాజులు మనల నెదుర్కొంటారు. ఒక రాజు శిరస్సు వారికి పారవేద్దాము."

## 102

## విప్లవము : ప్రతి విప్లవము

అక్టోబరు 13, 1932

లూయీ రాజు వెళ్ళిపోయాడు. అతడు పోకముందే ఫ్రాంసులో అద్భుతమైన మార్పు వచ్చింది. ఫ్రాంసు జనుల రక్తము విప్లవ జ్వరముతో కాగిపోవుచుండెను. వారి రక్తనాళములు ఉబుకుచుండెను. పట్టరాని ఉత్సాహము వారిలో ప్రజ్వలించుచుండెను. ప్రజాప్రభుత్వమైన ఫ్రాంసు ఆత్మరక్షణకు సిద్ధమైయుండెను. మిగత యూరోపంతా,—రాజుల యూరోపు—దానికి వ్యతిరేకులైయుండిరి. ప్రజాప్రభుత్వమైన ఫ్రాంసు, స్వాతంత్ర్యమును సంపాదించిన దేశభక్తులెట్లు పోరాడగలరో బూజుపట్టిన ఈ రాజులకు చూపగలదు. వారు కొత్తగా సంపాదించిన స్వాతంత్ర్యమును నిలుపుకొనుటకేకాదు; కులీనులచేతా, రాజులచేతా పీడింప బడుచున్న ఇతరుల స్వాతంత్ర్యము కొరకుకూడా వారు పోరాడగలరు. ఫ్రెంచి ప్రజలు యూరోపు జాతులకు, తమ రాజులపై తిరగబడవలసిందనిన్నీ, అన్ని జాతులకూ తాము మిత్రులమనిన్నీ,

రాజ ప్రభుత్వములకుమాత్రము శత్రువుల మనినీ ప్రకటించవలసిందని సందేశమునంపిరి. ఫ్రాంసు, ప్రేమమయదేశము, స్వాతంత్ర్యమాత అయినది. ఆమె పీఠమువద్ద ఆత్మార్పణము చేసుకొనుట ఆనందదాయకము. ఉత్సాహము ప్రజ్వలిస్తూన్న ఈ తరుణములో వారికొక అద్భుతమైన గీతము అందింది. మిన్నంటుతూన్న వారి ఉద్వేగమునకది అనుగుణంగా ఉన్నది. ఆటంకములను ఛేదించుకొని, కష్టములను గణించక పాడుతూ రణరంగమునకు ఉరుకునట్లు చేయగలదాగీతము. రైను సైన్యముకోసము, రుజాడి రైల్ అను కవి కూర్చిన యుద్ధగీతమిది. అప్పటినుంచీ దీనికి మార్సెయేజ్ అనిపేరు వచ్చింది. నేడుకూడ ఫ్రెంచి వారి జాతీయగీతమిదియే.

పితృదేశమునందు పుట్టిన
బిడ్డలారా! రండి, రండి!
కీర్తినందే తరుణమిదియే
మనల నణచగ, నిరంకుశులదె
లేవనెత్తిరి క్రూరజెండా
దేశమందున మూల మూలల
ఉగ్రసైనిక గర్జనంబులు
శ్రుతి పుటంబుల పడుటలేదా?
వారు మన పిల్లలను చంపగ
వారు మన భార్యలను చంపగ
వారుయెగబడి వచ్చుచుండిరి
పౌరుడా! లేలెమ్మ, కత్తులు
చేతబూనుము, ఫౌజు ఫౌజుగ
ముందుముందుకు నడిచిపోదాం
దుష్టరక్తము దివ్యభూమిని
మలినపరచెను లెమ్మ, లేలే!

రాజులకు దీర్ఘాయుర్దాయము కోరుతూ వ్యర్థగీతములను వారు పాడలేదు. మాతృ దేశముపై పవిత్ర భక్తి, ప్రేమాస్పదమగు స్వాతంత్రముల గూర్చి మాత్రమే వారు పాడిరి.

పావనమ్మగు దేశభక్తీ!
శత్రునాశము చేయనెత్తిన — మా
ఆయుధములకు దారిచూపుము
ఆయుధములకు పుష్టినిమ్మా!
ప్రేమమయమగు స్వతంత్రమ్మా
నిన్నురక్షించేటి ధీరుల
జేరిపోరుము, చెంతనిలిచి.

వారు పడరానిపాట్లు పడ్డారు. చాలినంత తిండిలేదు; చాలినన్ని బట్టలులేవు; తొడుక్కోడానికి జోళ్ళులేవు; ఆయుధములు సమేతం లేవు. చాలాచోట్ల తమజోళ్ళను సైన్యము కొరకు ఇచ్చివేయమని పౌరులనడిగారు. సైన్యమునకు కావలసిన ఆహార పదార్థములను దేశభక్తులు తమకు లేకుండా చేసుకొని ఇచ్చివేశారు. కొందరు తరుచు ఉపవసించారు. తోలుసామానూ, వంటసామానూ, మూకుళ్ళూ, బాల్చీలూ మొదలైన గృహోపకరణములు ప్రజలనుండి అడిగి తీసుకొన్నారు. పారిస్ వీధులలో ఎన్నో కొలిములు పెట్టి పనిచేయ మొదలుపెట్టారు. స్త్రీ, పురుషులందరూ ఆయుధములు తయారుచేయుటకుకూడా సహాయం చెయ్య మొదలుపెట్టారు. ఏన్నో కష్టములు వారి నెదుర్కొన్నవి. అయితే ఏమి? వారి ఫ్రాంసు, ప్రేమమయదేశము, అందమైన ఫ్రాంసు గుడ్డపీలికలు కట్టుకొన్నా స్వాతంత్ర్య కిరీటమును ధరించిన ఫ్రాంసు ఆపత్తులో నున్నప్పుడు, శత్రువు ద్వారమువద్ద కూర్చున్నప్పుడు వారు కష్టములు లెక్కపెట్టుదురా? ఫ్రాంసులోని పడుచువారంతా దానిని రక్షించడానికి నడుములు బిగించారు. ఖుత్పి పాపసలను లెక్కబెట్టలేదు. వారు విజయము సాధించడానికిట్లు నడిచివెళ్ళారు. కార్లైలు యిట్లు

చెప్పుచున్నాడు—"తినే వస్తువులూ, వాడుకొనేవస్తువులూ మినహాయిస్తే ఇక ఏ విషయములలోనూకూడా ప్రజలందరికీ ఒకేమారు శ్రద్ధ తరుచు కుదరదు; శ్రద్ధయే కుదిరినదా వారి చరిత్ర ఉజ్వలమై, పూజ్యమగును." మహత్కార్యమును సాధించవలెననే శ్రద్ధ విప్లవ వీరులైన స్త్రీ, పురుషుల నావేశించింది. ఆ పవిత్ర దినములలో వారు నిర్మించిన చరిత్రా, చేసినత్యాగమూ ఇప్పుడుకూడా మనలను కదిపి, ఉద్రేక పూరితులను చేస్తూన్నవి.

కొత్తగా చేర్చుకోబడి పూర్తిగా శిక్షనందని సైనికులు కలిగినట్టి ఈ విప్లవ సైన్యములు ఫ్రెంచి గడ్డనుండి పరదేశ సైన్యములనన్నింటినీ పారదోలినవి. తరువాత బెల్జియం మున్నగు నెదర్లాండు దేశములను ఆస్ట్రియనుల బారినుండి విముక్తి నందించినవి. హాప్సుబర్గు కుటుంబము నెదర్లాండులను చివరసారి విడచివెళ్లెను. మళ్ళీ తిరిగి రాలేదు. సైనిక వృత్తిలోనుండి సుశిక్షితులైన యురోపు సైన్యములు విప్లవ సైనికుల ముందు నిలువలేకపోయారు. శిక్షిత సైనికుడు జీతంకోసము జాగ్రత్తతో పోరాడుతాడు. విప్లవ సైనికుడు ఆదర్శంకోసం తెగించి పోరాడుతాడు. విజయము సాధించడానికి విపత్తులను లక్ష్యపెట్టడు. శిక్షిత సైనికుడు పెద్ద మూటలతో కదలాలి. విప్లవ సైనికుడు మోసేదాట్టే ఏమీలేదు. కాబట్టి చురుకుగా పోతాడు. యుద్ధములో పోరాడుటకు విప్లవ సైన్యములు కొత్తమాదిరి సైన్యములైనవి. వారు ఒక నూతన విధానమున పోరాడిరి. వెనుకటి యుద్ధ పద్ధతులను వారు మార్చివేసిరి. తరువాత 100 సంవత్సరములవరకూ యూరోపులోని సైన్యములకు ఈ సైన్యములు మాదిరులైనవి. కాని ఈ సైన్యములకున్న నిజమైన బలము వారి ఉత్సాహములోనూ, వారి సాహసములోనూ ఉండెను. వారి బిరుదు వాక్యముగా, ఈ స్థితిలోనున్న విప్లవముయొక్క బిరుదు వాక్యముగా సైతము డాంటన్ ప్రసిద్ధ వచనము పనికివస్తుందని చెప్పవచ్చును.

"దేశ ద్రోహులను నిర్జించడానికి మనము సాహసించ

వలెను; మరల మరల సాహసించవలెను; నిరంతరమూ సాహసించవలెను."

యుద్ధము వ్యాపించెను. దానికి నౌకాదళము ఉన్నది కాబట్టి ఇంగ్లాండు ప్రబలశత్రువయ్యెను. ప్రజాప్రభుత్వ ఫ్రాంసు భూమిమీద పోరాడుటకు గొప్ప సైన్యమును చేకూర్చెను గాని సముద్రపై పోరాడుటకు దానికి శక్తిజాలదు. ఫ్రెంచి రేవుపట్టణములనన్నింటినీ ఇంగ్లాండు ముట్టడించెను. ఇంగ్లాండులోనున్న ఫ్రెంచి కాందిశీకులు, దొంగ కరెన్సీ నోట్లను—ఫ్రెంచి ప్రజాప్రభుత్వము వేసిన నోట్లువంటి నోట్లను—అచ్చుగుద్దించి లక్షలకొద్దిగా ఫ్రాంసులో కురిపించిరి. ఈ విధముగా ఫ్రెంచి చలామణీని, రాజ్యాదాయమును భంగముచేయుటకు వారుప్రయత్నించిరి.

పరదేశములతో యుద్ధము అన్నింటికంటె ప్రధానమయ్యెను. దేశముయొక్క శక్తి అంతా దానికై వినియోగపడెను. విప్లవముల కట్టి యుద్ధములు ప్రమాదకరములు. ఎందువల్లనంటే—సంఘ సమస్యలను పరిష్కరించుటకు బదులు పరదేశ శత్రువులతో పోరాడవలసివచ్చుటచే విప్లవముయొక్క ఉద్దేశమే భంగపడును. విప్లవజ్వరము స్థానే యుద్ధ జ్వరము ప్రవేశించును. ఫ్రాంసులో ఇట్లు తటస్థించెను. ఫ్రాంసు చివర దశలో ఒక గొప్ప సేనానాయకుడు నియంతయైన సంగతి ముందు ముందు మనము తెలిసికోగలము.

ఇంటివద్దకూడా అల్లరులు బయలుదేరెను. ఫ్రాంసుకు పడమర వెండీలో గొప్ప కర్షకుల తిరుగుబాటు తలయెత్తెను. అచ్చటి కర్షకులు క్రొత్తసైన్యములలో చేరుటకు నిరాకరించడము ఇందుకు కొంతకారణము. రాజ పక్షవలంబుల నాయకులయొక్కయు, కాందిశీకులయొక్కయు కృషి కొంత కారణము. పారిస్ నగర ప్రజలే విప్లవమును నడిపిస్తూ ఉండిరి. రాజధానిలో శీఘ్రముగా జరుగుచున్న మార్పులు వారికి అర్థము కాలేదు. కాబట్టి వారు వెనుకబడిరి. వెండీ తిరుగుబాటు బహు క్రూరముగా అణచివేయబడినది. యుద్ధ సమయములో, అందు ముఖ్యముగా

అంతఃకలహ సమయములో ప్రజలలో కామక్రోధాదులు పిచ్చిగా చెల రేగుతవి. కనికరమున కక్కడ తావులేదు. లయన్సులో ప్రతివిప్లవము తలయెత్తెను. అది అణచివేయబడెను. అందుకు శిక్షగా లయన్సు మహా నగరమును ధ్వంసము చేయవలెననుకొన్నారు. "లయన్సు స్వాతంత్ర్యముపై కత్తి దూసినది—లయన్సు నిలిచియుండదు!" అదృష్ట వశమున దానిని ధ్వంసము చేయుటకు సమ్మతించలేదు కాని లయన్సు చాలా బాధపడవలసివచ్చింది.

ఇక అక్కడ పారిస్‌లో ఏమిజరుగుచున్నట్లు? కొత్తగా ఎన్నుకో బడ్డ కమ్యూన్యూనున్నూ, దాని భాగములున్నూ ఇంకను నగరవాసులపై పలుకుబడి గలిగియున్నవి. నేషనల్ కన్వెంషనులో వివిధ వర్గముల వారు అధికారానికి పెనగులాడుకొంటున్నారు. వారిలో ప్రధానులు గిరోన్‌డినులు అనువారు ఒకరు. వీరు మితవాదులైన ప్రజాప్రభుత్వ వాదులు. జాకోబినులనువారు ఒకరు. వీరు అతివాదులైన ప్రజాప్రభుత్వ. వాదులు. చివరకు జాకోబినులు నెగ్గిరి. 1793 జూన్ ప్రారంభమున గిరోండిన్ ప్రతినిధులనేకులు కన్వెంషన్ నుండి తొలగింపబడిరి. కన్వెం షన్ ఇప్పుడు ఫ్యూడల్ అధికారములను రద్దు చేసెను. ఫూడ్యల్ ప్రభు వులకు చెందిన భూములను స్థానిక కమ్యూన్యులకు—పురపాలక సంఘము లకు—ఇచ్చివేయబడెను. అనగా ఈ భూములు ప్రజల ఆస్థి అయినవి.

జాకోబినుల వశమైయున్న కన్వెంష నిప్పుడు రెండు కమిటీలను స్థాపించెను. ప్రజాభద్రతాసంఘము, ప్రజాశ్రేయస్సంఘము అని వాటి పేళ్ళు. వీరు ఇష్టమువచ్చినట్లు చేయుటకు అధికారములు విపులముగా ఇయ్యబడినవి. ఈ కమిటీలు, అందు ముఖ్యముగా భద్రతా సంఘము వెంటనే చాలా ప్రబలమై భీతావహమయ్యెను. కన్వెంషన్ పేరను ఒక్కొక్క కార్యమే చేసుకొంటూ పోగా పోగా చివరకు విప్లవము రాక్షసత్వరూపమును దాల్చినది. ప్రతీవారినీ భయము ఆవహించింది. వారిని చుట్టియున్న విదేశ శత్రువులనుచూచి భయము; గూఢచారులనూ,

దేశద్రోహులనూ చూచి భయము; ఇట్టి వారనేకులున్నారుకూడా. భయము కళ్లు కప్పుతుంది. భయగ్రస్తులై ప్రజలు దేనికైనా తెగిస్తారు. వెంటాడుతూన్న ఈ భయము పురిగొల్పగా కన్వెంషను 1793 సెప్టెంబరులో ఒక భయంకర శాసనముచేసెను. ద్రోహులని అనుమానింపబడిన వారి నుద్దేశించిన శాసనమది. అనుమానింపబడ్డ వాడెవ్వనికీ భద్రతలేదు. అనుమానింపబడకుండా ఎవ్వరుండగలరు ? ఒక నెల పిమ్మట కన్వెంషనులోనున్న ఇరవై యిద్దరు గిరోండిన్ ప్రతినిధులు విప్లవ న్యాయ సభచే విచారించబడి మరణదండన పాలైరి.

రాక్షసత్వ మీవిధముగా ప్రారంభమాయెను. రోజుకు రోజు మరణదండన విధింపబడినవారు, వధ్య స్థానమునకు పోవుచుండిరి. రోజుకు రోజు ఈ దురదృష్టవంతులను వధ్య స్థానమునకు తీసుకొని పోవు బండ్లు—వీటిని టంబ్రిలుల అనేవారు—పారిస్ వీధులగుండా గుండు రాళ్ళమీద దొర్లుకుంటూ, కిర్రుమంటూపోయేవి. పాలకవర్గమునకు వ్యతిరేకముగా కన్వెంషనులో మాట్లాడుటకూడా ప్రమాదకరమే. అట్లా చేయడంవల్ల అనుమానానికి గురికావచ్చు. అనుమానమున్నచోట విచారణా, మరణదండనా తప్పవు. కన్వెంషను భద్రతాసంఘము, శ్రేయస్సంఘముల స్వాధీనములో ఉండెను. ఈ కమిటీల చేతులలో ప్రాణదానము, ప్రాణహరణము చేసే అధికారముండెను. ఈ అధికారమును అది వదలుకో తలుచుకోలేదు. పారిస్‌లోని కమ్యూన్‌కు వారు వ్యతిరేకముగా ఉండిరి. తమకార్యము లంగీకరించనివారిపట్ల వ్యతిరేకముగా ఉండిరి. అధికారము ఎట్లు మనుష్యులను పాడుచేస్తుందోచూడు. ఈ కమిటీలు కమ్యూన్ను అణచివేయుటకు ప్రారంభించినవి. విప్లవమునకు వెన్నెముక వంటివి ఈ కమ్యూనున్నూ, దాని భాగములున్నూ. మొదట భాగముల వారుఅణచివేశారు. దాని ఆధారములు కొట్టివేసి పిదప కమ్యూన్ను అణచివేశారు. తరుచు విప్లవము ఇట్లు తనను తానే తినివేయును. పారిస్ ప్రతి భాగమందూ ఉన్నట్టి కమ్యూన్

భాగములు ప్రజా సామాన్యమునకును అధికారములో ఉన్నవారికిని సంబంధ మేర్పరుచుచుండెను. విప్లవ రక్తము పారే రక్తనాళములవి. వాటివల్లనే విప్లవమునకు బలము. అవియే విప్లవమునకు ప్రాణము. 1794 లో కమ్యూన్యునూ, దాని భాగములనూ అణచివేయుటవల్ల ప్రాణమును ప్రసాదించే రక్తమును నిరోధించినట్లయినది. ఇప్పటినుంచి కన్వెంషనున్నూ, దాని కమిటీలున్నూ ప్రభుత్వాంగములైనవి. ప్రజలతో వాటికి సంబంధము లేదు. అధికారములోనున్నవారు చేసేటట్లే అవిన్నీ తమ అభీష్టమును రాక్షసత్వముద్వారా ఇతురులమీద రుద్దుటకు ప్రారంభించినవి. యదార్థ విప్లవకాలమునకు అంత్యకాలమిప్పుడే ప్రారంభమైనది. మరి ఆరు నెలల వరకూ ఈ రాక్షసత్వము జరుగనున్నది. విప్లవము సాగనున్నది. కాని అవసానము సమీపమునకు వచ్చినది.

ఈ ఒడుదుడుకు కాలములో పారిస్‌లోనూ, ఫ్రాంసులోనూ పని చేసిన నాయకులెవరు? చాలా పేర్లు ప్రస్ఫుటముగా కనిపిస్తున్నవి. 1789 లో బాస్టీలును ముట్టడించుటకు నాయకత్వము వహించినట్టిన్నీ, ఇతర సమయములలోకూడా ప్రసిద్ధ పాత్ర వహించినట్టిన్నీ కామిల్లెడా మొలాన్ ఒకడు. రాక్షసత్వము విజృంభించు కాలమున దయతో ప్రవర్తించమని చెప్పినందుకు ఇతడు మరణదండన పాలాయెను. కొద్ది రోజుల తరువాతనే చిన్నవయస్సులోనున్న అతని భార్య లూసిల్, భర్తలేని బ్రతుకు తనకెందుకని అతని ననుసరించి మరణదండన పాలైనది. కవియగు ఫాబ్రెరు డిగ్లాన్‌టైన్ ఒకడు. గడ గడ లాడించిన పబ్లిక్ ప్రాసెక్యూటరైన ఫూకీయే టిన్‌విల్ ఒకడు. విప్లవ పురుషులలో మిక్కిలి సమర్థుడు, ఘనుడు అయిన మారట్ ఒకడు. ఇతడు ఛార్లొటి కోర్డె అను బాలికచే పొడిచి చంపబడెను. డాన్‌టన్ అను వాడొకడు. ఇతని వాక్యములు రెండు పర్యాయములు నేనుదహరించియున్నాను. ఇతడు ధైర్యశాలి, సింహబలుడు. ప్రజారంజకముగా ఉపన్యాసములు

చెప్పు ప్రజ్ఞ గలవాడు. అయినా ఇతడున్నూ వధ్యశిలమీదనే ప్రాణములు విడిచెను. అందరికన్న ప్రసిద్ధుడగు రాబెస్‌ప్యేర్ అనువాడొక్కడు. ఇతడు జాకోబినుల నాయకుడు. రాక్షసత్వ కాలమున కన్వెంషన్‌లో ఇతడు నియంతయై పనిచేసెను. రాక్షసత్వమతనిలో మూర్తీభవించెను. అతనిని తలుచుకుంటే చాలామందికి వడకుపుట్టుతుంది. అయినా ఇతడు బహు నమ్మకస్థుడు; గొప్ప దేశభక్తుడు. దుర్నీతికతని నొడబరుచుట దుస్సాధ్యమని చెప్పుదురు. నిరాడంబర జీవనము గడుపుతున్నవాడై నప్పటికి అతడు అహంకార పూరితుడు. తన అభిప్రాయముతో అంగీక రించని ప్రతివాడూ ప్రజాప్రభుత్వ విప్లవములపట్ల ద్రోహబుద్ధి కలవాడని అతడు తలచినట్లు తోస్తుంది. విప్లవములో పనిచేసిన మహా పురుష లనేకులను అతనితోకూడా పనిచేసిన వారిని అతడు మరణ దండన పాలు గావించెను. చివరకు వినమ్రభావముతో అతని ననుసరించు చుండిన కన్వెంషను అతనికి ఎదురు తిరిగింది. వారతనిని నిరంకుశుడనీ, క్రూరుడనీ నిందించి, అతనినీ అతని నిరంకుశత్వాన్నీ తుదముట్టించారు.

విప్లవ నాయకులందరూ యువకులు. వృద్ధులు విప్లవములు లేవదీయలేరు. నాయకులనేకులు ప్రధానులైనప్పటికీ వారిలో ఎవరూ, రాబెస్‌ప్యేర్ సైతము, ఈ మహా నాటకములో ప్రముఖ పాత్ర వహించ లేదు. విప్లవమన్నప్పుడు వారు జంకినట్లు తోస్తుంది. ఎందువల్లనంటే వారివల్ల విప్లవము రాలేదు సరిగదా వారు విప్లవమును నడిపించనైనా నడిపించలేదు. చరిత్రలో అప్పుడప్పుడు తటస్థించే భౌతిక శక్తులతో కూడిన మానవ భూకంప మీ విప్లవము. సంఘ పరిస్థితులూ, చిర దుఃఖమూ, నిరంకుశత్వమూ దీనిని మెల్ల మెల్లగా, తిరుగులేకుండా ఉండేటట్లు, పెంచుతవి.

కలహములూ, మరణ దండనలూ తప్ప కన్వెంషన్ యింకేమీ చెయ్యడంలేదని అనుకోకు. నిజమైన విప్లవముచే బహిర్గతముచేయబడ్డ శక్తి చాలాగొప్పది. విదేశ యుద్ధములలో ఈ శక్తి చాలావరకు

వినియోగపడినది. ఇంకా మగిలినది చాలా ఉన్నది. నిర్మాణాత్మక కార్యములనేకమది చేసినది. ముఖ్యముగా జాతీయ విద్యావిధానము పూర్తిగా సంస్కరింపబడినది. ఇప్పుడు బడులలో ప్రతి పిల్లవాడును నేర్చుకొను మెట్రిక్ సంప్రదాయము (Metric System) అప్పుడు ప్రవేశపెట్టబడినది. తూనికలను, కొలతలను అది సులభము చేసినది. నాగరీక ప్రపంచమందంతటను ఈ సంప్రదాయము నేడలముకొన్నది. కాని పూర్వాచార బద్ధమగు ఇంగ్లాండులో మాత్రము పాతకాలపు గజములు, ఫర్లాంగులు, పౌనులు, హండ్రడ్వెయిటులు మొదలైనవి వాడుకలో ఉన్నవి. ఇండియాలో మనము ఈ క్లిష్టమానములతోనూ—దైర్ఘ్యమానము, తూనికమానము—మణుగులు, శేర్లు మున్నగువాటితోనూ సహించి ఉండవలసి వచ్చినది.

మెట్రిక్ సంప్రదాయము ననుసరించి ప్రజాప్రభుత్వ పంచాంగము వెలువడుట సహేతుకమేకదా! ప్రజాప్రభుత్వము ప్రకటించిన దినముతో అనగా 1792 సెప్టెంబరు 22 తేదీతో అది ప్రారంభమాయెను. 7 దినముల వారము 10 దినముల వారముగా మార్చబడెను. పదవదినము సెలవుదినము. సంవత్సరమునకు 12 మాసములే కాని వాటి పేర్లు మార్చివేయబడినవి. ఋతుధర్మముల ననుసరించి కవియైన ఫాబర్ డిగ్లాంటైను మాసములకు మనోహరమైన కొత్తపేళ్లు పెట్టెను. వసంతకాలమందలి మూడు మాసముల పేళ్ళు—బీజమాసము, పుష్పమాసము, కేదారమాసము; వేసవికాలమాసముల పేళ్ళు—కోతమాసము, ఉష్ణమాసము, ఫలమాసము; శరత్కాల మాసముల పేళ్ళు—ద్రాక్షసంగ్రహమాసము,శీతలమాసము, పొగ మంచు మాసము; శీతాకాలమాసముల పేళ్ళు—హిమమాసము, వర్షమాసము, గాలిమాసము. ప్రజాప్రభుత్వము అంతరించిన పిమ్మట చిరకాలమీపంచాంగము నిలువలేదు.

ఒకప్పుడు క్రైస్తవమునకు వ్యతిరేకముగానున్నూ, హేతువాదమున కనుకూలముగానున్నూ ఒక ఉద్యమము తలయెత్తినది. "సత్య

మునకు ఆలయములు" నిర్మింపబడినవి. ఈ ఉద్యమము రాష్ట్రములకు కూడా త్వరలో వ్యాపించింది. 1793 నవంబరులో పారిస్ కెథీడ్రిలు నోట్రీడేమ్‌లో స్వాతంత్ర్య హేతువాదములనుద్దేశించి గొప్ప ఉత్సవము జరిగినది. ఒక అందగత్తె హేతువాద పాత్రను ధరించెను. కాని రాబెస్ ప్యేర్ ఇట్టి విషయముల నామోదించడు. అతడు సాంప్రదాయకుడు. అతడు ఆమోదించలేదు. డాంటన్‌కూడా ఆమోదించలేదు. జాకోబిన్ కమిటీ అయిన ప్రజా శ్రేయస్సంఘ మా ఉత్సవమునకు వ్యతిరేకముగా ఉండెను. కాన ఆ ఉద్యమ నాయకులు మరణదండన పాలైరి. అధికారము వధ్యశిలకు తీసుకుపోవును. దానికి మార్గాంతరములేదు. స్వాతంత్ర్య హేతువాదోత్సవమునకు వ్యతిరేకముగా రాబెస్ ప్యేర్ వేరొక ఉత్సవమును చేయించెను—అది పరమాత్మను ఉద్దేశించిన ఉత్సవము. కన్వెంషన్ సభ్యులు వోటు ద్వారా ఫ్రాంసుకు పరమాత్మపై నమ్మకమున్నదని తీర్మానించిరి. రోమన్ కాతలిక్కు మతము తిరిగి ఆదరణ పాత్రమైనది.

పారిస్‌లోని కమ్యూన్యును దాని భాగములను అణచివేసినతర్వాత త్వరితగతిని పరిస్థితులు విషమస్థితికి రా మొదలుపెట్టినవి. జాకోబినులు సర్వాధికారులై యుండిరి. అన్ని వ్యవహారములను వారు చేతిలో పెట్టుకొని నడుపుచుండిరి. కాని వారిలో వారు కలహించుకొనుచుండిరి. స్వాతంత్ర్య హేతువాదోత్సముల నాయకత్వము వహించిన హీబర్టుకును, అతని అనుచరులకును మరణదండన విధించుట కారణముగా జాకోబిన్ పార్టీలో పెద్ద చీలిక ఏర్పడెను. ఫాబర్ డిగ్లానోపైను ఉరిదీయబడెను; 1794 తొలి భాగములో డాంటన్, కామిల్లి డామొలాన్ మొదలగు వారు రాబెస్ ప్యేర్ అనేకులను మరణదండనపాలు చేస్తున్నాడనే కారణమున తమ అసమ్మతిని తెలిపిరి. అట్లు తెలిపినవారునూ మరణదండన పాలైరి. ప్రజలు కలుగజేసుకొనుటకు అవకాశము లేకుండా డాంటన్‌ను 1799 ఏప్రియల్‌లో తొందరగా వధ్య శిలపై చంపిరి.

పారిస్ ప్రజలును, రాష్ట్రప్రజలును ఈ మరణము విప్లవాంతమని అనుకొన్నారు. విప్లవమునకు సింహమువంటివాడైన డాంటన్ కూలిపోయెను. ఇప్పుడు అధికారము ఒక చిన్నజట్టు చేతులలో ఉండెను. శత్రువులన్ని వైపులా చుట్టుకొన్నారు. ప్రజలతో సంబంధము తెగిపోయింది. ఈ సందర్భములలో ఈ జట్టుకు ఎక్కడచూచినా ద్రోహమే కినిపించింది. రాక్షస పరిపాలనమును తీవ్రము చేస్తేతప్ప దానికి బ్రదికే మార్గం కనబడలేదు.

కాన రాక్షసత్వము పెరిగిపోయింది. వధ్య స్థానమునకు పోయే బండ్ల (టంబ్రిలులు)లో జనులు క్రిక్కిరిసిపోయారు. జూన్‌లో ఒక క్రొత్త శాసనము జారీ చేయబడినది. దాని పేరు ప్రైరియల్ నెల 22 తేదీ శాసనము. ఈ శాసనము ప్రకారము ప్రజలను విడదీయుటకుగాని, రేపుటకుగాని తప్పుడు వార్తలు వ్యాపింపజేయుట, ప్రజలనీతికి, ప్రజల విశ్వాసములకు భంగము వాటిల్లు వార్తలు ప్రచారముచేయుట నేరముగా పరిగణింపబడుతుంది. ఈ నేరమునకు దండన మరణమే. రాబెస్ ప్యేర్ యొక్క, అతని అనుచరులయొక్క అభిప్రాయములతో అంగీకరించని ప్రతి ఒక్కడూ ఈ శాసనమను పెద్ద వలలో చిక్కుకొనవచ్చు. ఒకేమారు పెద్ద జన సమూహములకు విచారణ జరిగేది. మరణదండన విధింపబడేది. ఒకమారు నేరస్థులనూ, రాజ పక్షవలంబులనూ, ఇతరులనూ కలిపి 150 మందిని విచారించారట.

46 దినములపాటు ఈ రాక్షసత్వము చెలరేగెను. చివరకు థెర్మిడార్ (ఉష్ణ) మాసము 9 వ తేదీని (1794 జూలై 27) పురుగు తిరగబడింది. హఠాత్తుగా కన్వెంషను రాబెస్ ప్యేర్ మీదా, అతని అనుచరులమీదా తిరగబడింది. "ఈ క్రూరుణ్ణి పదభ్రష్టుని చెయ్యండి" అనే కేకలతో వారిని పట్టుకొన్నారు. రాబెస్ ప్యేరుని మాట్లాడనియ్య లేదు. మరుసటి దినము టంబ్రిల్ బండిలో, అనేకులకు అతడు చావి ప్పించిన వధ్య స్థానమునకు, అతడు నడిచి ప్రాణములు విడిచాడు. ఈ

విధముగా ఫ్రెంచి విప్లవము అంతమైనది.

రాబెస్ ప్యేర్ పతనానంతరము ప్రతివిప్లవము సంభవించింది. మితవాదులు ముందుకు వచ్చారు. వీరు జాకోబినులమీద పడి వారిని హింసించారు. రక్తరాక్షసత్వమైన పిమ్మట శ్వేత రాక్షసత్వమువచ్చింది. 15 మాసములైన పిమ్మట 1795 అక్టోబరులో కన్వెంషన్ విచ్ఛిన్నమై పోయెను. అయిదుగురు సభ్యులు గల డైరక్టరీ ఇప్పుడు ప్రభుత్వ మయ్యెను. ఇది బూర్జువా ప్రభుత్వము. ఇది సామాన్య ప్రజల నణచి పెట్టుటకు ప్రయత్నించెను. నాలుగు సంవత్సరములు పైగా డైరక్టరీ ఫ్రాంసును పాలించెను. దేశములో ఇన్ని చిక్కులు సంభవిస్తున్నప్ప టికీ విప్లవము ఇతర దేశములతో జయప్రదముగా యుద్ధము సాగించు చునే ఉండెను. విప్లవముయొక్క ప్రతిష్ఠా, బలమూ ఎంతగానుండెనూ? డైరక్టరీమీద కొన్ని తిరుగుబాట్లుకూడా జరిగినవి. కాని అవి త్వరలోనే అణచివేయ బడినవి. ఈ తిరుగుబాటు నొకదానిని ప్రజాప్రభుత్వసేనాని యగు ఒక యువకుడు, నెపోలియన్ బోనాపార్ట్ అనువాడు అణచి వేసెను. ఇతడు పారిస్ ప్రజా సంఘముపై తుపాకులు కాల్చి, వారిలో పలువురిని చంపుటకు సాహసించెను. ప్రజాప్రభుత్వ సైన్యము చేతనే ఫ్రాంసులోని సామాన్య ప్రజలను చంపించ గలిగినప్పుడు ఇక విప్లవ చ్ఛాయకూడా దేశములో లేదనే చెప్పవలెను.

ఇట్లు విప్లవము అంతమొందెను. ఆదర్శపరుల దివ్య స్వప్నము లనేకములున్నూ, బీదవారి ఆశలున్నూ దానితో అంతమొందినవి. కాని అది పొందదలచిన లాభములు చాలావరకు పొందింది. ఎన్ని ప్రతి-విప్లవములు వచ్చినా కమతగాళ్లదాస్యము తిరిగి రాదు. ఫ్రెంచి రాజ వంశమైన బోర్బన్ రాజులు తిరిగి వచ్చినప్పుడైనా రైతులకు పంచి పెట్టబడ్డ భూమిని తిరిగి తీసుకోలేరు. పొలములో పనిచేసే సామాన్య మానవుడుగాని, పట్టణములో ఉండేవాడుకాని ఇదివరకంటె ఇప్పుడు మంచి స్థితిలో ఉన్నాడు. రాక్షసత్వ కాలమునకూడా విప్లవ పూర్వ

కాలముకంటే చాలా మంచి స్థితిలో ఉన్నాడు. రాక్షసత్వ పరిపాలన మతని నుద్దేశించికాదు. పై తరగతి ప్రజలనుద్దేశించి చేయబడ్డది. చివర రోజులలో బీదవారు కొందరు దాని మూలమున బాధ నందవలసి వచ్చింది.

విప్లవము భగ్నమైనది కాని ప్రజాప్రభుత్వ భావన యూరో పంతటా వ్యాపించింది. దానితోకూడా మానవ స్వత్వ ప్రకటనమున వెల్లడి చేయబడ్డ ధర్మములుకూడా వ్యాపించినవి.

## 103

# ప్రభుత్వముల వైఖరులు

అక్టోబరు 27, 1932

రెండు వారాలనుంచీ నీకు జాబు వ్రాయడంలేదు. నేను శ్రద్ధగా వ్రాయడంలేదు. కథ చివరకు వస్తోందిగదా అని వెనుకబడుతున్నాను. మనమప్పుడే 18 వ శతాబ్దాంతమునకు వచ్చితిమి. 19 వ శతాబ్ది తాలూకూ 100 సంవత్సరములూ మనము పరామర్శించవలసి ఉన్నవి. పిమ్మట 20వ శతాబ్దిలోని 32 సంవత్సరములు విమర్శిస్తే నేటి కాలమునకు వత్తుము. కాని మిగిలిన ఈ 132 సంవత్సరములను గురించీ చెప్పదానికి చాలాగాథ ఉన్నది. మనకు సమీపమందుండుటచేత ఈ కాలపు విషయములు పెద్దగా కనిపిస్తవి. మన మనస్సుల నాక్రమిస్తవి. వెనుకటి విషయములకంటె చాలా ముఖ్యముగా కనిపిస్తవి. మన మిప్పుడు చూచే చాల విషయములకు వేళ్లు ఆ సంవత్సరములలోనూ ఉండును. వెనుకటి శతాబ్దిలోనూ తరువాత జరిగిన సంఘటనలూ, సంభవములూ అనే కీకారణ్యంగుండా నిన్ను తీసుకు వెళ్ళడం సులభమైన పనికాదు. నేను జాబు వ్రాయ సంశయిస్తున్నందుకు ఇది కారణము కావచ్చును. చివరకు నేనుమానవుని గాథ 1932 వరకూ వర్ణించిన

పిస్మటూ, భూతకాలము వర్తమానములో లీనమై భావి కాలచ్ఛాయల ముందు నిలిచినప్పుడూ నేనేమి చేయవలసి ఉంటుందో నాకు తెలియడం లేదు. అప్పుడు నీకేమి వ్రాసేదమ్మా నేను ? చేతితో కలం పట్టుకొని, నిన్ను తలచుకొంటూ నా ప్రక్కని ఎన్నో ప్రశ్నలు వేస్తూ కూర్చున్నావనీ, నేను సమాధానము చెప్పుతున్నాననీ ఊహించుకొంటూ ఉండడానికప్పుడు నాకేమి సాకు దొరుకుతుంది ?

ఫ్రెంచి విప్లవమును గురించి నీకు మూడు జాబులు వ్రాసి యుంటిని—ఫ్రెంచి చరిత్రలో అయిదేళ్ళ ఘట్టమునువర్ణించే మూడు దీర్ఘ లేఖలు. యుగములగుండా ప్రయాణము చేసేటప్పుడు శతాబ్దులు ఒక అంగలో దాటితిమి. భూఖండములకేసి ఒకమారు చూచితిమి. కాని ఇక్కడ ఫ్రాంసులో 1789 నుంచి 1794 వరకూ ఎక్కువకాలము నిల్చితిమి. ఆ విషయములు నామనస్సునంతా ఆక్రమించాయి. నా కలము ఆగకుండా పరుగెత్తుకు పోగోరింది. అయినా నేనెంతో సంగ్రహంగా చెప్పడానికి ప్రయత్నించానంటే నీవు ఆశ్చర్యపోతావు. చారిత్రకముగా ఫ్రెంచి విప్లవము చాలా ముఖ్యమైనది. ఒక యుగాంతమునూ, వేరొక యుగారంభమునూ అది తెలుపుచున్నది. నాటకమునందువలె సంఘటనలు సంభవించుటవల్ల అది మరిన్నీ ఆకర్షణీయముగా ఉండెను. దానినుంచి మనము నేర్చుకోవలసిన విషయము లనేకములున్నవి. ప్రపంచము నేడు మళ్ళీ ఒడుదుడుకు స్థితిలో ఉన్నది. గొప్ప మార్పులు రాబోవుచున్నవి. మన దేశమునందు మనము విప్లవ కాలమున నివసిస్తున్నాము. ఎంత శాంతయుతమైనా అదివిప్లవమే. కాబట్టి ఫ్రెంచి విప్లవమునుబట్టీ, మన కళ్ళముందు మన కాలములో రష్యాలో జరిగిన మహా విప్లవమునుబట్టీ మనమనేక విషయములు గ్రహించుకో వచ్చును. నిజమైన ప్రజా విప్లవములైన ఈ రెండున్నూ జీవితము యొక్క దుర్భరమగు యథార్థ విషయములపై తీవ్ర కాంతిని బరపి వాటిని వెల్లడిబెట్టును. మెరుపు మెరిసినట్లు మెరిసి భూభాగమునంతనూ,

అందు ముఖ్యముగా చీకటి కోణములను, వెల్లడి బెట్టును. కొద్ది కాలము పాటు గమ్యస్థానం స్పష్టంగా, దగ్గిర ఉన్నట్టుగా కనిపిస్తుంది. శ్రద్ధా శక్తులు మానవుల నావరిస్తవి. సంశయ సంకోచములు అంతర్ధాన మౌతవి. దీనితో కొంతవరకు సరిసమానమైన గమ్యస్థానము ఉందని ఎవ్వరైనా చెప్పినప్పటికీ రాజీకి దిగరు. ముందు వెనుకలు చూడకుండా బాణమువలె తిన్నగా గమ్యస్థానమును చేరుటకు విప్లవకారులు నడిచి వెళ్లుదురు. వారి దృష్టి ఎంత సరళంగా, సూక్ష్మంగా ఉంటుందో అంత కంత దూరముగా విప్లవము పోతుంది. కాని ఇట్లా జరగడం విప్లవము ముమ్మరముగా ఉన్నప్పుడే. నాయకులు పర్వత శిఖరముల మీదా, ప్రజలు పర్వతము ఎక్కుతూనూ ఉన్నప్పుడే. కాని పాపము, వారు పర్వతముల మీదనుంచి, కిందనున్న చీకటి లోయలలోకి దిగవలసిన కాలము వస్తుంది. అప్పుడు విశ్వాసము మందగిస్తుంది. శక్తి సన్నగిల్లుతుంది.

స్వదేశమునుండి బహిష్కరింపబడి విదేశములలో సుమారు తన జీవిత కాలమంతా గడపిన వృద్ధుడగు వాల్టేరు 1778 లో పారిస్ చేరుకొన్నాడు. అంత్యకాలమునకు చేరుకొన్నాడు. అప్పటి అతని వయస్సు 84 సంవత్సరములు. పారిస్ యువకుల నుద్దేశించి అతడిట్లు చెప్పెను—"పడుచువా రదృష్టవంతులు. మహాత్కార్యముల వారు చూడబోతారు." అన్నట్లే వారు మహాత్కార్యముల చూచారు. అందు పాల్గొన్నారు. ఈ మాటలు చెప్పిన పదకొండు సంవత్సరములకే విప్లవ జ్వాలలు రేగినవి. ఎంతకాలము క్రితమో రావలసిన దిది. 17 వ శతాబ్దిలో మహారాజగు లూయీ XIV "రాజ్యమును నేనే" అన్నాడు. 18 వ శతాబ్దిలో అతని తరువాత రాజ్యమునకు వచ్చిన లూయీ XV "నా తరువాత జలప్రళయము" అన్నాడు. ఈ ఆహ్వానము ప్రకారము జలప్రళయము రానేవచ్చింది. లూయీ XVI ను అతని కూటమును తుడిచిపెట్టుకుపోయినది. కులీనులంతకుముందు పౌడరు చల్లిన కృత్రిమ

తలకట్లూ (Wigs), మోకాలు కిందకు వచ్చే పట్టు చల్లడములూ (breeches) ధరించేవారు. వారికి బదులు ఇప్పుడు అట్టి చల్లడములు కాకుండా పూర్తి షరాయిలు తొడిగేవారు ముందుకువచ్చారు. ఫ్రాంసులో ప్రతీ ఒకరూ పౌరుడు, లేదా పౌరురాలు. "స్వాతంత్ర్యము, సమానత్వము, భ్రాతృత్వము—" నూతన ప్రజాప్రభుత్వమునకిది బిరుదు వాక్యమైనది. ఇట్లు ప్రపంచమునకు చాటింపబడినది.

విప్లవ దినములలో రాక్షస పాలనము పెద్దగా కనిపించును. ప్రత్యేక విప్లవ న్యాయస్థానమును స్థాపించినది మొదలు రాబెస్పేయర్ పతనమువరకు 16 వారముల లోపుగా 4000 మంది మరణదండన పాలు చేయబడిరి. ఇది పెద్ద సంఖ్యయే. కాని నిరపరాధులు పలువురీ విధముగా మృత్యువు వాత ప్రవేశించిరన్నప్పుడు మనకెంతో దుఃఖముగా ఉంటుంది. ఫ్రెంచి రాక్షస పాలనము యదార్థ స్వరూపము గ్రహించుటకు కొన్ని విషయములు మనము మనస్సులో పెట్టుకొనవలెను. శత్రువులు, ద్రోహులు, గూఢచారులు ప్రజాప్రభుత్వము చుట్టును ఉండిరి. వీరు ప్రజాప్రభుత్వమునకు వ్యతిరేకులై దాని వినాశమునకు పాటుపడుచుండిరి. మరణదండన విధింపబడినవారిలో ఇట్టివారనేకులుండిరి. రాక్షసపాలన మంతమునకు వచ్చుచున్నప్పుడు అపరాధులతో నిరపరాధులును బాధపడిరి. భయము మనల నావహించినప్పుడు కన్నులకు పొరలు కమ్ముతవి. అప్పుడు అపరాధులెవరో, నిరపరాధులెవరో నిర్ణయించడం కష్టము. ఫ్రెంచి ప్రజాప్రభుత్వము విషమస్థితిలో నున్నప్పుడు దాని గొప్ప సేనానులే కొందరు లఫాయెట్‌వంటి వారు దానిని ద్రోహబుద్ధితో ఎదుర్కొనిరి. నాయకులు ధైర్యమును కోల్పోయి వివేచన లేకుండా వీరూ, వారూ అనకుండా అందరినీ దండించ ప్రారంభించారు.

హెచ్. జి. వెల్సు తన చరిత్రలో చెప్పినట్లు ఆ రోజులలో ఇంగ్లాండు, అమెరికా మున్నగు దేశములలో ఏమి జరుగుచున్నదో

జ్ఞాపకముంచుకొనుట మంచిది. ముఖ్యముగా ఆస్థికి సంబంధించిన క్రిమినలు చట్టము క్రూరముగాఉండెను. చిన్న నేరములకు ప్రజలు ఉరిదీయబడుచుండిరి. కొన్నిచోట్ల అధికారులు చిత్రహింస చేయుచుండిరి. ఆ కాలమున ఫ్రాంసులో రాక్షస పాలనముకింద మరణదండన విధింపబడిన వారి సంఖ్యకంటె ఇంగ్లాండు, అమెరికాలలో యిందుకొరకై ఉరిదీయబడిన వారిసంఖ్య అధికముగా ఉండెనని వెల్సు చెప్పుచున్నాడు.

ఆ రోజులలో పరిపాటిగా ఉన్న బానిసలవేటను తలుచుకొనుము. ఎంత క్రౌర్యము! ఎంత అమానుషత్వము! యుద్ధమును, ముఖ్యముగా నేటి కాలపు యుద్ధమును తలుచుకొనుము. నడివయస్సులోనుండు యువకులు వేలకొద్ది దీనికి ఆహుతి అగుచుండిరి. సమీపమునకు మన దేశమునకు వచ్చి ఈ మధ్య జరిగిన విషయములను గురించి ఆలోచించుము. పదమూడు సంవత్సరముల క్రితము అమృత సరములో, ఏప్రెల్ నెలలో ఒక సాయంకాలమున, వసంతోత్సవ దినమున జెలియం వాలాబాగ్‌లో వందలాది జనులు చంపబడిరి. వేలాది జనులు దెబ్బలు తినిరి. కుట్ర చేసిరన్న కేసులూ, ప్రత్యేక న్యాయస్థానములూ, ఆర్డినెన్సులూ—ఇవన్నీ ఎందుకు? ప్రజలను భీతావహులనుచేసి లొంగదీసుకొనుటకేగదా? నిర్బంధము, భయపూర్వక వశీకరణము (Terrorism) ఎంత ఎక్కువగా ఉంటే గవర్నమెంటు అంత భయపడుతున్నారన్నమాట. ప్రతీ ప్రభుత్వమున్నూ, ప్రతికూల ప్రభుత్వము కానీ, విప్లవ ప్రభుత్వముకానీ, విదేశ ప్రభుత్వముకానీ, స్వదేశ ప్రభుత్వముకానీ—తన ఉనికికే భంగము కలుగవచ్చునని భయపడినప్పుడు భయపూర్వక వశీకరణము చేయును. ప్రతికూల ప్రభుత్వమైతే ప్రజలకు వ్యతిరేకముగా హక్కులనుభవించు అధికారుల కనుకూలముగా నుండునట్లు అట్టిపనిచేయును. విప్లవ ప్రభుత్వమైతే ప్రజల కనుకూలముగానూ, హక్కులనుభవించు కొద్దిమంది అధికారులకు ప్రతికూలముగా నూ ఉండునట్లు అట్టి పని చేయును. విప్లవ ప్రభుత్వము

ఋజువుగాను, నిష్కపటముగాను పనిచేయుచున్నదనవచ్చును. తరుచు అది క్రూరముగా, కఠినముగా ప్రవర్తించినా దానిలో మోసముగాని, జిత్తులుగాని లేవు. ప్రతికూల ప్రభుత్వము మోసముతో కూడుకొన్నది. దాని మోసము బయల్పడెనా అది నిలువలేదని దానికి తెలుసును. అది స్వాతంత్ర్యము అంటుంది. స్వాతంత్ర్యమంటే దాని అభిప్రాయము— ఇష్టమువచ్చినట్లు ఏ కార్యమునైనను తాను చేయగల స్వాతంత్ర్యము అని. అది న్యాయమంటుంది. న్యాయమంటే దాని అభిప్రాయము— ఇతరులు నశించినా సరే దాని అభివృద్ధి కూతగా ఉన్న వర్తమాన పరిస్థితులు ఆ చంద్ర తారకంగా నిలువవలెనని. అన్నింటికన్న ప్రధానము అది శాంతి భద్రతలంటుంది. వీటి మరుగున అది తుపాకులతో కాలుస్తుంది, చంపుతుంది, ఖైదు చేస్తుంది, నోరు కట్టేస్తుంది, న్యాయ విరుద్ధంగా, చట్టవిరుద్ధంగా అన్నిపనులూ చేస్తుంది. శాంతి భద్రతల పేర మన సోదరులు వందలాది ప్రత్యేక న్యాయసభలచే విచారణ చేయబడి మరణదండన పాలయ్యారు. రెండున్నర సంవత్సరములకు పూర్వము, ఒక ఏప్రెల్ దినమున, పెషావరులో, శాంతి భద్రతల పేర, నిరాయుధులైన మన దేశస్థులను, ధైర్యశాలులగు పఠానులను అనేకమందిని మెషీన్ గన్నులు కాల్చి చంపినవి. ఈ "శాంతి భద్రతల" పేరనే బ్రిటిషు విమాన దళము మన ప్రాంత (Frontier) గ్రామము మీదా, ఈ రాకులోనూ బాంబులు ఇష్టమువచ్చినట్లు వేసి పురుషులను, స్త్రీలను, చిన్న పిల్లలను చంపుతున్నాయి. ఆ జన్మమూవికలాంగులను చేస్తున్నాయి. విమానము చూచి ప్రజలు పారిపోయి తప్పించుకుంటారేమోనని, ఒక రాక్షసయుక్తితో "కాలయాపన బాంబులను" తయారు చేశారు. అవి నేలమీద పడతవి. ప్రమాదము లేదనిపిస్తవి. కొంత సేపటిదాకా పేలవు. గ్రామములలోని స్త్రీ, పురుషులు విమానం పోవడంతోనే ప్రమాదం తప్పిందిగదా అనుకొని ఇళ్ళకుచేరుకుంటారు. వెంటనే బాంబులు పేలి, మనుష్యులను చంపి నాశనముచేస్తవి.

లక్షలాది జనులు రోజుకు రోజు తిండికిలేక కడుపు మాడ్చుకొనే దారుణ దృశ్యము చూడు! మనచుట్టూ ఉన్న దుస్థితికి మనమలవాటు పడతాము. కార్మికులూ, కర్షకులూ మనకంటె మోటువాళ్ళనీ, వాళ్ళకంత బాధగా ఉండదనీ మనమూహిస్తాము. పొడుస్తూ ఉన్న మన అంతఃకరణనుజోకొట్టడానికి చెప్పుకొనే వ్యర్థ సమాధానములివి! బీహారులోని "జారియా" బొగ్గు గనిని ఒకమాటు నేను చూచాను. భూగర్భంలో ఎంతో లోతున నల్లని చీకటి బొగ్గు సందులలో స్త్రీలూ, పురుషులూ పని చేస్తూండడము చూచినప్పుడు నేను విభ్రాంతుడ నైతిని. గనులలో పని చేసేవాళ్లు రోజుకు 8 గంటలు పనిచేయాలంటూ చెప్పుతారు. కొందరు ఇది పనికిరాదంటారు. వారింకా ఎక్కువ కాలము, ఎక్కువపని చేయాలంటారు. ఇట్టి వివాదములను గురించి నేను విన్నప్పుడుగాని, చదివినప్పుడుగాని భూమిలోని ఆ చీకటికొట్లు నాకు జ్ఞాపకము వస్తవి. అక్కడ నేను 8 నిమిషములు ఉండలేకపోయాను.

ఫ్రెంచి రాక్షస ప్రభుత్వము అతి దారుణమైనది. దారిద్ర్యము, నిరుద్యోగము అనే నిరంతర దుఃఖములను తలుచుకొంటే అది ఈగ కాటువలె కనిపిస్తుంది. సాంఘిక విప్లవమువల్ల ఇబ్బందులు చాలా ఉన్నాయి. అవి ఎంత గొప్పవైనప్పటికీ ఈ దుస్థితులూ, నేటి రాజకీయ సాంఘిక పరిస్థితులలో వచ్చే యుద్ధములనుబట్టి వచ్చే ఇబ్బందులూ కన్న అవి తక్కువ. ఫ్రెంచి రాక్షస ప్రభుత్వము మనకెంతో దారుణముగా కనిపించును. అందుకు కారణము బిరుదులు వహించినట్టి పురుషులూ, కులీనులూ అందు బాధలు పడ్డారు కాబట్టి. మనమట్టివారిని గౌరవించ అలవాటు పడ్డాము. వారు కష్టములలోనున్నప్పుడు వారికి మనము సానుభూతి చూపుతాము. వారికి సానుభూతి చూపవలసినదే. ఇతరులకూ చూపవలసినదే. కాని అట్టివారు బహు కొద్దిమందిమాత్రమే అని జ్ఞాపకముంచుకొనుటకూడా మంచిది. వారు సుఖముగా ఉండాలనే మనము కోరవచ్చు. కాని నిజముగా పరిగణించదగ్గవారు ప్రజాసామాన్యమే.

కొద్దివారి సౌఖ్యము కొరకు బహు సంఖ్యాకులను మనము బలి ఇయ్య కూడదు. రూసో ఇట్లు వ్రాస్తున్నాడు—"మానవజాతి ప్రజాసామాన్యము వల్లనే ఏర్పడుచున్నది. ప్రజా సామాన్యము కానిభాగము మిక్కిలి చిన్నది. దానిని లెక్కపెట్ట నవసరములేదు."

ఈ జాబులో నీకు నెపోలియనును గూర్చి వ్రాయదలచితిని. కాని నా మనస్సు ఇటూ అటూ పరుగెత్తింది. నా కలము ఇతరవిషయములను చర్చించింది. నెపోలియనును గురించి ముందు వ్రాయవలసి ఉన్నది. మన ఇష్టమునను సరించి నెపోలియన్ తరువాతిజాబువరకును ఆగవలెను.

# 104
# నెపోలియన్

నవంబరు 4, 1932

ఫ్రెంచి విప్లవమునుండి ఉదయించినవాడు నెపోలియన్. ఫ్రాంసు, ప్రజాప్రభుత్వ ఫ్రాంసు, యూరోపులోని రాజులను ధిక్కరించిన ఫ్రాంసు, ఈ చిన్న కార్సికన్‌కు లొంగిపోయింది. ఆనాడు ఫ్రాంసు వింతయగు ప్రాకృత సౌందర్యముతో వెలయుచుండెను. బార్బియర్ అను ఫ్రెంచి కవి దానిని ఒక వన్యమృగముతో, స్వేచ్ఛతో తిరుగు మదహయముతో పోల్చాడు. తల పైకెత్తిన గుర్రము; ప్రకాశిస్తూన్న శరీరము గల గుర్రము; అందమైన, స్వేచ్ఛా సంచారియైన గుర్రము; జీను వెయ్యనియ్యదు, సామాను పూన్చనియ్యదు, కళ్ళెమును దగ్గిరకు రానియ్యదు. డెక్కలతో భూమిని కొట్టుచుండును. హేషలతో లోక మును భయపెట్టుచుండును. ఈ మదించిన గుర్రము కార్సికానుంచి వచ్చిన ఈ పడుచువాడెక్కుటకు సమ్మతించింది. అతడు దాని సహాయ ముతో ఎన్నో అద్భుత కార్యములు చేశాడు. దానిని అతడు మచ్చిక చేశాడుకూడా. ఇష్టమువచ్చినట్లు స్వేచ్ఛగా సంచరించే భీకరత్వాన్నీ, స్వేచ్ఛనూ కోల్పోయేటట్లుచేశాడు. స్వప్రయోజనానికి దానినత డుపయో

గించుకొన్నాడు. దానిని అలసిపోయేటట్లు చేశాడు. చివరకది అతనిని కిందకు పడదోసింది. తానూ కింద పడిపోయింది.

అయితే నెపోలియన్ ఎటువంటివాడు ? ప్రపంచమందలి మహా పురుషులలో ఒక్కడనిపించు కొంటాడా ? అతనిని "విధి కృతపురుషుడం"టారు గదా ! అతడు మహా వీరుడా? మానవులు వహించు భారములను తగ్గించుటకు సహాయము చేశాడా ? లేదా, హెచ్. జి. వెల్సు మున్నగు వారు చెప్పునట్లు అతడు సాహసకార్యములు చేసేవాడున్నూ, వినాశకుడున్నూ మాత్రమేనా ? యూరోపుకున్నూ, నాగరికతకున్నూ గొప్ప హానిచేసినవాడేగదా అతడు ? బహుశా ఈ రెండు అభిప్రాయములున్నూ అత్యుక్తులే అని తోస్తుంది. ఈ రెండు అభిప్రాయములలోనూ కొంత సత్యమున్నట్లుకూడా తోస్తుంది. మన అందరిలోనూ—గొప్ప వాళ్ళమైనా, కొద్దివాళ్ళమైనా—మంచీ, చెడ్డా వింతగా కలిసి ఉంటుంది. అతనిలోకూడా ఈ కలగలుపు కలదు. కాని మనలోవలెగాక అతనిలో గల ఈ కలగలుపు అసాధారణ లక్షణములతో కూడుకొన్నది. అతనికి ధైర్యముకలదు: ఆత్మవిశ్వాసమూ, భావనాశక్తీ, గొప్ప సామర్థ్యమూ, అత్యాశా అతనికున్నవి. అతడొక గొప్ప సేనాధిపతి. యుద్ధకళలో ఆరితేరినవాడు—వెనుకటి మహా నాయకులైన అలెగ్జాండరు, చెంగిజ్ లతో పోల్చదగినవాడు. కాని అతనిలో అల్పత్వముకూడా ఉన్నది. అతడు ఒంటెత్తు గుణము కలవాడు. దురహంకారి. ఆదర్శము ననుసరించుట అతని జీవితాశయముకాదు. తన చేతులలో అధికారమును పెట్టుకొనుటయే అతడుకోరినది. అతడొకమారు ఇట్లన్నాడు-"అధికారమే నా సాని ! నేనెంతో కష్టపడి దానిని సంపాదించితిని. నాకు లేకుండా ఇతరులామెను తస్కరించుటకు నేనొప్పుకోను. ఇతరులతో దానిని పంచుకోను." అతడు విప్లవమునకు పుత్రుడైనప్పటికీ పెద్ద సామ్రాజ్యము గడించవలెనని అతడు కలలు కనుచుండెను. అలెగ్జాండరు విజయములాతని మనస్సు నావరించినవి. యూరోపు సైతమతనికి

చిన్నభూభాగముగా కనిపించెను. తూర్పు దేశములు, ముఖ్యముగా ఈజిప్టు, ఇండియాలు అతని నాకర్షించినవి. 27 సంవత్సరముల వయస్సునాడు, తన జీవితారంభమందే అతడిట్లు చెప్పెను—"తూర్పు దేశములలోనే మహా సామ్రాజ్యములు వెలిసినవి. గొప్ప మార్పులు కలిగినవి. ప్రాచ్యమందే 60 కోట్ల ప్రజలు నివసిస్తున్నారు. యూరోపు చెదపట్ట వంటిది."

ఫ్రాంసు పాలనలో నున్న కార్సికాలో 1769 సంవత్సరమున నెపోలియన్ బొనపార్ట్ జన్మించెను. ఫ్రెంచి-కార్సికన్ రక్తస్పర్శ, ఇటాలియన్ రక్తస్పర్శ అతనికి కలదు. అతడు ఫ్రాంసులోని సైనిక పాఠశాలలో శిక్షణ పొందెను. జాకోబిన్ క్లబ్బులో, విప్లవకాలమున అతడొక సభ్యుడు. బహుశా అతడు జాకోబినులతో చేరుటకు కారణము ఆత్మలాభేచ్ఛయేగాని వారి ఆదర్శములపై నమ్మకముండికాదు. 1793 సంవత్సరమున టులోన్ వద్ద అతడు తన ప్రధమ విజయమును సాధించెను. విప్లవ పరిపాలన కాలమున వారి ఆస్తులు పోతవేమోనని భయపడి ఈ పట్టణమందలి భాగ్యవంతులు ఇంగ్లీషువారి నాహ్వానించి తమ వద్దనున్న మిగతా నావికాదళమును వారి స్వాధీనము చేసిరి. ఈ విపత్తున్నూ, ఆ సమయమునందే సంభవించిన ఇతర విపత్తులున్నూ బాల్యదశలోనున్న ప్రజాప్రభుత్వమునకు గొప్ప దెబ్బగా పరిణమించెను. ప్రతీ పురుషుణ్ణీ, స్త్రీలను సైతము అప్పుడు సైన్యములో చేర్చుకొనిరి. నెపోలియన్ తిరుగబడ్డ వారిని అణచివేసెను. అతి సామర్థ్యముతో ఎదుర్కొని ఇంగ్లీషు సైన్యమును టులోన్ వద్ద ఓడించెను. అతనికి మంచిరోజులు వచ్చినవి. 24 సంవత్సరముల వయస్సులోనే అతడు సేనానాయకుడయ్యెను. కొద్ది మాసములలో, రాబెస్ ప్యేర్ మరణ దండన పాలైనప్పుడు అతడు చిక్కులలో తగుల్కొనెను. అతడు రాబెస్ప్యేర్ పక్షమువాడేమోనని అనుమానించిరి. నిజమునకు అతడు చెందిన ఒకే పక్షములో ఉన్న సభ్యుడొక్కడే—అతడు నెపోలియన్.

పిమ్మట డైరక్టరీ వచ్చినది. నెపోలియన్, జాకోబిన్ పక్షమునకు చెందినవాడు కాడు సరిగదా అతడు ప్రతి–విప్లవమునకు నాయకుడనే విషయమతడు ఋజువు చేసెను. సందేహమేమాత్రమూ లేకుండా సామాన్య ప్రజపై తుపాకులు పేల్చి అతడు చంపెను. ఇది 1795 లో జరిగెను. వెనుకటి జాబులో ఈ విషయమునుగురించి చెప్పియుంటిని. ఆ దినముననే నెపోలియన్ ప్రజాప్రభుత్వమును గాయపరిచినట్లయ్యెను. పది ఏండ్ల లోపున అతడు ప్రజాప్రభుత్వమును తుదముట్టించి, ఫ్రెంచి చక్రవర్తి అయ్యెను.

1796 లో ఇటలీ సైన్యమునకు నాయకుడై నెపోలియన్ ఉత్తర ఇటలీలో గొప్ప యుద్ధమున పోరాడి యూరోపును ఆశ్చర్య చకితులను చేసెను. ఫ్రెంచి సైన్యమున కింకను విప్లవదీప్తి కొంత నిలిచియుండెను. కాని వారు కట్టుకొన్నవి గుడ్డపీలికలు. వారికి సరియైన దుస్తులుకాని, జోళ్లుకాని, ఆహారముకాని, ధనముకాని లేవు. గుడ్డ పీలికలు ధరించిన ఈ సైన్యమును, అరికాళ్లు ఒరుసుకుపోయిన ఈ సైన్యమును అతడు ఆల్ప్సు పర్వతముల కడ్డుపడి తీసుకుపోయెను. సస్యవంతమైన ఇటలీ చేరడంతోనే మంచి భోజనమూ, మంచి వస్తువులన్నీ రాగలవని సైనికుల కతడు ఆశపెట్టెను. ఇటలీ ప్రజల కతడు స్వాతంత్ర్యమును ఇప్పించెదనని వాగ్దత్తము చేసెను. ఇటలీ ప్రజలను పీడించు వారి బారినుండి వారిని తప్పించుటకు తాను వచ్చుచున్నట్లు చెప్పెను. అర్థములేని విప్లవోచిత వాక్యములతో దోపుడు చేసుకొనుట కనుకూలముగా నుండుననేభావన ఎట్లు కలిసిపోయినదో ! ఇటు ఫ్రెంచి వారికీ, అటు ఇటాలియనులకూ ఇంపుగా ఉండే విధముగా అతడు తెలివి తేటలతో ప్రవర్తించెను. ఇటాలియన్ రక్తస్పర్శ అతనిలో కొంత ఉండుటవల్ల అతని మాటలు యదార్థములనిపించినవి. విజయములు వచ్చినకొద్దీ అతని ప్రతిష్ఠా, కీర్తీ నలుదిక్కులా వ్యాపించినవి. తనసొంత సైన్యములో సామాన్య సైనికునివలెనే అతడు ప్రవర్తించుచుండెను.

సైనికుని అపాయమునుకూడ అతడు పంచుకొనెను. ఏచోట్ల ప్రమాద మెక్కువగా కనిపిస్తుందో సామాన్యముగా ఆచోట్ల అతడు కనబడేవాడు. నిజముగా సమర్థులెవరో అతడు కనిపెట్టి తెలుసుకుంటూ ఉండేవాడు. వెంటనే అట్టివారిని, యుద్ధరంగమునందే బహూకరించేవాడు. అతని సైనికులకతడు తండ్రివలె ఉండెను. కాని ఈ తండ్రికి వయస్సు తక్కువ. "చిన్న కార్పొరల్" అని ప్రేమతో పిలిచేవారు. సైనికు లతనిని "నీవు" అనేవారు. ముప్ఫైయ్యోపదిలో నున్న వయస్సుగల ఈ పడుచు సేనానాయకుణ్ణి ఫ్రెంచి సైనికులు ప్రేమించారంటే ఆశ్చర్యమా?

ఉత్తర ఇటలీలో విజయములు సాధించి, అక్కడే ఆస్ట్రియాను ఓడించి, వెనీసులో చిరకాలమునుంచీ ఉన్న ప్రజాప్రభుత్వము నతడు తుదముట్టించాడు. వారితో అనుచితమైన, సామ్రాజ్య తత్వమున కనుగుణమైన సంధి చేసుకున్నాడు. పిమ్మట అతడు విజేతయగు వీరుడుగా పారిస్‌కు తిరిగి వచ్చాడు. అప్పుడే అతడు ఫ్రాంసును తన చేతిలో పెట్టుకొనుటకు ప్రారంభించాడు. అధికారమును బలవంతముగా గ్రహించుట కది తరుణము కాదని ఊహించికాబోలు అతడు ఈజిప్టు దేశమునకు ఒక సైన్యమును తీసుకొని వెళ్లుటకేర్పాటు చేసుకొన్నాడు. వయస్సు వచ్చినప్పటినుంచి ప్రాచ్య దేశములకు వెళ్లవలెనని అతని మనస్సు పీకుతోంది. ఇప్పుడు అతడు తన కోర్కెను సఫలము చేసుకోవచ్చును. అతని మనస్సు మహా సామ్రాజ్య స్వప్నములతో నిండియుండవచ్చును. మధ్యధరా సముద్రములోని ఇంగ్లీషు నౌకాదళములను తప్పించుకొని అతడు అలెగ్జాండ్రియా చేరుకొనెను.

ఆ కాలమున ఈజిప్టు ఆటొమన్ తురష్క సామ్రాజ్యములో ఒక భాగము కాని ఈ సామ్రాజ్యము క్షీణించింది. క్రియకు టర్కీ సుల్తాను కింద మామెలూకులు నామకః ఈజిప్టును పాలించుచుండిరి. విప్లవములూ, సృష్టములూవచ్చి యూరోపును ఊపివేస్తున్నప్పటికీ మామెలూకులు మధ్య యుగముల పద్ధతుల ప్రకారమే జీవించుచుండిరి. నెపోలి

యన్ కైరో సమీపించి నప్పుడట. ఒక మామెలూకు యోధుడు నిగ నిగ లాడు పట్టు వస్త్రములు ధరించి, ఊదారంగు కవచమును ధరించి ఫ్రెంచి సైన్యమువద్దకు గుర్రమెక్కి వెళ్ళి నాయకుణ్ణి తనతో యుద్ధము చేయమని సవాలు చేశాడట. కాని పాపము ఉదారబుద్ధి చూపక అతని మీద తుపాకులు పేల్చారు. వెంటనే నెపోలియన్ పిరమిడ్ల యుద్ధమున జయముపొందెను. నాటకోచిత భంగిమములన్న అతనికిష్టము. పరిమిడ్ల క్రిందుగా తన సేనలను వెంటబెట్టుకొని అతడు గుర్రముమీద పోతూ సైనికులతో ఇట్లన్నాడు—"సైనికులారా, నలభై శతాబ్దులు మీకేసి చూచుచున్నవి" అని.

భూమిమీద యుద్ధము చేయుటలో అతడు కడుసమర్థుడు. విజయములు పొందుతూనే ఉండెను. కాని సముద్రముమీద అతడు నిరాధారి. లతనికి సమర్థులగు నౌకాదళాధిపతులు ఉన్నట్లు తోచదు. సముద్ర యుద్ధము లతనికి అర్థముకావు. సరిగా ఆ కాలమునందే, ఇంగ్లాండులో, ఒక ప్రతిభాశాలి మధ్యధరా సముద్రము నందున్న నౌకా దళమునకు అధిపతిగా ఉండెను. ఇతనిపేరు హొరాషియో నెల్సన్. ఒకనాడు నెల్సన్ అతి సాహసముతో నౌకాశ్రయమును ప్రవేశించి అక్కడి ఫ్రెంచి నౌకాదళమును నాశనముచేసెను. ఇది నైలు యుద్ధము అందురు. నెపోలియన్‌కు ఫ్రాంసుతో సంబంధము ఇట్లు తెగిపోవుట వల్ల అతడు పరదేశములో ఉండిపోవలసివచ్చెను. కాని రహస్యముగా అతడు తప్పించుకొనిపోయి ఫ్రాంసు చేరెను. ఇట్లు చేయుటకై అతడు ప్రాచ్య దేశముకు కొంపోయిన తన సేనను బలి యిచ్చెను.

విజయములు సాధించినా, రణరంగమున కొంత కీర్తి వచ్చినా తూర్పు దేశముపై చేసిన దండయాత్ర పూర్తిగా విఫలమాయెను. ఈ సందర్భమున ఒక విషయమును గమనించవలెను. నెపోలియన్ ఇటలీకి తనతోకూడా పలువురు విద్యార్థికులను, ఉపాధ్యాయులను అనేకమందిని తీసుకుపోయెను. గ్రంథములును, ప్రయోగములకు పనికివచ్చు అనేక

విధములగు పరికరములను వారు కూడాతీసుకుపోయిరి. ఈ "సంస్థ"లో ప్రతి దినము చర్చలు జరుగుచుండెను. ఈ చర్చలలో పండితులతో సమానముగా నెపోలియన్‌కూడా పాల్గొనుచుండెను. విద్యాధికులు ఇట్లు శాస్త్రపరిశోధన అధికముగా చేయగల్గిరి. వారికచ్చట ఒక నల్లరాతి పలక దొరికెను. అందు ఒక శాసనముండెను. అది మూడు లిపులలో వ్రాయబడియుండెను—ఒకటి గ్రీకులిపి; ఈజిప్టులో పరిపాటిగా ఉన్న రెండు విధములగు సాంకేతికలిపులు మిగత రెండును. గ్రీకు లిపి సహాయముతో మిగత రెండు లిపులును చదువబడినవి. ఈ విధముగా సాంకేతిక లిపిని చదువు సమస్య ఆనాడు పరిష్కరింపబడ్డది. మరిన్ని సూయజ్‌వద్ద ఒక కాలువను త్రవ్వట మంచిదనే ఉపపాదన నెపోలియన్ మనస్సునెంతో ఆకర్షించెను.

ఈజిప్టులో ఉన్నప్పుడు నెపోలియన్ పర్షియాలోని షాతోనూ, దక్షిణ ఇండియాలోనున్న టిప్పుసుల్తానుతోను రాయబారములు జరిపెను. కాని అతనికి సముద్రాధిపత్యము లేకుండుటచే ఈ రాయబారములు విఫలమాయెను. సముద్రాధిపత్యము లేకుంటయే నెపోలియన్ పతనమునకు కారణమైనది. 19వ శతాబ్దిలో ఇంగ్లాండు ఆధిక్యమును పొందుటకు సముద్రాధిపత్యమే కారణము.

ఈజిప్టునుంచి నెపోలియన్ తిరిగి వచ్చుసరికి ఫ్రాంసు చిక్కులలో పడియుండెను. డైరక్టరీ ప్రజామోదమును గోల్పోయెను. దానికి ప్రతిష్ఠ లేకుండెను. కాబట్టి అందరును అతనిపై ఆశపెట్టుకొనిరి. అధికారము గ్రహించుటకు నెపోలియనుకు ఇష్టముగానే ఉండెను. తిరిగి వచ్చిన ఒక నెల అయిన పిమ్మట, 1799 నవంబరులో, అతని సోదరుడు లూసీన్ సహాయముతో, నెపోలియన్ సైన్య బలమునుపయోగించి అసెంబ్లీని రూపుమాపెను. ఈ విధముగా ఏ రాజ్యాంగ వ్యవస్థక్రింద డైరక్టరీపని చేస్తుండెనో దానిని తుదముట్టించెను. ఇట్టి కార్యమువలన నెపోలియన్ అడ్డులేని నాయకుడయ్యెను. ప్రజలకతనిపై

నమ్మకమున్నది. కాబట్టియే అట్టిపని అతడు చేయగగ్గెను. విప్లవ మంత రించి అప్పటికి చాలాకాలమైనది. ప్రజాస్వామికము (Democracy) సైతము అంతరించుచుండెను. ప్రజామోదమును బడసిన ఒక సేనాని ఇప్పుడు ప్రముఖుడయ్యెను. ఒక నూతన రాజ్యాంగ వ్యవస్థ (Constitution) నెలకొల్పబడెను. దీని ప్రకారము ముగ్గురు కాంసలులు (Consuls) ఉందురు (కాంసల్ అనే పదము ప్రాచీన రోమునుండి గైకొనబడ్డది). అందు ముఖ్యుడు సర్వాధికారములు గలిగిన నెపోలియన్. ఇతనిని మొదటి కాంసల్ అనేవారు. పది సంవత్సరముల కాల మితడీ ఉద్యోగములో నుండును. రాజ్యాంగ వ్యవస్థను నిర్ణయించు సమయమున నిజమైన అధికారమేమిన్నీ లేనట్టి ఒక అధ్యక్షుడు ఉండవలెనని ఒకరు ఉపపాదించిరి. అట్టి అధ్యక్షుడు చేయవలసినపని–పత్రములపై చేవ్రాలు పెట్టుట, ప్రజాప్రభుత్వమునకు నామకః ప్రతినిధిగా ఉండుట. నేటి కాలమునందున్న నియమబద్ధరాజులు, ఫ్రెంచి అధ్యక్షుడు వలె ఉండుట. కాని నెపోలియన్ కోరుచున్నది అధికారమే కాని వట్టి రాజత్వ చిహ్నములు కావు. అధికారము లేని, వైభవముతో కూడిన అధ్యక్షపదవులతనికి ఎంతమాత్రమూ ఇష్టములేదు. "ఈ బలిసిన పంది మనకు అక్కరలేద"న్నాడతడు.

నెపోలియన్ పది సంవత్సరముల కాలము మొదటి కాంసలుగా పని చేయవలసిన రాజ్యాంగ వ్యవస్థపై ప్రజల వోటు తీసుకోబడ్డది. దానిని 30 లక్షలమంది–అనగా దాదాపు అందరున్నూ ఆమోదించిరి. తమకు స్వాతంత్ర్యమునూ, సౌఖ్యమును చేకూరుస్తాడనే భ్రమతో ఫ్రాంసు ప్రజలే చేతులారా నెపోలియనుకు సర్వాధికారములూ ఇచ్చిరి.

నెపోలియన్ జీవితచరిత్ర విపులముగా చూచుటకు మనకు వీలు లేదు. అమితమగు కార్యోత్సాహముతోను, తనివి తీరని అధికారకాంక్ష తోను అది నిండియుండెను. వెనుకటి ప్రభుత్వమును కూలదోసిన నాటి రాత్రి, నూతన రాజ్యాంగ వ్యవస్థ ఇంకను నెలకొల్పబడుటకు ముందే

అతడు రెండు కమిటీల నేర్పరచెను. వీటిపని న్యాయ స్మృతిని (Code) తయారు చేయుట. నియంతయైన పిమ్మట అతడు చేసిన ప్రథమ కార్యమిదియే. తయారు చేసిన స్మృతని చాలాకాలము చర్చించిరి. ఈ చర్చలో నెపోలియన్ కూడా పాల్గొనెను. చివరకు 1804 లో ఈ స్మృతి అంగీకరింపబడెను. ఈ శాసనములను 'నెపోలియన్ కోడ్' అందురు. విప్లవ భావములనుబట్టి చూచినను, నేటి ప్రమాణములను బట్టి చూచినను ఈ స్మృతి ముందడుగు వేసియుండలేదు. కాని ఆనాటి పరిస్థితులనుబట్టి చూచిన అది ముందడుగు వేసియుండెను. కొన్ని విషయములలో అది నూరు సంవత్సరముల వరకూ యూరోపుకు దాదాపు మాదిరిగా ఉండెను. అనేక విధములుగా పరిపాలనా విషయమున సారళ్యమును, సామర్థ్యమునూ అతడు అందుప్రవేశపెట్టెను. ప్రతీ విషయమందును అతడు కలుగజేసుకొనుచుండెను. ప్రతి చిన్న విషయమునూ అతడు జ్ఞాపకముంచుకొనుచుండెను. ఇది అతనికున్న అద్భుత శక్తి. అతనికున్న దేహశక్తీ, వీర్యమూ ఆశ్చర్యకరములు. అతనితో పని చేసేవారూ, కార్యదర్శులూ అలిసిపోయినప్పటికీ అతనికి అలుపులేదు. అతనితో సహకరించి పని చేసేవారిలో ఒకడు అతడీకాలములో ఎట్లుండేవాడో ఇట్లువ్రాస్తున్నాడు—"ప్రజలనుపరిపాలిస్తూ, ప్రభుత్వకార్యముల నిర్వహిస్తూ, రాయబారములు నడుపుతూ అతడు క్రమగతమైనబుద్ధితో రోజుకు 18 గంటల కాలము పని చేసేవాడు. నూరు సంవత్సరములలో రాజులు చేసే పరిపాలనా కార్యములకంటె ఎక్కువగా అతడు మూడు సంవత్సరములలో చేశాడు." ఇది అతిశయోక్తి అనుటకు సందేహంలేదు. కాని నెపోలియన్, అక్బరువలెనే, అసాధారణ ధారణాశక్తి కలవాడనీ, అతనిబుద్ధి క్రమపద్ధతులమీద నడుస్తూఉండేదనీ స్పష్టము. అతడు తన్ను గురించి ఇట్లుచెప్పుకొన్నాడు—"ఏ విషయమునైనను సద్యః మనస్సులో లేకుండా చేసుకోవాలంటే దానికి సంబంధించిన సొరుగు మూసేస్తాను. వేరొక విషయమునకు సంబంధించిన సొరుగు తెరుస్తాను. సొరుగు

లలో విషయములు కలిసిపోవు. వాటిని గురించి చికాకుపడను. అవి నాకు అలసట కలిగించవు. నాకు నిద్ర కావలసివస్తే అన్ని చొరుగులూ మూసివేస్తేసరి, నిద్రవస్తుంది." ఈ మాట నిజమే. యుద్ధ మధ్యమున అతడు నేలమీద పండుకొని అరగంట నిద్రపోయేవాడట. లేచి మళ్ళీ ఎంతో కాలము కష్టతరమైన కార్యములలో నిమగ్నుడయ్యేవాడట.

పది సంవత్సరముల కాలము అతడు ప్రథమ కాంసల్‌గా నియమితుడయ్యెను. మూడు సంవత్సరములైన పిమ్మట 1802 లో అధికార సంపాదనలో ఒకమెట్టు ముందుకు పోయాడు. జీవించి యున్నంత కాలమూ అతడేకాంసల్‌గా ఉండేటట్లు తన్నుతానే నియమించుకొన్నాడు. అతని అధికారము వృద్ధి అయ్యెను. ప్రజాప్రభుత్వము అంతరించినది. పేరుమాత్రము లేదు. కాని అతడు రాజే. 1804 లో అతడు చక్రవర్తి నని ప్రకటించుకొనెను. ఇందుకై అతడు ప్రజల వోటు తీసుకొనెను. ఫ్రాంసులో అతడు సర్వాధికారి అయ్యెను. కాని అతనికిని, నిరంకుశులగు పాత రాజులకును చాలా తేడా ఉన్నది. ప్రాచీన సంప్రదాయము కాని, దైవదత్తాధికారము కాని అతని రాజత్వమునకు ప్రాపుగాలేవు. అతని రాజత్వము సామర్థ్యము మీదను, ప్రజామోదముమీదను ఆధారపడి యుండెను. ప్రజలలో ముఖ్యముగా కర్షకులు అతనిపై విశ్వాసము కలిగియుండి అతనికి సహాయము చేయుచుండిరి. అతడే వారి భూములు వారికి నిలబెట్టినదని భావించుచుండిరి. ఒకమారు నెపోలియన్ ఇట్లన్నాడు- "భాగ్యవంతుల అభిప్రాయములనూ, పదరుబోతుల అభిప్రాయములనూ నేను లెక్కచెట్టను. నేను గణించేది కర్షకుల అభిప్రాయమునే". కాని ఎడతెరిపి లేకుండా జరిగే యుద్ధాలకు తమ పిల్లలను పంపించే భారం వహించలేక కర్షకులుకూడా విసుగు చెందారు. వీరి సహాయము తొలగడంతోనే నెపోలియన్ నిర్మించిన మహా భవనము ఒరగడానికి ప్రారంభించింది.

పది సంవత్సరముల కాలము అతడు చక్రవర్తిగా పరిపాలనము

చేసెను. ఈ కాలములో అతడు యూరోపు ఖండ మందంతటా వేగ ముగా సంచరించెను. అనేక యుద్ధములు చేసెను; అనేక యుద్ధము లలో గొప్ప విజయములు సాధించెను. అతని పేరువిని యూరోపంతా గడగడలాడింది. యూరోపుపై అతడు తన అధికారాన్ని చెలాయిం చాడు. వెనుకటి కాలములోగాని, అతనితరువాత కాలములోగాని ఇట్లు చేసినవారెవ్వరూలేరు. భూమిపై యుద్ధములు చేసి అతడు విజయములు సాధించిన కొన్ని యుద్ధముల పేళ్ళేమనగా: మరెంగో--మంచుతో నిండిన, స్విట్జర్లాండులోని సేంటు బెర్నార్డు కనుమను తన సైన్యముతో దాటి 1800 లో అతడిచ్చట విజయము పొందెను—ఉల్మ్, ఆస్టర్‌లిట్జ్, జీనా, ఐలా, ఫ్రీడ్‌లాండ్, వాగ్రాం. అతని ధాటికి ఆగలేక ఆస్ట్రియా, ప్రషియా, రష్యా దేశములు ఓడిపోయినవి. స్పెయిను, ఇటలీ, నెదర్లాండులు, రైను రాష్ట్ర సమ్మేళనము (Confederation) అనే జర్మనీలో పెద్ద భాగము, వార్సాడచీ అని నేడు పిలువబడే పోలెండు- ఇవి సామంత రాజ్యములైనవి. చాలా కాలమునుంచి నామమాత్రా వశిష్టమై ఉన్న పవిత్ర రోమక సామ్రాజ్యము చివరకు తుదముట్టింప బడినది.

యూరోపులోని పెద్ద జాతులలో దెబ్బ తినకుండా తప్పించు కొన్నది ఇంగ్లాండు ఒక్కటే. సముద్ర రహస్యము నెపోలియనుకు బోధపడలేదు. ఈ సముద్రమే ఇంగ్లాండును కాపాడింది. సముద్రము కాపాడుటవల్లనే ఇంగ్లాండు నెపోలియనుకు ప్రబల శత్రువైనది. ఆరంభ మందే నెపోలియన్ నౌకలను నెల్సన్ నైలు యుద్ధములో భగ్నము చేసినట్లు నే నిదివరలో చెప్పియున్నాను. 1825 అక్టోబరు 21 తేదీని నెల్సన్ ఇంతకన్న ఘనమగు విజయమును సాధించెను. స్పెయిను దక్షిణ తీరమున ట్రఫాల్గర్ అగ్రమువద్ద ఫ్రెంచి, స్పానిష్ సంయుక్త నౌకాదళమును అతడు ఓడించెను. ఈ నౌకా యుద్ధమునకు ముంచు తన నౌకాదళమునకు నెల్సన్ ఈ ప్రసిద్ధ వచనము చెప్పెను—"ప్రతి

ఒక్కడును తన విధ్యుక్త ధర్మమును తాను నిర్వర్తించునని ఇంగ్లాండు ఆసిస్తున్నది." విజయము చేజిక్కుచున్న సమయమున నెల్సన్ మరణించెను. ఇంగ్లాండుపై దండెత్తవచ్చునన్న నెపోలియన్ స్వప్నము ఈ విజయముతో భగ్నమయ్యెను. ఇంగ్లీషువా రీవిజయమును గర్వముతోను, ప్రేమతోను స్మరించుచుండిరి. నెల్సన్ స్తంభము నెత్తియు, లండనులో ట్రఫాల్గర్ స్క్వేరును నిర్మించియు అతని స్మృతి చిరస్థాయి చేసిరి.

యూరోపులోని నౌకాశ్రయము లన్నింటినీ ఇంగ్లాండు వాడుకొనకుండ మూయునట్లుత్తరువు చేసి, నెపోలియన్ ప్రతీకారముచేసెను. ఇంగ్లాండుకు ఎట్టి ప్రయాణ మార్గములూ ఉండరాదని. దానితో ఎట్టి సంబంధములూ పెట్టుకోరాదని అతడు శాసించెను. దుకాణదారుల జాతియైన ఇంగ్లాండును అణచివేయుట కిదియేమార్గము. ఇంగ్లాండు అప్పుడు ఏమి చేసినదంటే—ఈ రేవు పట్టణములను ముట్టడించి నెపోలియన్ సామ్రాజ్యమునకు అమెరికా మున్నగు ఖండములతో వర్తకను సాగకుండా ప్రతిబంధించింది. యూరోపులో కుట్రలు పన్నియూ, నెపోలియన్ శత్రువులకూ, తటస్థ దేశములకూ బంగారము విరివిగా పంచిపెట్టియూ ఇంగ్లాండు నెపోలియన్‌తో పోరాడింది. యూరోపులోని ధనాఢ్యులు, ముఖ్యముగా రాత్సుచైల్డ్సు, ఇందుకై ఇంగ్లాండుకు సహాయము చేసిరి.

నెపోలియనుకు వ్యతిరేకముగా ఇంగ్లాండు అవలంబించిన వేరొక పద్ధతి ప్రచారము. ఇది అప్పటికి కొత్త విధమగు ఉద్యమము. నేడు అది పరిపాటిగా జరుగుచున్నది. ఫ్రాంసుమీదను, ముఖ్యముగా నెపోలియన్ మీదను, పత్రికా ప్రచారము ప్రారంభించబడెను. అన్నివిధములైన వ్యాసములూ, చిన్న గ్రంథములూ, వార్తాపత్రములూ, నూతన చక్రవర్తిని పరిహసిస్తూ వ్రాసిన చిత్రములూ, అబద్ధపు వృత్తాంతములు— అసత్యములతో నిండిన ఇట్టివన్నీ లండనులో తయారుచేసి ఫ్రాంసులోకి

దొంగతనముగా పంపించారు. ఈ రోజులలో అబద్ధములతోకూడుకొన్న ఇట్టి పత్రికా ప్రచారము నేటి యుద్ధములలో పరిపాటిగా జరుగుచున్నది. 1914–18 మహా యుద్ధకాలమున యుద్ధము చేసే దేశ ప్రభుత్వము లన్నీ సంకోచము లేకుండా అబద్ధములు అసాధారణముగా ప్రచారము చేసినవి. అబద్ధములు సృష్టించడము, ప్రచారము చేయడము అనే కళలో అగ్రస్థానము ఇంగ్లీషు ప్రభుత్వముదే అని తోస్తున్నది. నెపోలియన్ కాలము మొదలుకొని నూరు సంవత్సరముల కాలము ఈ విద్యనిది అభ్యసించింది. మన దేశమునకు సంబంధించిన సత్య విషయములను అణచిపెట్టి నమ్మరాని అబద్ధములను ఇంగ్లాండులోనూ, ఇక్కడా ఎట్లు ప్రచారము చేసినదీ ఇండియాలోనున్న మన కందరికీ సువిదితమే.

## 105
## నెపోలియనును గురించి మరికొన్ని విషయములు

నవంబరు 6, 1932

నెపోలియన్ చరిత్ర వెనుకటి జాబులో విడిచిపెట్టిన తావునుంచి ఎత్తుకొని ఇప్పుడు సాగిద్దాము.

నెపోలియన్ ఏ దేశమునకు వెళ్ళినా ఫ్రెంచి విప్లవమును కొంత తనతోకూడా తీసుకుపోయెను. అతడు జయించిన దేశములందలి ప్రజలు అతని రాకకు విముఖులుగాలేరు. తమ్ము పీడిస్తూన్న శక్తి రహితులగు ఒకమాదిరి ఫ్యూడల్ పాలకుల పాలనము వారికి మొగము మొత్తినది. ఇది నెపోలియనుకు అనుకూలముగా ఉండెను. అతడు వెళ్ళిన ప్రదేశము లందెల్ల ఫ్యూడల్ పద్ధతి అంతరించుచూ వచ్చెను. ముఖ్యముగా జర్మనీలో ఫ్యూడల్ విధానము తుడిచిపెట్టుకు పోయెను. స్పెయిన్‌లో

అతడు ఇంక్విసిషనును తుదముట్టించెను. అతడు అనుకోకుండా ప్రజలలో రేపిన జాతీయభావమే అతనికి ప్రతికూలమై అతని పరాజయమునకు, చివరకు, కారణమైనది. పాత రాజులను, చక్రవర్తులను అతడు ఓడించగలిగెను. కాని తనకు ఎదురు తిరిగిన ప్రజలనందరినీ ఎదుర్కొనుట ఎట్లు? స్పానిష్ ప్రజలిట్లు అతనికి ఎదురుతిరిగి కొన్ని సంవత్సరముల పాటు అతని శక్తిని, ధనమును పీల్చివేసిరి. జర్మను ప్రజలు కూడా బారన్ వాన్ స్టీన్ అను గొప్ప దేశభక్తుని నాయకత్వమునచేరి అతని నెదిరించిరి. బారన్ వాన్ స్టీన్ నెపోలియనుకు ఆజన్మశత్రువాయెను. స్వాతంత్ర్య సాధనకై ఒక జర్మను యుద్ధముకూడ జరిగెను. ఇట్లు నెపోలియన్ పెరరేపిన జాతీయత, సముద్రాధిపత్యముతో చేరి అతని పతనమునకు కారణమయ్యెను. ఏది ఎట్లున్నా యూరోపుఖండమంతా ఒక నియంతక్రింద ఉండి, అతనిని సహించడం కష్టమైనపని. కొంత కాలమైన పిమ్మట నెపోలియన్ చెప్పిన యీ మాటలు బహుశా యదార్థమే కావచ్చును—"నా పతనమునకు నేనే కారణము, మరెవ్వరూకారు. నాకు నేనే ప్రబలశత్రువునైతిని. నా దుర్దశకు నేనే బాధ్యుడను."

ఈ ప్రతిభాశాలిలో అసాధారణ లోపములుండెను. అతడెప్పుడును నడుమంత్రపు సిరి పొందినవానివలె సంచరించుచుండెను. నీరసులగు పాత రాజులతోనూ, చక్రవర్తులతోనూ సరిసమానముగా ప్రజలు తన్ను చూడవలెననే వింతకోరిక అతనిలో మొలకెత్తియుండెను. వట్టి అసమర్థులైన తన సోదరులకు, తోబుట్టువులకు అతడు హాస్యాస్పదముగా ఉన్నత పదవులిచ్చుచుండెను. అతనికి చెప్పుకోదగ్గ సమర్థుడగు సోదరుడు లూసీన్ ఒక్కడే. ఇతడు 1799 లో వెనుకటి రాజ్యాంగమును నెపోలియన్ కూలద్రోసినప్పుడతనికి అండగానుండెను. తరువాత లూసీన్ సోదరునితో కలహించి ఇటలీకి పోయెను. అహంకారులు, అవివేకులు అగు మిగత సోదరులను నెపోలియన్ రాజులను గాను,

పాలకులను గాను చేసెను. తన కుటుంబము వారిని పైకి తీసుకు రావలెననే తుచ్ఛ కాంక్ష అతనికి మెండుగా ఉండెను. వారిలో ప్రతి ఒక్కడూ అతనిని మోసము చేసెను. కష్ట సమయములలో నతనిని వదలిపెట్టెను. ఒక రాజవంశమును స్థాపించవలెననికూడ నెపోలియన్ కుతూహలపడుచుండెను. ఇటలీ యుద్ధములకు వెళ్ళి ప్రసిద్ధి గాంచుటకు ముందే అతడు జోసఫైన్ డి బోహార్నిస్ అను కన్యను వివాహమాడెను. ఆమె అందమైనదే గాని చంచల స్వభావము కలది. ఆమెవల్ల సంతానము కలుగలేదని అతడెంతో ఆశాభంగము పాలాయెను. రాజవంశము స్థాపించవలెననే ఆకాంక్ష అతనిలో తీవ్రముగా నుండెను. కాబట్టి తాను ప్రేమించియున్నప్పటికీ జోసఫైనుకు విడాకులిచ్చి, వేరొక స్త్రీని పెండ్లాడ నిశ్చయించెను. ఒక రష్యన్ గ్రాండ్ డచస్‌ను అతడు పెండ్లాడ గోరెను గాని జారు సమ్మతించలేదు. నెపోలియన్ యూరోపుకంతకూ సర్వాధికారి కావచ్చును గాని రష్యన్ రాచ కుటుంబముతో వివాహ సంబంధమునకు ఆసించుట పట్టి సాహసమని జారు భావించెను! పిమ్మట నెపోలియన్ హాప్సుబర్గు కుటుంబమునకు చెందిన ఆస్ట్రియా చక్రవర్తితో అతని కూతురు మేరీ లూయీని తనకు వివాహము చేయమని చెప్పి బలవంతపెట్టెను. ఆమెవల్ల అతనికొక పుత్రుడు కలిగెను. ఆమె మందబుద్ధి కలది; తెలివితేటలు లేవు. ఆమెకు నెపోలియన్ అంటే ఇష్టము లేదు. వారి దాంపత్యము అనుకూలముగా లేదు. అతడు కష్టదశలో నున్నప్పుడు ఆమె అతనిని వదలిపెట్టిపోయి, అతని సంగతే మరిచిపోయెను.

కొన్ని విధములుగా తన తరము వారిలో అందరికన్న మిన్నయని ప్రసిద్ధిచెందిన ఈ పురుషుడు శుష్కమగు రాజత్వపు తళుకుల చూచి భ్రమపడుట వింతవిషయము. కాని తరుచు నతడు విప్లవమును సమర్థించుచు, నీరసులగు రాజులను పరిహాసము చేయుచుండెను. విప్లవమును, నూతన విధానమును అతడు ఉద్దేశ పూర్వకముగానే ఉపేక్షిం

చెను. ప్రాత విధాన మతనికి సరిపోలేదు. అందాతడు ఇముడడు. కాన ఈ రెంటి మధ్యను అతడు కూలిపోయెను.

క్రమ క్రమముగా రణరంగములలో అతడార్జించుచున్న కీర్తి అతనిని చివరకు దుఃఖములో ముంచినది. అతని మంత్రులే కొందరు ద్రోహులై అతనిపై కుట్రలు పన్నుచుండిరి. టాలెరాన్ రష్యా జారుతో కుట్రలు పన్నుచుండెను; ఫూషే ఇంగ్లాండుతో కుట్రలు పన్నుచుండెను. ఇట్టి ద్రోహకార్యములు చేయుచున్న వారిని నెపోలియన్ పట్టుకొనెను. కాని వింత ఏమనగా వారినాతడు చీవాట్లు మాత్రము వేసి, మంత్రులుగా నుండనిచ్చెను. అతని సేనాని ఒకడు, బెర్నాడాట్ అనువాడు, అతనికి వ్యతిరేకుడై ప్రబల శత్రువాయెను. అతని తల్లీ, సోదరుడు లూసీన్ తప్ప మిగత కుటుంబమంతా తరుచు అతనికి వ్యతిరేకముగా పనిచేయు చుండిరి. ఫ్రాంసులోకూడా అసంతుష్టి పెరుగుచుండెను. అతని నియం తృత్వము అందుచే కఠినమై, క్రూరమయ్యెను. విచారణ లేకుండ అనే కులు కారాగార బంధితులైరి. అతని జాతకము వక్రించ మొదలు పెట్టెను. రానున్న ఆపదను గ్రహించి పలువురు అతనిని విడిచిపెట్టిరి. వయస్సులో చిన్నవాడైనప్పటికీ దేహబలమూ, మనశ్శక్తి క్షీణించు చుండెను. రణరంగ మధ్యమున అతడు పరిణామ శూలతో బాధపడే వాడు. అధికారముకూడా అతనిని పాడుచేసింది. యుద్ధ నిపుణత నతడు కోల్పోవలేదు. కాని వెనుకటి చురుకు లేదు. తరుచు అతడు కర్తవ్య విమూఢుడగు చుండెను. సందేహించుచుండును. అతని సైన్యము లంచేనో, వెనుకటివలెగాక ఇప్పుడు అలవిగాకుండా ఉండెను.

1812 లో ఒక మహా సైన్యముతో అతడు రష్యాపై దండెత్తెను. రష్యనుల నాతడోడించి ఎదురు లేకుండా ముందుకు పోయెను. రష్యను సేనలు వెనుకకు పోవుచుండెనేకాని ఎదురుకొని పోరుటకు సమ్మతించ లేదు. నెపోలియన్ మహా సైన్యము వారిలో తలపడుటకు ప్రయత్నిం చెను. కాని లాభము లేకపోయెను. చివరకది మాస్కో చేరుకొనెను.

జారు లొంగిపోవుటకు సమ్మతించెనుగాని, నెపోలియన్ పాత సేనాని, అనుచరుడూ, ఫ్రెంచివాడూ అయిన బెర్నాడాటున్నూ, నెపోలియన్ బహిష్కరించిన జర్మను జాతీయ నాయకుడైన బారన్ వాన్‌స్టీనున్నూ లొంగిపోవద్దని జారును ప్రోత్సహించిరి. పొగబెట్టి శత్రువును తరిమి వేయుటకై రష్యనులు ప్రేమాస్పదమైన తమ పట్టణమునకు చిచ్చంటించిరి. మాస్కో తగలబడుచున్న వార్త సేంటు పీటర్సు బర్గు చేరు నప్పటికి స్టీన్ బల్లవద్ద కూర్చుండి తన గ్లాసునెత్తి ఇట్లన్నాడు—"ఇంతకు ముందు మూడు, నాలుగు సార్లు నా సామాను పోగొట్టుకొంటిని. అట్టి వస్తువులు పోగొట్టుకొనుటకు మనమలవాటు పడవలెను. మనకు చావు నిశ్చయము కాబట్టి శౌర్యముతో బ్రదుకుట మంచిది."

అది శీతాకాల ప్రారంభము. దగ్ధమగుచున్న మాస్కోను వదలి నెపోలియన్ ఫ్రాంసుకు పోవలెనని నిశ్చయించెను. మహా సైన్యము అలసటతో మంచుమీద ప్రయాణం ప్రారంభించినది. రష్యన్ రౌతులగు కోసక్కులు దానిని రెండు తట్టులా వెనుకనుండే వేధించ మొదలు పెట్టిరి. ఎడతెరపి లేకుండ ఎదుర్కొన జొచ్చిరి. వెనుకబడ్డవారిని నరికివేసిరి. అతి శీతలమువల్లా, కోసక్కులవల్లా వేలకొలది ఫ్రెంచి సైనికులు మరణించిరి. మహా సైన్యము నామమాత్రా వశిష్టమైనది. చిరిగిపోయిన దుస్తులతో, మంచుతిన్న పాదములతో, ఒరిసిపోయిన పాదములతో పాదచారులై అలసటతో కాళ్ళీడ్చుకొంటూ హతశేషమైన ఫ్రెంచి మహా సైన్యము నడిచి వెళ్ళింది. తన సైనికులతోపాటు నెపోలియనున్నూ పాదచారియై వెళ్ళాడు. హృదయ విదారకమగు నడకయిది. మహా సైన్యము సన్నగిల్లి సన్నగిల్లి చివరకు అంతరించింది. ఇంటికి చేరినవారెకొద్దిమందో.

రష్యను దండయాత్ర ఫ్రాంసుకొక పెద్ద దెబ్బ. పోరాడు ప్రజల సంఖ్య ఫ్రాంసులో తగ్గిపోయింది. ఇంతకంటె ముఖ్య విషయము నెపోలియనుకు వార్ధక్య చిహ్నములు పిన్న వయస్సునందే వచ్చినవి.

యుద్ధములన్న అతనికి విసుగూ, అలసటా వచ్చినవి. కాని పరిస్థితు లతనిని విశ్రాంతి తీసుకొననియ్యలేదు. అతని శత్రువు లతనిని చుట్టు ముట్టియుండిరి. అతడింకను విజయములు సాధించే సాటిలేని సేనా నాయకుడైనప్పటికీ శత్రువుల వల క్రమ క్రమంగా బిగియజొచ్చింది. టాలెరాన్ కుట్రలు పెరిగిపోయినవి. కొందరు నమ్మిన మార్షలులుకూడా నెపోలియనుకు ఎదురుతిరిగిరి. అలిసి, విసిగిపోయి నెపోలియన్ 1814 ఏప్రెల్ నెలలో సింహాసనమును పరిత్యజించెను.

నెపోలియన్ తమకడ్డు లేదుకదా అని యూరోపియన్ జాతుల సభ వియన్నాలో సమావేశమైనది. యూరోపు దేశ పటమును వారు కొత్తగా తయారుచేయ పూనుకొనిరి. మధ్యధరా సముద్రములోనున్న ఎల్బా అనే చిన్నదీవికి నెపోలియన్ పంపబడెను. బోర్బన్ కుటుంబము నకు చెందిన వేరొక లూయీని, మరణదండన అనుభవించిన లూయీ సోదరుని, అతడు ఏకాంత వాసము చేయుచున్న స్థలమునుంచి తీసుకు వచ్చి, లూయీ XVIII పేరున ఫ్రాంసుకు రాజుగా అభిషిక్తుని చేసిరి. బోర్బనులు మళ్ళీ తిరిగి వచ్చిరి. వారితో వెనుకటి నిరంకుశ ప్రభుత్వ మున్నూ వచ్చెను. బాస్టీలు పతనమైనది మొదలు 25 సంవత్సరము లలో చేసిన సాహసకార్యములకు ఫలితము ఇట్లు పరిణమించినది. వియన్నాలో రాజులూ, వారి మంత్రులూ వాదించుకొంటూ, కలహించు కొంటూ కాంక్షేపము చేసిరి. మధ్య కాలములో సుఖముగా జీవించు చుండిరి. వారి మనస్సులెంతో చులకనగా ఉండెను. ఒక భయోత్పాతము తొలగినందుకు వారు స్వేచ్ఛగా గాలి పీల్చుకొన గలిగిరి. నెపోలియన్ పట్ల ద్రోహముగా ప్రవర్తించిన టాలెరాన్ ఈ రాజుల, మంత్రుల మూకతో ఇష్టముగానుండెను. సభలో అతడు ప్రధాన పాత్ర వహించి యుండెను. ఆస్ట్రియా విదేశ మంత్రియైన మెట్టర్‌నిచ్ అను ప్రసిద్ధుడు కూడా ఆ సభలో ఉండెను.

సంవత్సరము లోపుననే నెపోలియనుకు ఎల్బా దీవి మొగము

మొత్తినది. బోర్బనుల ప్రభుత్వమున్నూ ఫ్రాంసుకు మొగము మొత్తినది. ఒక చిన్న పడవలో అతడు ఎల్బానుంచి తప్పించుకొని ఒంటరిగా వచ్చి, 1815 ఫిబ్రవరి 26 తేదీని, రివీరా తీరమందున్న కానెస్ పట్టణము వద్ద దిగెను. కర్షకులు ఉత్సాహముతో అతనికి స్వాగతము చెప్పిరి. అతని నెదిరించుటకు పంపబడిన సైన్యములు తమ పాత సేనానాయకుణ్ణి చూడడంతోనే "చక్రవర్తి చిరకాలము జీవించుగాక" అని జయధ్వానములు చేసి, అతని పక్షమున చేరిరి. ఇట్లు విజయోత్సాహముతో అతడు పారిస్ చేరెను. బోర్బన్ రాజు పారిపోయెను. యూరోపు దేశమందలి ముఖ్య పట్టణములన్నింటిలోనూ భయసంభ్రమములు వ్యాపించెను. వియన్నాలో సభ జరుగుతూనే ఉండెను. నాట్యములూ, విందులూ హఠాత్తుగా ఆగిపోయినవి. భయముతో ఆ సభలోని రాజులూ, మంత్రులూ తమ వివాదములు మరిచిపోయి నెపోలియనును మళ్ళీ తలయెత్తకుండా చెయ్యడానికి మార్గాలు తీవ్రంగా ఆలోచించ మొదలుపెట్టారు. అందుచే యూరోపంతా అతనిని ఎదుర్కొన్నది. కాని ఫ్రాంసు అలసిపోయి ఉన్నది. నెపోలియన్ వయస్సు 46 సంవత్సరములే అయినప్పటికీ అతడు అలిసిపోయిన ముసలివానివలె ఉండెను. అతని భార్యయైన మేరీ లూయీ కూడా అతనిని విడిచిపెట్టి పోయింది. అతడు కొన్ని యుద్ధములు గెలిచాడు. కాని బ్రస్సెల్సు నగరమువద్దనున్న వాటర్లూవద్ద వెల్లింగ్టన్, బ్లూచరుల నాయకత్వముననున్న ఇంగ్లీషు, ప్రషియన్ సైన్యములచేత అతడు ఓడింపబడ్డాడు. అతడు తిరిగి వచ్చిన 100 దినములకిది జరిగినది. ఈ కాలమునకు "శతాహము" అనే పేరు వచ్చింది. వాటర్లూవద్ద యుద్ధము తీవ్రముగా జరిగింది. విజయము ఎట్లు మొగ్గుతుందో తెలియలేదు. నెపోలియన్‌ను అదృష్టము వదలిపెట్టింది. ఆ యుద్ధమున అతడు నెగ్గుటకు అవకాశము లేకపోలేదు. ఒకవేళ నెగ్గినా కొంతకాలమైన పిమ్మటనైనా అతడు సంయుక్త యూరోపు సైన్యములచే ఓడిపోవలసినవాడే, అతడు ఓడిపోయినాడు

గదా అని అతని సహకారులు అనేకులు ప్రాణములు రక్షించుకొనుటకై అతనికి ఎదురుతిరిగిరి. మరల యుద్ధము తలపెట్టుట లాభములేని పని. కాని అతడు రెండవపర్యాయము సింహాసనమును త్యజించెను. ఫ్రెంచి రేవులోనున్న ఒక ఇంగ్లీషు నావవద్దకు పోయి దాని కప్తానుకతడు వశుడై ఇంగ్లాండులో తాను శాంతముగా కాలము గడుపదలచినట్లు చెప్పెను.

ఇంగ్లాండుగాని, యూరోపుగాని అతనిని ఉదారముగా, గౌరవంగా చూస్తారని అనుకోవడం అతనితప్పు. అతనిని చూస్తే వారికి బెదురు పట్టుకొంది. ఎల్బానుంచి తప్పించుకు పారిపోయాడు కాబట్టి దూర దేశములో ఉంచి భద్రముగా కాపలా కాయించవలసి ఉంటుందని వారు నిశ్చయించారు. కాబట్టి అతడెంత మొత్తుకున్నా వినక, అతనిని ఖైదీ యని ప్రకటించి, దక్షిణ అట్లాంటిక్ మహా సముద్రములో దూరముగా ఉన్న సేంటు హెలీనా ద్వీపమునకు, కొద్ది సహవాసులతో, పంపిరి. అతనిని "యూరోపు ఖైదీ" అని ప్రకటించిరి. సేంటు హెలీనాలో అతనిని కనిపెట్టి చూచుటకు అనేక జాతులు తమ కమీషనర్లను పంపిరి. కాని నిజమునకు అతనిని కనిపెట్టి భద్రముగా చూచే సంపూర్ణ బాధ్యత ఇంగ్లీషువారిదే. ప్రపంచమునకు సంబంధంలేకుండా, దూరముగా, విసిరి వేసినట్లున్న ద్వీపములో అతనిపై కాపలా కాచుటకు ఒక సైన్యమును తెచ్చారు. ఆనాటి సేంటు హెలీనా కొండను కౌంటు బాల్మైను అను అచ్చటి రష్యను కమీషనరు ఇట్లు వర్ణించెను—"ఆ ప్రదేశము ప్రపంచములో మిక్కిలిదుఃఖకరమైనది: ఏ ప్రదేశమునకును, ఎంతమాత్రమునూ సంబంధములేనిది: సమీపించుటకు వీలులేనిది: శత్రువులనుండి సంరక్షించు కొనుటకు మిక్కిలి సులభమైనది: శత్రువులెదిరించుటకు మిక్కిలి కష్టమైనది: స్నేహభావము పెంపొందుట కననుకూలమైనది...." ఆ ద్వీపమునకు గవర్నరైన ఇంగ్లీషు మనిషి వట్టి మడ్డి మనిషి, అనాగరికుడు. అతడు నెపోలియనును మిక్కిలి నీచముగా చూచెను. ఆ

ద్వీపములో అనారోగ్యకరమైన ప్రదేశమున ఒక పాడు కొంపలో నెపోలియన్ ఉంచబడెను. అతడును, అతని సహచరులును బాధకర మగు నిబంధనలకు లొంగి యుండవలసి వచ్చెను. ఒక్కొక్కప్పు డతనికి తినుటకు కావలసినంత పరిశుభ్రమగు ఆహారమే దొరకకుండెను. యూరోపులోని అతని మిత్రులతో అతడు ఉత్తర ప్రత్యుత్తరములు జరుపుకోకూడదు. తన కొడుకుతోనైతము జరుపుకోకూడదు. నెపోలియన్ ఉచ్ఛలో ఉన్నప్పుడు తన కొడుకునకు రోమురాజు అనే బిరుద మిచ్చియుండెను. తన కొడుకు వార్తలు సమేతము అతనికి అందనిచ్చే వారు కారు.

నెపోలియనును ఎంత నీచముగా చూచారో అన్న విషయము తలుచుకుంటే ఆశ్చర్యం కలుగుతుంది. సేంటు హెలీనా గవర్నరుమాత్ర మేమి చేయగలడు? నెపోలియనును హింసబెట్టవలెననీ, శృంగభంగము చేయవలెననీ ఇంగ్లీషు ప్రభుత్వముయొక్క నిశ్చితాభిప్రాయ మైనట్లు తోస్తుంది. యూరోపులోని ఇతర జాతులిందుకు తల ఊపిరి. నెపోలియన్ తల్లి ఏళ్ళు గడిచినదైనప్పటికీ సేంటు హెలీనాలో కొడుకువద్ద ఉండ కోరింది. మహా జాతులు పనికిరాదు అన్నవి. ఇట్లతనిని న్యూన పరచడానికి కారణము యూరోపులో అతని పేరు తలుచుకొని ఎంత భయపడుతున్నారో! రెక్కలు కత్తిరింపబడ్డా, నిస్సహాయుడై దూర ద్వీపములోఉన్నా వారికాభయము వీడలేదు.

అయిదున్నర సంవత్సరములపాటు అతడు సేంటు హెలీనాలో బ్రదికియుండినీ, జీవచ్ఛవమువలె ఉన్నాడు. ఆ చిన్న కొండమీద బంధింపబడి, ప్రతిరోజూ పరాభవింపబడుతూ మహాశక్తివంతుడూ, ఆశాపరుడూ అయిన నెపోలియన్ ఎట్లు బాధపడ్డాడో ఊహించడం కష్టంకాదు. అతడు 1821 మేలో మరణించాడు. మరణానంతర మందైనా వైరాన్ని వదులుకోలేదు ఆ గవర్నరు. ద్వేషభావముతో అతనికి ఒకదిక్కుమాలిన సమాధిని ఏర్పరచాడు. ఆ రోజులలో వార్తలు

మెల్లగా వ్యాపిస్తూ ఉండేవి. నెపోలియనును సరిగా చూడడంలేదనిన్నీ, అతనిని బాధపెడుతున్నారనిన్నీ యూరోపులో తెలిసినప్పుడు ఇంగ్లాండు లోనూ, ఇతర దేశములలోనూ అట్టిపని తప్పు అని ఆక్రోశించారు. ఇట్టి నిరాదరణకు ముఖ్య కారకుడైన ఇంగ్లీషు విదేశమంత్రి కాసిల్‌రా అనువాడు ప్రజల ద్వేషానికి గురి అయ్యాడు. ఇందుకేకాదు. స్వదేశ పరిపాలనా కార్యములందుకూడ అతడు కఠినముగా ఉండెను. ఇందుకై అతడు కుమిలి ఆత్మహత్య చేసుకొన్నాడు.

అసాధారణ మహా పురుషుల మంచి, చెడ్డ లేర్పరించడం కష్టము. నెపోలియన్ గొప్పవాడనడానికిగాని, అసాధారణుడనడానికిగాని సందేహము లేదు. అతడు ప్రకృతి శక్తివంటివాడు. ప్రకృతి శక్తులతనిలో చెలరేగుతున్నవి. అతనికి ఆలోచనలకు లోటులేదు; ఊహకు లోటు లేదు. కాని ఆదర్శముల విలువ అతనికితెలియదు. ఆత్మార్థము కాకుండా పనిచెయ్యడమతనికి తెలియదు. కీర్తినీ, ధనమునూ ఆశపెట్టి అతడు ప్రజల మెప్పును పొందగోరాడు. అతని కీర్తి, అధికారమూ తగ్గిపోయి నప్పుడు, వేరే ఆదర్శభావములు లేని కారణమున అతనివల్ల ముందుకు వచ్చిన ప్రజలే అనేకులు అతనిని అన్యాయముగా విడిచిపెట్టిపోయారు. మతమంటే అతనికి బీదవారినీ, దీనులనూ తమ అవస్థతో తృప్తిజెంది ఉండేటట్లు చేసే ఒక పద్ధతిమాత్రమే. క్రైస్తవమును గురించి అతడొక మారిట్లన్నాడు—“సోక్రటీసునూ, ప్లేటోనూ దూషించిన మతమును నేనెట్లు అంగీకరించగలను.” ఈజిప్టులో నున్నప్పుడు అతడు ఇస్లామును కొంత అభిమానించెను. అట్లా చేయడంవల్ల అక్కడి ప్రజల ఆమోదమును పొందవచ్చునని అనుకొని ఉంటాడు. అతనికి మతముపై అభిమాన మెంతమాత్రమూ లేదు. అయినా మతమునతడు ప్రోత్సహించెను. ఇందుకు కారణము అప్పుడున్న సంఘము నిలుచుటకది ఆధారముగా నుండునని అతడు భావించెను. అతడు చెప్పిన మాటలు—“స్వర్గములో సమానత్వముండుననే భావన మతమువల్ల కలుగును. అందువల్లనే

బీదలు భాగ్యవంతులను హత్య చెయ్యడంలేదు. టీకాలు వేయించు కొనుటవల్ల ఎంతలాభమో మతమువల్లకూడా అంతేలాభము. మహాత్ము లపై మనకున్న అభిరుచిని అది సంతుష్టిపరచును. దుష్టవైద్యులనుండి అది రక్షించును. ఆస్తులలో తేడాలు లేకుండా సంఘముండనే ఉండదు. మతములేనిదే తేడాలునిలువవు. ప్రక్కవాడు షడ్రసోపేతముగా భోజనము చేస్తూన్నప్పుడు, ఆకలి బాధచేత చావడానికి సిద్ధముగా ఉన్నవాడు పరమాత్మను తలుచుకొని మనస్సమాధానము చేసుకొంటాడు. పరలోక ములో ఫలములు వేరువిధముగా ముట్టగలవనే నమ్మకంతో సంతుష్టి చెంది ఉంటాడు." బలగర్వముతో అతడొకమారిట్లన్నాడట—"ఆకాశము విరుచుకు మీదపడినా దానిని మా శూలాగ్రములతో నిలుపుతాము."

మహా పురుషులకుండు ఆకర్షణశక్తి అతనికుండెను. విశ్వాస పాత్రులగు స్నేహితుల ననేకులను అతడు సంపాదించెను. అతని దృష్టి, అక్బరు దృష్టివలెనే, ఆకర్షకము. అతడొకమారు ఇట్లన్నాడు— "నేను తరుచు కత్తిదూయలేదు: నేను ఆ యుధములతో యుద్ధములు గెలువలేదు: నా దృష్టితోనే గెలిచితిని." యూరోపును యుద్ధములలో ముంచి ఇతడు చెప్పినమాటలు ఎంత వింతగా ఉన్నవి. తరువాత అతడు ప్రవాసమనుభవించేటప్పుడు చెప్పినమాటలేమనగా-"పశుశక్తివల్ల లాభములేదు. ఖడ్గముకన్న ఆత్మశక్తియే బలమైనది." అతడేమన్నా డంటే—"నన్ను ఆశ్చర్యములో ముంచే విషయమేమో తెలుసునా? పశుశక్తితో ఏ కార్యమునూ కొనసాగించలేము. ప్రపంచములో ఉన్నవి రెండే శక్తులు: అవి ఖడ్గశక్తి, ఆత్మశక్తి. పర్యవసానమున ఖడ్గశక్తిని ఆత్మశక్తియే ఎప్పుడును జయించితీరును" కాని అతడు పర్యవసానము వరకూ వేచి ఉండేవాడుకాడు. అతనికి తొందరగా పనులు కావలెను. జీవిత ప్రారంభమునుండియు అతడు ఖడ్గమార్గమునే అవలంబించెను. ఖడ్గమువల్లనే అతడు విజయములు కాంచెను; ఖడ్గమువల్లనే అతడు పతనమయ్యేను. అతడు మళ్లీ యీ విధంగా చెప్పుతున్నాడు—"యుద్ధము

ఈ కాలమునకు అనుగుణముగా లేదు; ఏదో ఒకదినమున విజయములు ఫిరంగుల సాయము లేకుండా, సైన్యాలసాయము లేకుండా సాధింప బడగలవు." అతనికి పరిస్థితులు మిక్కిలి వ్యతిరేకముగా ఉండెను. అపరిమితమగు అత్యాశ; యుద్ధములో విజయములు సాధించే సౌలభ్యము; నడుమంత్రపు సిరిపొందిన అతనిపై యూరోపు పాలకుల ద్వేషము; అతనినిచూచి భయము ఇవి కారణములుగా, అతడు శాంతముగా కాలము గడుపలేకపోయాడు. యుద్ధములో అనాలోచితముగా మానవులనాతడు బలియిచ్చాడు. అయినప్పటికీ, బాధలుచూచి అతడు సహించలేకపోయేవాడట.

తన జీవితములో అతడు నిరాడంబరముగా ఉండేవాడు. కార్యదీక్షలోతప్ప ఇంక దేనిలోనూ అతడు మితముదప్పి ప్రవర్తించలేదు. అతని అభిప్రాయము ప్రకారము "మనిషి ఎంత కొద్దిగా అన్నముతిన్నా అది ఎక్కువతిన్నట్టే లెక్క. మితిమీరి భుజించుటవల్ల రోగములు వచ్చునుగాని తగ్గించి తినుటవల్ల ఎన్నడూరావు." ఇట్టి నిరాడంబర జీవితము వల్లనే అతనికి చక్కని ఆరోగ్యమూ, మితిమీరినశక్తి కలిగినవి. అతడు ఇష్టమువచ్చినప్పుడు నిద్రపోయేవాడు. ఎంత కొద్దినిద్ర కావలిస్తే అంతనిద్రే పోయేవాడు. ఉదయమునా, మధ్యాహ్నమూ 100 మైళ్ళ దూరము సవారీ చేయడం అతనికొక గొప్పవిషయంకాదు.

అత్యాశ ప్రేరేప అతడు యూరోపు ఖండము నంతయు చుట్టబెట్టెను. యూరోపు ఒకే దేశమనియు, అందు ఒకే శాసనము, ఒకే ప్రభుత్వము ఉండవలెననియు అతడు ఊహించదొడగెను. "అన్ని జాతులను నేను ఏకముచేసెద"నని అతడన్నాడు. తరువాతి కాలములో సేంటు హెలీనాలో ప్రవాసమువల్ల శాంతపడినప్పుడు ఈ భావమే అతని మనస్సుకు ఆత్మపరముగా కాకుండ తట్టినది. "ఎప్పటికైనా యూరోపియన్ జాతులు పరిస్థితుల బలిమివలన ఏకమగుట తప్పదు. మొదటి పర్యాయమిప్పుడట్టి కదలిక పుట్టించాను. నేననుకొన్న విధానము వికల

మవుతుంది కాని పిదపకాలములో యూరోపులో సామరస్యము సాధించు కార్యము నానాజాతి సమితి ద్వారానే జరుగవలెను." నాటినుండి 100 సంవత్సరములు పైగా గడిచినవి. కాని యూరోపు ఇంకా దారి తెలియక కొట్టుకుంటోంది. నానాజాతి సమితితో కార్యసాఫల్యమవుతుందేమోనని చూస్తోంది.

అతడు తుదిసారి ఒక వీలునామా వ్రాసి అందు తన పుత్రునకొక సందేశము చేర్చెను. ఇతనిని అతడు రోమురాజు అనేవాడు. ఇతనిని గురించిన వార్తలేమీ తండ్రికి చేరకుండా క్రూరముగా కట్టుబాట్లు చేశారు. తన కొడుకు ఒకరోజున రాజు కాగలడని అతడు ఆసించెను. శాంతముగా, దౌర్జన్యమునకు చోటీయకుండా రాజ్యపాలనము చేయుమని అతనికి బోధించెను. "ఆయుధముల సహాయముతో నేను యూరోపును బెదిరించితిని. కాని ఈ కాలమున అవలంబించవలసిన మార్గము హేతువాదము ద్వారా సంతుష్టి పరచడమే." కాని ఈ పుత్రునకు రాజ్యపాలనము చేసే యోగము పట్టలేదు. తండ్రి మరణించిన పదకొండు సంవత్సరములకు వియన్నాలో వయస్సులోనే అతడు కాలముచేసెను.

పై అభిప్రాయములన్నీ అతడు ప్రవాసమునందున్నప్పుడు వెల్లడించెను. అప్పుడు అతడు శాంతపడి యుక్తాయుక్తములు తెలిసికొనెను. బహుశా తరువాతి తరములవారు తనయెడల సద్భావము కలిగియుండవలెనని అట్లు వ్రాసిననూ వ్రాసియుండవచ్చును. అతడు ఉచ్చలో ఉన్నప్పుడు పూర్తిగా కార్యవాదియే కాని తత్త్వ శాస్త్రమందు ప్రీతి కలవాడు కాడు. అతడు అధికారమునే ఉపాసించెను. అతడు నిజముగా ప్రేమించినది అధికారమునే. మొరటుగా అతడు దానిని ప్రేమించలేదు. కళాశీలివలె ప్రేమించెను. అతడు చెప్పిన మాటలు—"నేను అధికారమును ప్రేమింతును. అవును, ప్రేమింతును. కళాశీలివలె ప్రేమింతును. శ్రుతులూ, మధుర స్వరములూ పలికించుటకై ఫిడేలు నెట్లు ఫిడేలు వాయించేవాడు ప్రేమిస్తాడో అట్లే నేను అధికారమును

ప్రేమిస్తాను." కాని అత్యధిక అధికారమును కాంక్షించుట ప్రమాదకరము. దానిని కోరే వ్యక్తులుకాని, జాతులుకాని అచిరకాలములోనే పతనమై నశిస్తారు. కావుననే నెపోలియన్ పతనమైనాడు. అతడు పతనమగుట కూడా మంచిదే.

ఈ కాలమున ఫ్రాంసును పాలిస్తున్నది బోర్బన్ కుటుంబము. కాని బోర్బనులు కొత్తగా నేర్చుకున్నదేదీ లేదు. మరిచిపోయిందీ ఏదీ లేదు. నెపోలియన్ మరణించి తొమ్మిది సంవత్సరములు కాకుండనే వారి పరిపాలన ఫ్రాంసుకు చాలుననిపించింది. అప్పుడు ఫ్రాంసు వారిని పదభ్రష్టుల చేసింది. వేరొక ఏకాధిపత్యము స్థాపించబడెను. నెపోలియన్ స్మృతిని గౌరవించుటకై వెన్‌డోమ్ స్తంభము శిఖరమునుండి తీసివేయబడిన అతని శిలా ప్రతిమ మరల దానిమీద ప్రతిష్ఠించబడినది. దురదృష్ట వంతురాలగు నెపోలియన్ తల్లి, చీకు వృద్ధ, యీ వార్తవిని ఇట్లన్నది–"చక్రవర్తి మళ్ళీ పారిస్ వచ్చాడు."

## 106

# ప్రపంచమును కలయజూచుట

నవంబరు 19, 1932

తాను చిరకాలముపాటు అధికారము చెలాయించిన ప్రపంచ రంగమునుండి నెపోలియన్ నిష్క్రమించెను. నూరు సంవత్సరములు గడచినవి. అతనిని గురించిన పాత వివాదములనేకము శమించినవి. కాని అతనిని గురించి ప్రజలలో ఇంకను భేదాభిప్రాయములున్నవి. బహుశా నెపోలియన్ వేరొక కాలమున, ఇంతకన్న శాంతముగా ఉన్న కాలమున, పుట్టి ఉన్నట్లయితే అతడు ఒక గొప్ప సేనానిగా మాత్రమే ప్రసిద్ధిచెందియుండును. అంతకన్న ఎక్కువలేదు. ప్రజలతనినిగురించి చెప్పుకొనియుండరు. కాని విప్లవమూ, మార్పూ జరుగుచున్న కాల

మున పుట్టి యుండుటచే అతనికి అవకాశము చిక్కినది. అట్టి అవకాశ మును ఉపయోగించుకొని ముందుకు పోయాడు. అతని పతనమూ, యూరోపియన్ రాజకీయ రంగమునుండి అతని నిష్క్రమణమూ యూరో పుప్రజలకు మనస్థిమితము కలిగించినవి. వారికి యుద్ధమంటే విసుగుబుట్టినది. ఒక తరము వారికి నిజమగు శాంతి అంటే ఏమిటో తెలియదు. శాంతికొరకు వారు ఎదురు తెన్నులు చూచుచుండిరి. అనేక సంవత్సరములపాటు నెపోలియన్ పేరు వారికి సింహస్వప్నమైనది. యూరోపులోని రాజులకు అతని అనంతరము చిక్కినంత మనస్థిమితము మరెవ్వరికీ చిక్కలేదు.

ఫ్రాంసులోనూ, యూరోపులోనూ మనము చాలాకాలము గడపితిమి. పందొమ్మిదవ శతాబ్దిలో చాలా కాలము గడచినది. ఇప్పుడొక మారు ప్రపంచమును కలయచూతుము. నెపోలియన్ పతనమప్పుడు ప్రపంచము ఎట్లున్నదో తెలిసికొందము.

యూరోపులో వియన్నావద్ద రాజులూ, వారి మంత్రులూ కాంగ్రెసులో సమావేశమై యుండిరన్న విషయము నీకు జ్ఞాపకమున్నదా? బూచివాడు వెళ్ళిపోయాడుగదా. ఇంకవాళ్లు వెనుకటి ఆట ఆడవచ్చును. లక్షలాది మానవుల భావి వారిష్టమువచ్చినట్లు వారు నిర్ణయం చేయ వచ్చును. ప్రజల అభీప్సితములతో వారికి పనిలేదు. దేశముయొక్క సహజమగు సరిహద్దులతోగాని, భాషనుబట్టి ఏర్పడగల సరిహద్దులతో గాని వారికి పనిలేదు. రష్యాజారున్నూ, ఇంగ్లాండున్నూ (దీని ప్రతినిధి కాసిల్‌రా), ఆస్ట్రియాయున్నూ (దీని ప్రతినిధి మెట్టర్‌నిచ్), ప్రషియా యున్నూ అక్కడ చేరిన ప్రధాన జాతులు. టాలెరాన్ అక్కడ ఉండనే ఉన్నాడు. హాస్యప్రియుడు, తెలివైనవాడు, ప్రజామోదము గన్నవాడు, ఒకప్పుడు నెపోలియన్ మంత్రి, నేడు ఫ్రాంసుయొక్క బోర్బన్‌రాజు మంత్రి ఇతడు. నాట్యములతోను, విందులతోనూ కాలక్షే పము చేస్తూ మధ్యకాలములో యూరోపు దేశపటము వారు కొత్తగా

వ్రాస్తున్నారు. నెపోలియన్ దాని నెంతగానో మార్చివేసినాడుగదా!

బోర్బన్ కుటుంబమునకు చెందిన లూయీ XVIII ఫ్రాంసుకు రాజుగా చేయబడ్డాడు. స్పెయినులో ఇంక్విసిషన్ మళ్ళీ తలయెత్తింది. వియన్నా కాంగ్రెసులోని రాజులకు ప్రజాప్రభుత్వమంటే ఇష్టములేదు. కాబట్టి హాలెండులో వారు డచ్చి ప్రజాప్రభుత్వమును పునరుద్ధరించలేదు. దానికి బదులు వారు హాలెండు, బెల్జియములను ఒక రాజ్యముగా కలిపి కట్టి దానిని నెదర్లాండులనిరి. పోలెండు మళ్ళీ అదృశ్యమైనది. అది ప్రత్యేక దేశముగాలేదు. ప్రషియా, ఆస్ట్రియా, ముఖ్యముగా రష్యా దేశములు దానినిగ్రహించినవి. వెనీసు, ఉత్తర ఇటలీలు ఆస్ట్రియాకు దక్కినవి. స్విట్జర్లాండుకున్నూ, రివీరాకును మధ్యనున్న ఇటలీ భాగమున్నూ, ఫ్రాంసు భాగమున్నూ కలిసి సార్డీనియా రాజ్యమైనవి. మధ్య యూరోపులో ఒక వింత అస్పష్ట జర్మన్ రాష్ట్రసమ్మేళనమైనది. అందు ప్రధాన జాతులు రెండు: యథాప్రకారము ప్రషియా, ఆస్ట్రియాలు. ఇంకా యితర మార్పులుకూడా జరిగినవి. ఇట్లు వియన్నా కాంగ్రెసులో చేరిన బుద్ధిమంతులు నిశ్చయించారు. ఇష్టములేనిదే ప్రజలొక చోటనుండి వేరొక చోటికి వెళ్ళవలసి వచ్చింది. వారు మాతృభాష వదలుకొని అన్యభాషలో మాట్లాడుకోవలసివచ్చింది. ఈ విధముగా భావిలో పుట్టబోవు అల్లరులకు, యుద్ధములకూ విత్తనము వేయబడింది.

1814–15 లో వియన్నా కాంగ్రెసు ముఖ్యముగా చేయతలపెట్టిన కార్యము రాజుల భద్రత. ఫ్రెంచి విప్లవము వారిని భయవిహ్వలులను చేసింది. విప్లవభావములు వ్యాపించకుండా చేయవచ్చునని వారనుకొన్నారు. ఎంత తెలివితక్కువ? రష్యా జారూ, ఆస్ట్రియా చక్రవర్తీ, ప్రషియా రాజూ చేరి "పవిత్ర స్నేహ" (Holy Alliance) మను సంధించుకొన్నారు. తమ్ము తాము రక్షించుకొనుటా, ఇతర రాజులను రక్షించుటా వారి ఆశయము. మనము మళ్ళీ లూయీ XIV, లూయీ XV రోజులలోకి తిరిగివచ్చామా? అనిపిస్తున్నది. యూరోపునందంతటా,

ఇంగ్లాండులోసహా, ఉదారాశయములుతలయెత్తకుండా అణచివేయబడ్డవి. ఫ్రెంచి విప్లవ బాధలు నిష్ఫలమైనవని యూరోపులోని అభివృద్ధి కాములు ఎంతగా నిరాశచెందారో!

యూరోపు తూర్పున తురుష్కస్థానము చాలా బలహీనమైనది. అది మెల్ల మెల్లగా క్షీణించుచున్నది. ఈజిప్టు టర్కీ సామ్రాజ్యములో ఒక భాగమనిపించుకొంటోంది కాని సగము వరకూ స్వతంత్రముగానే ఉంటోంది. 1821 లో గ్రీసు, టర్కీరాజ్యముపై తిరుగుబాటుచేసి ఎనిమిది సంవత్సరములు యుద్ధముచేసి ఇంగ్లాండు, ఫ్రాంసు, రష్యాల సహాయముతో స్వాతంత్ర్యము సంపాదించుకొంది. ఈ యుద్ధములోనే గ్రీసు తరపున ఐచ్ఛిక సైనికుడుగా పోరాడుచూ బైరనను ఇంగ్లీషు కవి చనిపోయాడు. గ్రీసుపై అతడు కొన్ని చక్కని పద్యాలు వ్రాశాడు. నీవు ఎరుగుదువేమో!

1830 లో సంభవించిన రాజకీయమగు మార్పులను రెంటిని నే నిచ్చట ఉదహరిస్తాను. బోర్బనుల నిరంకుశత్వమునూ, పీడనమునూ భరించలేక ఫ్రాంసు వారినిమళ్ళీ తరిమివేసింది. కాని ప్రజాప్రభుత్వమును స్థాపించుటకు బదులు వేరొక రాజును ఎన్నుకొన్నది. ఇతని పేరు లూయీ ఫిలిప్పు. ఇతడు కొంత మెరుగుగా, నియమబద్ధ రాజువలె రాజ్యమేలెను. 1848 వరకు అతడు పరిపాలన సాగించెను. అప్పుడు మళ్ళీ వేరొక పెద్ద తిరుగుబాటు సంభవించెను. బెల్జియమ్‌లోకూడా 1830 లో ఒకతిరుగుబాటు జరిగెను. దీనికి ఫలితము హాలెండు, బెల్జియములు వేరుపడుట. యూరోపులోనున్న పెద్ద జాతులకు ప్రజాప్రభుత్వమంటే ఎంతమాత్రమూ ఇష్టములేదు. కాన ఒక జర్మను రాజును, బెల్జియంకు రాజును చేసిరి. వేరొక జర్మను రాజు గ్రీసుకు రాజయ్యెను. జర్మనీలో అనేక రాజ్యములుండుటచేత ఇట్టి రాజులుకూడా కావలసినంతమంది ఉన్నారు. ఎక్కడ సింహాసనము ఖాళీగా ఉన్నా వారిలో ఒకణ్ణి తీసుకో వచ్చు. నేడు ఇంగ్లాండులో రాజ్యమేలుచున్న రాజవంశము జర్మనిలోని

హనోవరు అనే చిన్న రాజ్యమునుండి వచ్చినదే అని జ్ఞాపకమున్నదా ?

1830 లో యూరోపులో అనేక ప్రదేశములలో తిరుగుబాట్లు సంభవించినవి—జర్మనీలో, ఇటలీలో, ముఖ్యముగా పోలెండులో. కాని ఈ తిరుగుబాట్లు రాజులచే అణచివేయబడినవి. పోలెండులో రష్యనులు క్రూరముగా ప్రజలను హింసించిరి. పోలిష్ భాష వారు మాటాడుకోరాదనికూడ శాసించిరి. ఈ సంవత్సరము—1830—యూరోపులో విప్లవములు పుట్టిన సంవత్సరమైన 1848 కి ఒకమాదిరి ప్రస్తావన అని చెప్పవచ్చును.

ఇవి యూరోపులో జరిగిన సంగతులు. అట్లాంటిక్ మహా సముద్రములో సంయుక్త రాష్ట్రములు క్రమేణా పశ్చిమముగా వ్యాపించు చుండెను. యూరోపులోని స్పర్థలూ, యుద్ధములూ దూరముగా ఉండుట చేత దానికంటలేదు. దానికి కావలసినంత భూమి ఉన్నది. వా రమితముగా అభివృద్ధి చెందుతూ యూరోపుతో తులతూగుటకు సిద్ధముగా ఉన్నారు. దక్షిణ అమెరికాలో మాత్రము గొప్ప మార్పులు జరిగినవి. ఇవి కలుగుటకు పరోక్షకారణము నెపోలియన్. నెపోలియన్ స్పెయినును జయించి అతని సోదరుణ్ణి సింహాసనంమీద కూర్చోబెట్టినప్పుడు దక్షిణ అమెరికాలోని స్పానిష్ అధినివేశములు తిరుగుబాటు చేసినవి. పాత స్పానిష్ రాజవంశముపై స్పానిష్, అమెరికన్ అధినివేశముల భక్తి కారణముగా వారికి స్వాతంత్ర్యము చిక్కెను. ఇది వింత విషయము. కాని ఇది నిమిత్తమాత్రము మాత్రమే. కొంతకాలమైన పిమ్మట ఏదో ఒక విధముగా అవి తెగతెంపులు చేసుకొనవలసియే యుండెను. దక్షిణ అమెరికా అంతటా స్వాతంత్ర్య భావములు అభివృద్ధి నందుచుండెను. దక్షిణ అమెరికా స్వాతంత్ర్య వీరుడు సైమన్ బొలివర్. దక్షిణ అమెరికాలోని బొలీవియా ప్రజాప్రభుత్వమునకతని పేరే పెట్టిరి. ఇట్లు నెపోలియన్ పతనమగుసరికి స్పానిష్ అమెరికాకు స్పెయిన్‌తో సంబంధము తెగిపోయెను. అది స్వాతంత్ర్యమునకు పోరాడుచుండెను.

నెపోలియన్ రంగమునుండి వెళ్ళిపోయినా పోరాటము సాగుచునే ఉండెను. చాలా సంవత్సరముల కాలము నూతన స్పెయినుతో ఈ పోరాటము జరుగుచుండెను. యూరోపియన్ రాజులు కొందరు స్పెయినులోని తమ సోదర రాజుకు సహాయము చేయవలెననీ, అమెరికన్ అధినివేశములలోని విప్లవకారుల నావిధముగా నణచివెయ్యవలెననీ అనుకొనిరి. కాని ఇట్లు ఇతరులు కలుగజేసికొనకుండ సంయుక్త రాష్ట్రములు ఆంక్ష పెట్టినవి. అప్పుడు సంయుక్త రాష్ట్రముల కధ్యక్షుడు మన్రో. ఉత్తర అమెరికాలోగాని, దక్షిణ అమెరికాలోగాని ఎక్కడనైనా సరే యూరోపియన్ రాజులు కలుగజేసికొన్నట్లయితే వారు సంయుక్త రాష్ట్రములతో యుద్ధము చేయవలసి యుండునని అతడు చెప్పెను. యూరోపియన్ జాతులు ఈ మాటలకు బెదిరిపోయిరి. నాటినుండి వారు దక్షిణ అమెరికా జోలికి పోలేదు. మన్రో అధ్యక్షుడు యూరోపును బెదిరించిన బెదిరింపుకు "మన్రో డాక్ట్రిన్" అని ప్రసిద్ధి వచ్చింది. చాలా కాలము పాటు దక్షిణ అమెరికా ప్రజాప్రభుత్వములను యూరోపు దురాశకు లోనుకాకుండ అది కాపాడింది. వాటిని అభివృద్ధి చెందనిచ్చింది. యూరోపునుండి వాటిని కాపాడింది కాని ఈ రక్షకత్వము వహించే సంయుక్త రాష్ట్రములనుండి వాటిని కాపాడేవారెవరూ లేరు. నేడవి సంయుక్త రాష్ట్రముల అధికారములో ఉన్నవి. మరీ చిన్న ప్రజాప్రభుత్వ రాజ్యములు పూర్తిగా సంయుక్త రాష్ట్రముల బొటనవ్రేలి కింద ఉండెను.

బ్రెజిల్ అను విశాలదేశము పోర్చుగల్ అధినివేశమైయుండెను. అమెరికాలోని స్పానిష్ అధినివేశములు స్వాతంత్ర్యమును పొందినప్పుడే ఇదిన్నీ పొందెను. 1830 సంవత్సరమునకు దక్షిణ అమెరికా అంతా యూరోపియనుల అధికారమునుండి విముక్తి పొందినట్లు మనము గ్రహించవచ్చు. ఉత్తర అమెరికాలో మాత్రము బ్రిటిషు అధినివేశమైన కెనడా ఉండెను.

మనమిప్పుడు ఆసియాకు వత్తము. ఇండియాలో ఇంగ్లీషువారు ప్రబల జాతి అనుటకు సందేహములేదు. యూరోపులో నెపోలియన్ యుద్ధములు చేయుచున్న కాలమున ఇంగ్లీషువారు కాలు నిలువదొక్కు-కొన్నారు. అంతేకాదు. జావానుకూడా స్వాధీనము చేసుకొన్నారు. మైసూరులోని టిప్పుసుల్తాను ఓడింపబడెను. 1819 లో మహారాష్ట్ర ప్రభుత్వము కూలద్రోయబడెను. పంజాబులో మాత్రము రంజిత్‌సింగు క్రింద ఒక సిక్కుల రాజ్యముండెను. ఇంగ్లీషువారు ఇండియా దేశమంతటిలోకీ మెల్లగా ప్రాకుతూ వెళ్ళి వ్యాపిస్తున్నారు. తూర్పున అస్సామును తమ రాజ్యములో కలుపుకొనిరి. ఆరకాన్, బర్మా తరువాతి కబళము కానుండెను.

ఇండియాలో బ్రిటిషువారు వ్యాపిస్తున్నపుడు, వేరొక గొప్ప యూరోపియన్ జాతి–రష్యా, మధ్య ఆసియాలో వ్యాపించుచుండెను. అప్పుడే అది తూర్పున పసిఫిక్ మహా సముద్రము, చీనాదేశము వరకూ ప్రాకినది. ఇప్పుడది మధ్య ఆసియా చిన్న రాజ్యములగుండా ఆఫ్ఘనిస్థానము పొలిమేరవరకూ పోవుచున్నది. తమ్ము సమీపిస్తూన్న మహా భూతమును చూచి ఇండియాలోని బ్రిటిషువారు భయపడ్డారు. భయము కొద్దీ ఆఫ్ఘనిస్థానముతో కారణములేనిదే యుద్ధమునకు కాలుదువ్వారు. కాని అందువల్ల వారికి చేతులు బాగా కాలినవి.

చీనా, మంచూల పరిపాలనలో ఉండెను. వర్తకముపేరా, మతముపేరా వచ్చే విదేశీయులను అనుమానించుటకు కారణముండి వారు అనుమానించి, వారిని ఆటంక పెట్టుటకు ప్రయత్నిస్తున్నారు. కాని ఈ విదేశీయులు దాని ద్వారములవద్ద నిలిచి కేకలు వేస్తూ అక్రమంగా ప్రవర్తించసాగారు. ముఖ్యముగా నల్లమందు వ్యాపారమును ప్రోత్సహించారు. బ్రిటిషు–చీనా వ్యాపారపు హక్కు తూర్పు ఇండియా వర్తక సంఘమువారికుండెను. నల్లమందు తన దేశమునకు రారాదని చీనా చక్రవర్తి శాశించెను. కాని దొంగతనముగా సరుకు దిగుచునే

ఉండెను. విదేశీయులు నిషిద్ధమగు నల్లమందు వ్యాపారము చేయుచునే ఉండిరి. ఇందువల్ల ఇంగ్లాండుతో యుద్ధము చేయవలసి వచ్చినది. ఈ యుద్ధమునకు "నల్లమందు యుద్ధము"అని సరియైన పేరునేపెట్టిరి. నల్లమందు చీనాదేశము తీసుకోవలసినదిగా బ్రిటిషు వారు బలవంతముచేసిరి.

1634 లో జపాను అన్యసంపర్కము లేకుండా తలుపులు మూసుకు కూర్చుండెనని ఇదివరలో చెప్పియుంటిని. పందొమ్మిదో శతాబ్ది ప్రారంభమునకూడా విదేశీయులందు ప్రవేశించుటకు వీలులేదు. కాని కవాటబద్ధమగు ఆ దేశములో షోగునేటు నానాటికీ దుర్బలమగుచూ వచ్చెను. నూతన పరిస్థితులు తలయెత్తుచుండెను. పాత పద్ధతి నవి తుదముట్టించుచున్నవి. ఇంకను దక్షిణమున ఆసియా, ఆగ్నేయమున యూరోపియన్ జాతులు నూతన ప్రదేశముల గ్రహించుచుండిరి. ఫిలిప్పైను దీవులు స్పానిష్ వారి అధీనములోనే ఉండెను. ఇంగ్లీషు వారును, డచ్చివారును పోర్చుగీసులను తరిమివేసిరి. వియన్నా కాంగ్రెసు అనంతరము డచ్చివారు తిరిగి జావాను, ఇతర ద్వీపములను పొందిరి. ఇంగ్లీషువారు సింగపూరుకును, మలయా ద్వీపకల్పమునకును ప్రాకిపోవు చుండిరి. అన్నాం, సయాం, బర్మా దేశములు అప్పుడప్పుడు చీనాకు కప్పము చెల్లించుచున్నప్పటికీ, ఇంకను స్వతంత్రముగా ఉండెను.

వాటర్లూ యుద్ధము మొదలు 1830 వరకూ గల పదిహేను సంవత్సరములలో ప్రపంచమున రాజకీయ స్థితి స్థూలముగా ఇట్టు లుండెను. యూరోపు ప్రపంచమునకంతకూ యాజమాన్యము వహించ బోతోంది. ఇట్టి పరిస్థితులకు యూరోపులో ఉత్సాహ మతిశయముగా ఉండెను. చక్రవర్తులూ, రాజులూ, అభివృద్ధికి ప్రతికూలముగానున్న ఇంగ్లీషు పార్లమెంటు సైతము ఉదారాశయముల చివరకు అణచి వేసితి మని భావించిరి. ఈ ఆశయములను వారు పెట్టెలోపెట్టి బిగించుటకు ప్రయత్నించిరి. వారి ప్రయత్నములు నిష్ఫలమైనవి. ఉండుండీ తిరుగు బాట్లు సంభవించినవి.

విధానము 1814 లో తుదముట్టెను. సరిగా నూరు సంవత్సరములకు, 1914 లో మహా యుద్ధము ప్రారంభమాయెను. ఇది ప్రపంచమంతా వ్యాపించెను. ఈ యుద్ధము జరిగిన నాలుగు సంవత్సరములలోనూ నష్టములూ, కష్టములూ దారుణముగా సంభవించెను. ఈ నూరేండ్ల కాలమును గురించీ మనము కొంత విపులముగా తెలుసుకొందము. వెనుకటి జాబులో ఈ నూరేండ్ల కాలము ప్రారంభించునరికి ప్రపంచ మెట్లుండెనో స్థూలముగా వ్రాసి ఉంటిని. ఈ శతాబ్దమునంతా ఒకమారు కలయచూచుట మంచిది. తరువాత వేర్వేరు దేశములలో ఈ శతాబ్ది భాగములను గురించి విచారింతుము. ఈ నూరేండ్లలోను ఇట్లు చేసినచో ముఖ్యవిశేషములు తెలుసుకోవచ్చును. గొప్ప విషయములను గమనించ వచ్చు. చిన్న విషయములను పరిశీలించవచ్చును.

ఈ నూరు సంవత్సరములునూ—1814 నుండి 1914 వరకు— చాలావరకు పందొమ్మిదో శతాబ్దిలో పడ్డట్లు నీవు గ్రహించియుందువు. వీటిని మనము పందొమ్మిదో శతాబ్దముగా భావించుకోవచ్చు. అట్లా చెయ్యడంలో కొంత తప్పు ఉన్నమాట వాస్తవం.

పందొమ్మిదో శతాబ్దం ఆకర్షకమైనది. దాని చరిత్రను గ్రహించుట సులభముకాదు. అది సర్వతోముఖమైన పెద్ద పటము. వెనుకటి శతాబ్దులవలె గాక మనము దాని సమీపమున నుండుటచే మనకది పెద్దదిగా, సంపూర్ణముగా కనిపించును. అందలి సహస్రవిషయములను విడదీసి తెలిసికొనుటకు ప్రయత్నించినప్పుడు దాని మహదాకారమూ, నానా విషయ సంకీర్ణతా, ఊపిరి ఆడకుండా చేయును.

యాంత్రికాభివృద్ధి అద్భుతముగా జరిగిన శతాబ్దమది. పారిశ్రామిక విప్లవము ననుసరించి యాంత్రిక విప్లవమువచ్చినది. మానవ జీవితమునకు నానాటికీ యంత్రము లవసరమైనవి. మానవుడిదివరలో చేసిన పనినే అవి అధికముగా చేసినవి. అతని క్లేశమును తగ్గించినవి. పంచ భూతములపై అతడంతగా అధారపడ నవసరము లేకపోయెను. వాటి

రాజకీయముగా జరిగిన మార్పులు ప్రజల మనముల నాకర్షించి నట్లు తోచును. కాని ఇంతకన్న ప్రధానమైన మార్పు పారిశ్రామిక విప్లవముతోపాటు వచ్చినటువంటిది. సరుకును ఉత్పత్తి చేయుట లోనూ, దేశ దేశములకు పంపించుటలోనూ అవలంబించు పద్ధతుల లోనూ, ప్రయాణముచేయు పద్ధతులలోనూ కలిగిన గొప్ప మార్పు. ఇంగ్లాండులోనూ, ఉత్తర అమెరికాలోనూ ఇది మెల్లమెల్లగా, నిరాఘాట ముగా వ్యాపిస్తూ లక్షలాది ప్రజల అలవాట్లనూ, ఆశయములనూ వివిధ తరగతి ప్రజల అన్యోన్య సంబంధమునూ మార్చివేయుచుండెను. యంత్ర ముల శబ్దముతోపాటు నూతనాభిప్రాయములు తలయెత్తుచుండెను; నూతన ప్రపంచము నిర్మింపబడుచుండెను. నానాటికీ యూరోపు మిక్కిలి సమర్థ మగుచుండెను. దానికి దురాశ ఎక్కువగుచుండెను. సామ్రాజ్య తత్త్వము తలకెక్కుచుండెను. అది మొండికెత్తుచుండెను. నెపోలి యన్ తత్త్వము యూరోపులో వ్యాపించినట్లు ఉండెను. కాని యూరోపులోనే సామ్రాజ్య వాదమును ఎదిరించి కూలద్రోసే భావము లునూ పెరుగుచుండెను.

ఈ కాలమున మనల నాకర్షించే సారసత్వమూ, సంగీతమూ కూడా ఉన్నవి. కాని నా కలమునింక పోనీయను. నేడిది చేయవలసిన పని అంతా చేసింది.

## 107

# ప్రపంచ యుద్ధమునకు ముందున్న నూరేండ్లు

నవంబరు 22, 1932

1814 లో నెపోలియన్ పదభ్రష్టుడాయెను. మరుసటి సంవత్సర మతడు ఎల్బానుండి తిరిగివచ్చి మరల ఓడిపోయెను. అతని పరిపాలనా

వల్ల అతడు భాగ్యవంతుడయ్యెను. ఇందుకు విజ్ఞానశాస్త్ర మధికముగా తోడ్పడెను. ప్రయాణమూ, రవాణా నానాటికీ వేగవంతమయ్యెను. రైళ్ళు వచ్చినవి. అంచీలబళ్ళు పోయినవి. స్టీమర్లు వచ్చినవి. తెర చాపల పడవలు పోయినవి. తరువాత సముద్రములపై ప్రయాణములు చేయు పెద్ద స్టీమర్లువచ్చినవి. ఇవి చూచుటకు గంభీరముగా, శక్తివంత ముగా కనిపించును. వేగముతో నిర్ణీత కాలములో ఒక ఖండమునుండి ఒక ఖండమునకు ప్రయాణముచేయును. ఈ సంవత్సరాంతమున ఆటోమా బైలు వచ్చెను. దానితో మోటారుకార్లు ప్రపంచమంతటా వ్యాపించెను. చివరకు వాయు విమానము వచ్చెను. విద్యుత్తను అద్భుతశక్తిని మాన వుడు వశము చేసుకొని స్వప్రయోజనమునకు ఉపయోగించ మొదలు పెట్టడంతోనే టెలిగ్రాఫు, టెలిఫోనులు వచ్చినవి. ఈ కారణమువల్ల ప్రపంచ స్వరూపమే మారిపోయెను. సంచార సాధనములు అభివృద్ధి చెందినకొద్దీ మానవులు అతి వేగముతో ప్రయాణములు చేయజొచ్చిరి. అందువల్ల ప్రపంచము ముడుచుకొనిపోయి చిన్నదైనట్లు కనిపించినది. ఇదంతా నేడు మనకు అలవాటగుటవల్ల వీటినిగురించి మనమాట్టే ఆలో చించము. కాని ఈ మార్పులూ, అభివృద్ధులూ మన ప్రపంచమునకు క్రొత్తగా వచ్చినవే. గత 100 సంవత్సరములలోను ఇవన్నీ వచ్చినవి.

ఇది యూరోపుకు, లేదా పడమటి యూరోపుకు అందు ముఖ్య ముగా ఇంగ్లాండుకు సంబంధించిన శతాబ్దము. పారిశ్రామిక విప్లవ మునూ, యాంత్రిక విప్లవమున్నూ అక్కడే ప్రారంభమైనవి. అక్కడే వృద్ధి చెందినవి. పడమటి యూరోపు వాటివల్లనే ప్రాముఖ్యము పొంది నది. సముద్రాధికారమునందూ, పరిశ్రమలందూ ఇంగ్లాండు ప్రముఖ మయ్యెను. క్రమేణా పడమటి యూరోపులోని ఇతర దేశములు దానిని కలుసుకొన్నవి. అమెరికా సంయుక్త రాష్ట్రములుకూడా ఇట్టి యాంత్రిక నాగరికతలో అభివృద్ధి మార్గమును పట్టినవి. పడమటనున్న పసిఫిక్కు మహా సముద్రమువరకూ రైళ్లు పడుటవల్ల ఈ పెద్ద దేశము ఒక జాతి

మైనది. తమ సొంత సమస్యలలోనూ, అభివృద్ధి మార్గములలోనూ వారు నిమగ్నులై ఉండుటచేత యూరోపును గురించిగాని, మిగత ప్రపంచమును గురించిగాని వారు పట్టించుకోలేదు. కాని తమవ్యవహారము లలో యూరోపు కలుగజేసికొనకుండ అవుదల చేయుటకు తగినశక్తి వారికుండెను. మన్రో సిద్ధాంతమును గురించి వెనుకటి జాబులో నేను వ్రాసియుంటిని. ఇది కారణముగా దక్షిణ అమెరికాలోని ప్రజాప్రభుత్వ రాజ్యములు యూరోపు దురాశకు గురికాలేదు. వీటిని లాటిన్ ప్రజా ప్రభుత్వములందురు. స్పెయిను, పోర్చుగల్ దేశముల ప్రజలు స్థాపించి నవి కాబట్టి వాటికాపేరు వచ్చినది. ఈ రెండు దేశములనున్నూ ఇటలీ, ఫ్రాంసులనున్నూ లాటిన్ జాతులందురు. యూరోపు నందలి ఉత్తర దేశములు ట్యూటానిక్ జాతులు. ఇంగ్లాండు ట్యూటనులయొక్క ఆంగ్లో సాక్సన్ శాఖ. అమెరికా సంయుక్త రాష్ట్రములలోని ప్రజలు తొలుత ఈ ఆంగ్లో సాక్సను శాఖకు చెందినవారే. తరువాత అనేక తరహాల మనుష్యులు అక్కడ వలస లేర్పరుచుకొనిరి.

మిగత ప్రపంచమంతా పారిశ్రామికముగానూ, యాంత్రికము గానూ వెనుకబడియుండెను. పడమటి దేశములలో ఉదయించిన క్రొత్త యాంత్రిక నాగరికతతో పోటీ చేయలేకుండెను. యూరోపులోని నూతన యంత్ర పరిశ్రమలు వెనుకటి కుటీర పరిశ్రమలకన్న త్వరగానూ, పుష్కలముగానూ సరుకును ఉత్పత్తి చేయుచుండెను. ఆ సరుకును ఉత్పత్తి చేయుటకు ముడి పదార్థములు కావలెను. ఇవి అంతగా పడ మటి యూరోపులో దొరకవు. సరుకు తయారైన పిమ్మట వాటిని అమ్మవలెను. అందుకు మార్కెట్లు కావలెను. కాబట్టి ముడిపదార్థము లను సరఫరా చేసేటట్టివీ, తయారైన సరుకును కొనేటట్టివీ దేశముల కొరకు పడమటి యూరోపు వెదక మొదలుపెట్టింది. ఆసియా, ఆఫ్రికాలు దుర్బలముగా అప్పుడుండెను. వన్యమృగమువలె యూరోపు వాటిమీద పడ్డది. పరిశ్రమలలో ముందడుగు వేసి ఉండుటవల్లనూ, సముద్రాధి

కారము కరగతమై యుండుటవల్లనూ ఇంగ్లాండు సామ్రాజ్య స్థాపన విషయమున అగ్రగామి యైనది.

యూరోపులో చెలామణీ అగుచున్న సంబార పదార్థములనూ, ఇతర వస్తువులనూ కొనుటకొఱకై యూరోపియనులు మొట్టమొదట ఇండియాకునూ, ప్రాచ్య దేశములకునూ వచ్చిరన్నమాట నీకు జ్ఞాపకముండవచ్చును. ఇట్లు ప్రాచ్య దేశపు సరుకు యూరోపు వెళ్లుచుండెను. ప్రాచ్య దేశపు మగ్గములపై నేసిన వస్త్రములూ పాశ్చాత్య దేశములకు పోవుచుండెను. ఇప్పుడన్ననో యంత్రాభివృద్ధితో ఈ వ్యాపారము తారుమారయ్యెను. పడమటి యూరోపులో తయారైన చవక సరుకు ప్రాచ్య దేశములకు రా మొదలుపెట్టెను. ఇంగ్లీషు సరుకు అమ్మకము బాహాటముగా జరుగుటకై తూర్పు ఇండియా వర్తక సంఘమువారు ఇండియాలోని కుటీర పరిశ్రమలను ఉద్దేశపూర్వకముగా చంపివేసిరి.

మహత్తర దేశమగు ఆసియాపై యూరోపు కూర్చున్నది. ఉత్తరమున రష్యన్ సామ్రాజ్యము ఆసియాఖండమంతటా వ్యాపించి యుండెను. దక్షిణమున ఇంగ్లాండు ఇండియాను తన వశము చేసుకొనెను. ఏ ఇతర జాతియునూ ఇంతటి మహదైశ్వర్య ప్రదమగు దేశమును గడించలేదు. పడమట తురుష్క సామ్రాజ్యము విచ్ఛిన్నమై పోవుచుండెను. టర్కీని "యూరోపులోని రోగి" అని చెప్పేవారు. నామకః స్వతంత్ర దేశమైనప్పటికీ పర్షియాలో ఇంగ్లాండు, రష్యాలు తమ అధికారమును చెలాయించుచుండెను. ఆసియా, ఆగ్నేయమున బర్మా, ఇండోచీనా, మలయా, జావా, సుమిత్రా, బోర్నియా, ఫిలిప్పైనులు మొదలగు దేశములను యూరోపు కబళించెను. సయాంలో ఒక చిన్న భాగము మాత్రము తప్పించుకొనెను. దూర ప్రాచ్యమున చీనాను యూరోపియన్ జాతులన్నియూ కొద్దికొద్దిగా గ్రహించుచుండెను. బలవంతాన చీనానుండి వారు అనేక విధములగు హక్కులను తీసుకొనుచుండిరి. జపాను దేశమొక్కటే యూరోపు కభిముఖముగా సమాన

దర్జాతో నిలిచెను. ఏకాంతవాసమునుండి వెలువడి మనోవేగముతో నూతన పరిస్థితుల కనుగుణముగా అది తన వ్యవహారములను సర్దుకొనెను.

ఈజిప్టును మినహాయిస్తే ఆఫ్రికా మిక్కిలి వెనుకబడియున్నది. యూరోపునది నిరోధించలేక పోయింది. కాబట్టి యూరోపియన్ జాతులు సామ్రాజ్యములు స్థాపించుకోవలెననే బుద్ధితో దానిమీద విరుచుకుపడ్డవి. ఈ మహాఖండమునవి ముక్కలుచేసి పంచుకొన్నవి. ఇండియాకు పోవు మార్గములో ఉన్నది కాబట్టి ఇంగ్లాండు ఈజిప్టును ఆక్రమించుకొనెను. ఈనాటినుండి ఇండియాను తమ పిడికిలిలో పెట్టుకుందామనే కోరిక బ్రిటిషువారి రాజనీతి అయినది. 1869 లో సూయజ్‌కాలువ తెరువబడెను. ఇందువల్ల యూరోపునుండి ఇండియాకు ప్రయాణము చేరువ అయ్యెను. ఈ కారణము వల్లనే ఈజిప్టు ఇంగ్లాండుకు అమూల్యమైనది. ఎందువల్లననగా సూయజ్ కాలువ వ్యవహారములలో ఈజిప్టు జోక్యము కలుగజేసికొనవచ్చును; ఇండియాకు పోవు సముద్రమార్గముపై అధికారము చెలాయించవచ్చును.

ఇట్లు యాంత్రికవిప్లవమునకు ఫలితముగ పెట్టుబడిదార్ల నాగరికత ప్రపంచమంతటా వ్యాపించెను. అన్ని దేశములందును యూరోపు ప్రబలముగానుండెను. పెట్టుబడిదార్ల పద్ధతి సామ్రాజ్య వాదమునకు దారితీసెను. కాబట్టి ఈ శతాబ్దమును సామ్రాజ్యవాద శతాబ్దమనిన్నీ అనవచ్చును. కాని ఈ నూతన సామ్రాజ్యవాదము వెనుకటి కాలమునాటి రోము, చీనా, ఇండియా, అరబ్బీ, మంగోలు సామ్రాజ్యవాదములకన్న భిన్నమైనది. ఇది కొత్తవిధమైన సామ్రాజ్యము. ముడివస్తువులను, మార్కెట్టులను ఇది అమితముగా కోరుచుండును. ఈ నూతన సామ్రాజ్యవాదము పారిశ్రామిక పరివర్తనమునకు పుట్టిన బిడ్డ. "బావుటా ననుసరించి వర్తకము" అని చెప్పుదురు. తరుచు బైబిలు ననుసరించి బావుటా వచ్చుచుండెను. మతమూ, విజ్ఞాన శాస్త్రమూ, దేశాభిమానమూ

ఏకైక ప్రయోజనము నుద్దేశించి దుర్వినియోగము చేయబడినవి. పారిశ్రామికముగా వెనుకబడియున్న ప్రపంచమందలి దుర్బల జాతులను స్వలాభముకొరకు వినియోగించు కొనుటయే ఈ ప్రయోజనము. ఇట్లు చేయుటవల్ల మహా యంత్రాధిపతులున్నూ, పారిశ్రామిక పరివర్తనాధికారులున్నూ నానాటికీ భాగ్యవంతులగుదురనియే ఉద్దేశము. క్రైస్తవమత ప్రచారకుడు మొట్టమొదట సత్యము పేరుచెప్పి, ప్రేమ పేరు చెప్పి వచ్చును. అతడు సామ్రాజ్యమునకు తొలిహద్దు. అతనికేమైనా అపకారము జరిగినట్లయితే ఇది మిషగా పెట్టుకొని అతని దేశమువా రా దేశము నాక్రమించుకొందురు. హక్కులను వారివద్దనుండి బలవంతాన తీసుకొందురు.

పరిశ్రమలును, నాగరికతయును పెట్టుబడిదార్ల వశమైనప్పుడు తప్పనిసరిగా వచ్చేది ఇట్టి సామ్రాజ్యవాదమే. పెట్టుబడిదార్ల పద్ధతివల్లనే జాతీయతాభావమున్నూ పెంపొందినది. అందువల్లనే ఈ శతాబ్దమును జాతీయతాశతాబ్దమనిన్నీ అనవచ్చును. ఈ జాతీయతలోవున్నది స్వదేశాభిమానమొక్కటేకాదు. పరదేశ ద్వేషమున్నూ మిళితమైయుండెను. తమ చేరెడు నేలను గొప్పచేసుకోవడంవల్లనున్నూ, ఇతరుల నేలను దూషించడం వల్లనున్నూ వివిధ దేశములలో వైషమ్యములు పుట్టక తప్పదు. వివిధ యూరోపియన్ దేశములలో పుట్టిన పారిశ్రామిక స్పర్థలున్నూ, సామ్రాజ్య స్పర్థలున్నూ పరిస్థితులను మరింత పాడుచేసినవి. 1814-15 వియన్నాలో కాంగ్రెసు నిర్ణయించిన యూరోపు దేశపటము వేరొక వైషమ్య కారణమయ్యెను. దీని ప్రకారము కొన్ని జాతులు అణచిపెట్టబడినవి. ఇతరుల పాలనక్రింద బలవంతమున ఉంచబడినవి. ఆస్ట్రియా-హంగరీ ఒక కలగూరగంప సామ్రాజ్యమైనది. అనేక తరహాల ప్రజలందుండిరి. ఒకరినొకరు మనసారా ద్వేషించుకొనుచుండిరి. యూరోపుకు ఆగ్నేయముననున్న తురుష్క సామ్రాజ్యములో, తురుష్కులు కాని వారు, బాల్కనులలో అనేకులుండిరి. ఇటలీ అనేక రాజ్యములుగా

విభజింపబడినది. అందు కొంత భాగము ఆస్ట్రియాకింద ఉండెను. ఈ యూరోపు దేశపటమును మార్చుటకు యుద్ధముద్వారాను, విప్లవము ద్వారాను ఉండుండీ ప్రయత్నములుచేయబడినవి. వియన్నా నిర్ణయము కాగానే ఇట్టివికొన్ని వచ్చినవని వెనుకటి జాబులో వ్రాసియుంటిని. ఈ శతాబ్దము రెండవభాగములో ఉత్తరమున ఆస్ట్రియనుల పరిపాలననుండి ఇటలీ బయటపడగలిగింది. మధ్యభాగములో పోపు ఆధిపత్యమును వద లించుకోగలిగింది. ఇట్లు అది ఒక సంయుక్తజాతి అయినది. ఇది జరిగిన తరువాతనే జర్మనీ, ప్రషియా నాయకత్వమున ఏకమైనది. జర్మనీచే ఫ్రాంసు ఓడించబడి, పరాభవింపబడినది. దాని పొలిమేర రాష్ట్రములు రెండు ఆల్సేసు, లోరైను అనునవి జర్మనీ వశము చేసుకొన్నది. నాటి నుండియు పగ తీర్చుకోవలెనని ఫ్రాంసు తహతహలాడుచుండెను. యాభై సంవత్సరములు గడవకముందే దారుణముగా అది రక్తపాత యుక్తమైన పగ తీర్చుకొన్నది.

యూరోపియన్ దేశములలో ఇంగ్లాండు చాలా అదృష్టదేశము. ఇందుకు కారణము అది ముందుగా రంగమున ప్రవేశించి నాయకత్వము వహించుట. మంచి వస్తువులన్నియు దానికే చిక్కినవి. ఉన్న పరి స్థితులతో అది తృప్తిపడి ఉండెను. కొత్తరకము సామ్రాజ్యమునకు ఇండియా మాదిరిగా ఉండెను. అది భాగ్యవంతమగు దేశము. స్వార్థోప యోగమునకు దానిని తిప్పుకొనగానే ఎడతెగని సువర్ణ ప్రవాహము ఇంగ్లాండుకు ప్రవహించినది. ఇంగ్లాండు స్వాధీనములో ఇండియా ఉండుటచూచి సామ్రాజ్య నిర్మాతలుకానున్నవారికి కన్నుకుట్టినది. ఇండియా పంపిణీనిబట్టి వారు ఇతర ప్రదేశములందు సామ్రాజ్యములు నిర్మించ పూనుకొనిరి. ఫ్రెంచివారు కొంతమట్టుకు కృతకృత్యులైరి. జర్మనులుఆలస్యముగా రంగమునకుదిగుటచేత వారికేమిన్నీ మిగలలేదు. యూరోపులోని ఈ మహాజాతులలో రాజకీయ వైషమ్యములు ప్రపంచ మందంతటా తలయెత్తెను. ప్రతి జాతీ దొరికిన ప్రదేశముల నన్నింటినీ

కబళించ ప్రయత్నించినది. అట్టి కార్యములోనే నిమగ్నమైయున్న వేరొక జాతితో సంఘర్షణ తటస్థించేది. ముఖ్యముగా ఇంగ్లాండు, రష్యాల మధ్య ఇట్టి సంఘర్షణ జరుగుతూనే ఉండెను. ఇందుకు కారణము మధ్య ఆసియానుండి రష్యా, ఇంగ్లాండు స్వాధీనములో ఉన్న ఇండియాను కబళిస్తుందేమోనన్న భయము. కాబట్టి ఇంగ్లాండు రష్యాకు ఎప్పుడును అడ్డు తగులుచునే ఉండెను. ఈ శతాబ్ది మధ్యమున రష్యా టర్కీని ఓడించి కాంస్టాంటినోపులుపై కన్ను వేసినప్పుడు ఇంగ్లాండు టర్కీపక్షము చేరి రష్యాను తరిమివేసెను. టర్కీమీద ప్రేమకొద్దీ ఇంగ్లాండీపని చేయలేదు. రష్యామూలంగా ఇండియా పోతుందేమోనన్న భయముతోనే ఈ పని చేసింది.

జర్మనీ, ఫ్రాంసూ, అమెరికా సంయుక్త రాష్ట్రములూ పారిశ్రామికముగా వృద్ధినంది ఇంగ్లాండును కలుసుకొనుటవల్ల ఇంగ్లాండుయొక్క పారిశ్రామికాధిక్యము క్రమక్రమముగా సన్నగిల్లింది. శతాబ్దాంతమునకు పరిస్థితులు విషమించినవి. ఈ యూరోపియన్ జాతుల బ్రహ్మాండమైన అత్యాశలకు ప్రపంచము చాలడములేదు. ప్రతీ జాతియు, ఇతరజాతులను చూచి భయపడ జొచ్చినది. ద్వేషింపజొచ్చినది. అసూయతో చూడజొచ్చినది. ఈ ద్వేషములు కారణముగా వారు తమ సైన్యములను, యుద్ధ నౌకలను వృద్ధి జేసికొనజొచ్చిరి. ఇట్టి మారణ సాధనములను తయారు చేయుటలో ఒక జాతిని మించి వేరొక జాతి పోటీపడుచుండెను. ఇతర జాతులతో పోరాడుటకు కొన్ని జాతులు మైత్రిని చేసుకొనుచుండిరి. ఇట్టి మైత్రులు యూరోపులో రెండు విధములుగా పరిణమించి ప్రతిస్పర్థులైనవి. ఒక మిత్రమండలికి ఫ్రాంసు నాయకత్వము వహించెను. లోపాయికారీగా ఇంగ్లాండు ఫ్రాంసును చేరెను. రెండవ మిత్రమండలికి జర్మనీ నాయకత్వము వహించెను. యూరోపంతయు సాయుధులగు సైనికులతో నిండిపోయెను. పరిశ్రమలలో, వర్తకములో, యుద్ధ సామాగ్రిలో యథాప్రకారము తీవ్రముగా పోటీ జరుగుచునే

ఉండెను. ప్రతీ పాశ్చాత్య దేశములోనూ సంకుచితమగు జాతీయ భావము ప్రోత్సహింపబడెను. ప్రజాసామాన్యమును మోసపుచ్చి పొరుగు దేశములను ద్వేషించునట్లు చేయడమూ, యుద్ధమునకు వారు సిద్ధముగా ఉండునట్లు చేయడమూ ఇందలి ఉద్దేశము.

ఇట్లు యూరోపు ఖండమంతటా వివేచనా రహితమైన జాతీయత విజృంభించినది. ఇది వింత విషయమే. ప్రయాణసౌకర్యములు వృద్ధి అగుటచేత వేర్వేరు దేశములు సమీపమునకు వచ్చినవి. వెనుకటి కన్న జను లెక్కువగా ప్రయాణములు చేయుచుండిరి. ఒకరి నొకరు బాగుగా తెలిసికొన్నప్పుడు వారివారికున్న దుర్భావములు తగ్గుననిన్నీ, సంకుచితాభిప్రాయములు పోయి విశాల దృక్పథ మేర్పడుననిన్నీ అనుకొనుటకు వీలున్నది. కొంతవరకూ ఇట్లు జరిగినమాట వాస్తవమే. పరిశ్రమలకు సంబంధించిన పెట్టుబడిదారీ పద్ధతిని పురస్కరించుకొని తయారైన సాంఘిక నిర్మాణమంతా ఎట్లున్నదంటే—అది జాతికీ జాతికీ,తరగతికీ తరగతికీ, మనిషికీ మనిషికీ వైషమ్యమును పుట్టించే టట్లున్నది.

ప్రాచ్య దేశములలోకూడా జాతీయత తలయెత్తి వృద్ధిచెందింది. తమ దేశముపై అధికారమువహించి దానిని స్వార్థోపయోగమునకై వినియోగిస్తూన్న పరదేశీయులను నిరోధించ మొదలుపెట్టింది. తొలుదొల్త ప్రాచ్య దేశములందలి ఫ్యూడల్ గతశేషులు విదేశ ప్రభుత్వమును నిరోధించిరి. అట్లు చేయకున్న వారికి మొదలుకే మోసము వచ్చునట్లుండెను. కాని వారు కృతకృత్యులగుటకు సావకాశము లేదు. కృతకృత్యులు కానూలేదు. తరువాత మత దృక్పథముతో కూడిన నూతన జాతీయత తలయెత్తినది. కొన్నాళ్ళకీ మతవాసనలు తొలగిపోగా పాశ్చాత్య జాతీయతవంటి జాతీయత ఆవిర్భవించెను. జపానులో విదేశ పరిపాలనము లేకుండ చేసికొనిరి. అచ్చట ప్రోతహింపబడ్డ జాతీయత తీవ్రమైన, సగము ఫ్యూడల్ వాసనగల జాతీయత.

మొట్టమొదటినుండియు యూరోపియనుల ఆక్రమణను ఆసియా నిరోధించుచునే ఉండెను. కాని యూరోపియన్ సైన్యములకున్న నూతన ఆయుధముల శక్తి సామర్థ్యములను గ్రహించిన పిమ్మట ఈ నిరోధము మనస్ఫూర్తిగా జరుగలేదు. యూరోపులో విజ్ఞానశాస్త్రాభి వృద్ధీ, యాంత్రికాభివృద్ధి కారణముగా యూరోపియన్ సైన్యములు ఆనాటి ప్రాచ్య దేశముల సైన్యములకన్న సమర్థముగా ఉండెను. కాబట్టి ప్రాచ్య దేశములు తమ అసమర్థతను తెలిసికొని దుఃఖముతో తల వంచవలసినవారైరి. ప్రాచ్య దేశములు ఆధ్యాత్మికకాంక్ష కలవారనియు, పాశ్చాత్యులు భౌతిక కాంక్ష కలవారనియు కొందరు చెప్పుదురు. ఈ ఊహ భ్రాంతి జనకము. యూరోపు ఆక్రమణకు ప్రారంభించినప్పుడు, 18, 19 శతాబ్దములలో తూర్పు, పడమర దేశముల మధ్యనున్న నిజ మైన భేదము ఏమనగా తూర్పు దేశములు మధ్యయుగ సంప్రదాయము లలో మునిగి ఉండెను; పడమటి దేశములు పారిశ్రామికముగా, యాంత్రికముగా వృద్ధినందియుండెను. పాశ్చాత్యుల యుద్ధ కుశలతా, వారి విజ్ఞాన శాస్త్రాభివృద్ధీ, యంత్రములునడిపే వారినేర్పూ చూచి మొట్టమొదట భారత దేశమున్నూ, ఇతర ప్రాచ్య దేశములున్నూ విభ్రాంతమైనవి. ఇందువల్ల యుద్ధ విషయములందును, యంత్రములు నడుపు విద్యయందును తాము వారికన్న తక్కువ అనే భావం వారిలో అంకురించింది. అయినప్పటికీ జాతీయత పెరిగినది. విదేశీయుల ఆక్రమణమును నిరోధించవలెననీ, వారిని తరుమగొట్టవలెననీ కోరిక ప్రబలింది. 20వ శతాబ్ది తొలి రోజులలో ఒక విశేషము జరిగినది. ఇది ఆసియా మనస్సుపై హత్తుకొన్నది. ఈ విశేషము జారు పరిపాలన మందున్న రష్యాను జపాను ఓడించడమే. చిన్న దేశమైన జపాను, యూరోపియన్ జాతులలో గొప్పది, శక్తివంతమైనదీ అగు రష్యాను ఓడించడం చాలామందికి ఆశ్చర్యకరంగా ఉండెను. ఆసియాలో ఈ ఆశ్చర్యము సంతోషరూపము దాల్చెను. పాశ్చాత్యుల ఆక్రమణకు వ్యతి

రేకముగా జపాను ఆసియా కంతకూ ప్రాతినిధ్యము వహించినట్లు భావింపబడెను. అప్పటిమట్టుకు జపాను ప్రాచ్యదేశముల కన్నిటికీ ప్రియమయ్యెను. నిజమునకు జపాను ఆసియా ప్రతినిధికాదు. యూరోపులో గొప్ప జాతులవలెనే అదిన్నీ స్వార్థమునకై పోరాడెను. జపాను విజయవార్తలు విని నేనెంతో ఉత్సాహము చెందుతూ ఉండేవాడినని జ్ఞాపకం. ఇప్పటి నీవయస్సే అప్పటి నా వయస్సు.

పాశ్చాత్యదేశముల సామ్రాజ్యవాదము అతిశయమైనకొద్దీ ప్రాచ్య దేశములలో దానిని నిరోధించుటకూ, పోరాడుటకూ జాతీయత పెరిగినది. ఆసియా ఖండమందంతటా, పడమట అరబ్బీ జాతులు మొదలుకొని దూర ప్రాచ్యమున మంగోలియన్ జాతుల వరకూ ఉన్న దేశములలో జాతీయోద్యమములు తల యెత్తినవి. తొలుత జాగరూకతతో మెల్లగా అవి నడిచినవి. మితవాదమునుండి క్రమక్రమముగా అవి అతివాదములోకి దిగినవి. ఇండియాలో జాతీయసభా (కాంగ్రెస్) ప్రారంభములు పొడగట్టెను. బాల్యము జరుగుచుండెను. ఆసియా తిరుగుబాటు ప్రారంభమయ్యెను.

మన 19వ శతాబ్ది పర్యవేక్షణ ఇంకను ముగియలేదు. కాని ఈ జాబు ఇప్పటికే పెద్దదైనది. కాబట్టి ముగిస్తున్నాను.



(సమాప్తి.)



## మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA113B147 |
| పుస్తకం పేరు | ప్రపంచచరిత్ర 4 |
| తారీఖు | 26/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 215 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | 8 |
| లేని పేజీలు | 1,2 |
| తయారు చేసినది | Apsan |
| పేజీలు విడదీసినది | Apsan |
| స్కాన్ చేసినది | Susmitha |
| పరీక్ష చేసినది | prathyusha |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |